# చతుర

ఉగాది శుభాకాంక్షలు

మార్చి 2015
రూ. 15/-

* వాణిశ్రీ నిజరూపాలు .. 6
* కొత్త శీర్షిక చమత్'కారం' .. 23
* ఆర్కే లక్ష్మణ్ చతురోక్తులు



# భామనే.. సత్యభామనే..!

★ ఎనభై ఎనిమిది దేశాల అందాల భామలను వెనక్కునెట్టి 2014 ఏడాది విశ్వసుందరిగా నిలిచిన పౌలిన వెగా విశేషాలు..

★ కొంచెం సృజన జోడిస్తే కాగితం జూకాలు మీరే చేసుకోవచ్చు

★ చల్ల చల్లని వేసవి పానీయాల తయారీ!

మరెన్నో ఆసక్తికరమైన అంశాలతో అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా.. ప్రత్యేకంగా ముస్తాబై వచ్చిన

భామనే.. సత్యభామనే..!
122వ పేజీలో..

– సంపాదకులు



సంపుటి -38
సంచిక - 2
446వ సంచిక, పేజీలు : 132
మార్చి 2015

# చతుర





'ముందు పిల్ల పెళ్లి చెయ్యాలిరా! వాడికి ఏదైనా ఉద్యోగం చూడాలి. వీళ్ల గురించే నాకు దిగులురా!' దుబాయ్‌లో వ్యాపారం దివాళా తీసి ఆస్తి అంతా పోవడంతో తిరిగి స్వగ్రామానికి వచ్చిన పురుషోత్తం తన ఇద్దరు తమ్ముళ్లను సహాయం అడిగాడు.

'చూద్దాం అన్నయ్యా!' ధైర్యం చెప్పాడు తమ్ముడు మన్మథరావు.

'కాంతి కొడుకు బాగానే ఉంటాడు అన్నయ్యా! పైగా దానికి నువ్వంటే చాలా అభిమానం. వాళ్లు గుంటూర్లో ఇల్లు కట్టుకున్నారు. బావ ఆటోనగర్లో షాపు నడుపుతున్నాడు. లారీలు కూడా ఉన్నాయి. గీతికని వాడికిచ్చి పెళ్లి చేద్దాం' చెప్పాడు మరో తమ్ముడు లక్ష్మణరావు.

ఇంతకీ గీతికని కోడలిగా చేసుకోవడానికి ఆ చెల్లెలు ఒప్పుకుందా? అసలు పురుషోత్తం వ్యాపారం ఎలా దివాళా తీసింది? మనుషుల మనస్తత్వాలను చిత్రికపడుతూ ఆద్యంతం ఆసక్తిగా చదివించే **వాణిశ్రీ నిజరూపాలు**

6వ పేజీలో..

# నిజరూపాలు

'గీతిక పెళ్లి చేయాలనుకుంటున్నాంరా ఈ సంవత్సరం. దానిపెళ్లికోసం మీదగ్గర ఉంచిన యాభై తులాల బంగారం ఇవ్వు' తన బావమరిదిని అడిగాడు పురుషోత్తం.

'ఆ బంగారం బ్యాంకులో ఉంది బావా! అత్యవసరమై బంగారం బ్యాంకులో పెట్టి పదిలక్షలు తెచ్చాను. ఇపుడు అది విడిపించడానికి అవసరమైన డబ్బు నా దగ్గర లేదు బావా' నసిగాడు బాలకృష్ణ.

'నా బంగారం నువ్వెలా బ్యాంకులో పెడతావు? ఇన్నాళ్లూ ఆ బంగారంతో పిల్లపెళ్లి చేయొచ్చని ధీమాగా ఉన్నాను. ఇపుడు దాని పెళ్లెలా చేసేది?' అయోమయ స్థితిలో పెడబొబ్బలు పెట్టాడు పురుషోత్తం.

ఆ తర్వాత ఏం జరిగింది?

భూమి సూర్యుని చుట్టూనే కాదు డబ్బు చుట్టూ కూడా తిరుగుతుందన్న తిలక్ మాటలకు అక్షరసాక్ష్యం వాణిశ్రీ నవల

**నిజరూపాలు**

చతుర మార్చి కానుక!

బొమ్మలు : అనంత్



రేపల్లె ఫాస్ట్ ప్యాసింజర్ తెనాలి జంక్షన్‌లో ఆగింది. తెల్లవారు జాము ఆరు కావస్తోంది.

పురుషోత్తం, తన కూతురు గీతిక, కొడుకు చైతన్యలను నిద్రలేపాడు.

"డాడీ! మన ఊరు వచ్చేసిందా? " ఆవులిస్తూ అడిగాడు చైతన్య.

"మన ఊరు అప్పుడే రాదు. తెనాలి వచ్చింది. ఇక్కడ్నుంచి బస్సులో వెళ్లాలి" చెప్పాడు పురుషోత్తం.

"బస్సులోనా? " ముఖం చిట్లించి అంది గీతిక.

"యస్!"

"డాడీ! కారులో పోదాం"

"ఇది దుబాయ్ కాదు. కారులో తిరగడానికి. మన పరిస్థితుల్ని బట్టి లైఫ్‌స్టైల్ మార్చుకోవాలి. పాస్ట్ ఈజ్ పాస్ట్. దుబాయ్‌లో మనం మిలియనీర్లం. ఫర్ ద ప్రజెంట్ వుయ్ ఆర్ పూర్ పీపుల్" చెప్పాడు పురుషోత్తం.

ముగ్గురూ ట్రైన్ దిగి ప్లాట్‌ఫారం మీద నిల్చున్నారు. గీతికకి, చైతన్యకు తండ్రి మీద కోపంగా ఉంది. దుబాయ్ నుంచి హైదరాబాద్‌కి ఫ్లైట్‌లో వచ్చారు. అక్కడ్నుంచి విజయవాడకు ఫ్లైట్‌లో రావాలనుకున్నారు. కానీ పురుషోత్తం ఒప్పుకోలేదు. 'సంక్రాంతి సీజన్. ఫ్లైట్ చార్జెస్ మూడు, నాలుగు రెట్లు పెంచారని ట్రావెల్ ఏజెంట్ చెప్పాడు. ట్రైన్‌లో వెళ్దాం' అన్నాడు. అది కూడా ఏ సూపర్‌ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ ఎ.సి. కోచ్‌లో కాదు. డొక్కు ప్యాసింజర్‌లో. కుషన్ కూడా సరిగాలేని బెర్త్‌మీద పడుకుంటే సరిగా నిద్రపట్టలేదు. కుదుపులకు నడుం నొప్పి కూడా వచ్చింది.

ట్రైన్ దిగిన జనం ఎగ్జిట్ వైపు వెళ్లిపోతున్నారు. ప్లాట్‌ఫారం కోలాహలంగా ఉంది ట్రైన్ దిగిన జనంతో, రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన బంధుమిత్రులతో..

పురుషోత్తం అటూ ఇటూ పరికించి చూస్తున్నాడు, తెలిసిన వాళ్లు ఎవరైనా కనిపిస్తారేమోనని! 'హుఁ.. ఎవరు కనిపిస్తారు? తను ఈ ప్రాంతం వదిలి వెళ్లిపోయి ముప్పై ఏళ్లయింది. అప్పుడప్పుడు బంధువుల ఇళ్లల్లో పెళ్లికో, చావుకో రావడం తప్పించి, పట్టుమని పదిరోజులు ఉంది లేదు' అనుకుని నిట్టూర్చాడు.

"డాడీ! ఎవరి కోసం వెయిటింగ్? " విసుగ్గా అడిగాడు చైతన్య.

"బాబాయిల కోసం"

"ఎక్కడా? ట్రైన్ ఆగి పావుగంట అయిందిగా? "

"వస్తుంటారు" వాచీలో టైమ్ చూసుకుంటూ అన్నాడు పురుషోత్తం.

తమ్ముళ్లు స్టేషన్‌కి రాలేదని అర్థమైంది అతనికి. 'ఎంతలో ఎంత మార్పు? లోగడ తను దుబాయ్‌లో బయల్దేరిన తర్వాత గంట గంటకు ఫోన్ చేసేవాళ్లు. 'అన్నయ్యా! ఫ్లైట్ ఎక్కావా? అన్నయ్యా! ఫ్లైట్ హైదరాబాద్ వచ్చిందా? అన్నయ్యా! ట్రావెల్ ఏజెంట్ కారు పంపాడా? అన్నయ్యా! ఎక్కడ ఉన్నావు? కారు ఎక్కడ ఉందిప్పుడు? సూర్యాపేట దాటిందా? అన్నయ్యా! మేం తెనాలిలో వెయిట్ చేస్తున్నాం..' అంటూ ఎంత హడావిడి? ! అప్పట్లో తమ్ముళ్లిద్దరూ తను దుబాయ్ నుంచి వస్తుంటే తెనాలి వచ్చి ఎదురు చూస్తుండేవాళ్లు. తను వచ్చిన కారులో ఎక్కి తమ ఊరు చిలుమూరు తీసుకెళ్లేవాళ్లు. 'మా పురుషోత్తం అన్నాయ్ దుబాయ్ నుంచి వస్తున్నాడు పెళ్ళికి' అని ఊళ్లో అడిగిన వారికి, అడగని వారికి గొప్పగా చెప్పేవాళ్లు.

అప్పుడు తను మిలియనీర్. ఇప్పుడు పాపర్, వాళ్ల దృష్టిలో. అందుకే పెద్దలు అన్నారు 'చెడి బతకొచ్చుగానీ, బతికి చెడి బతకడం కష్టం' ఇది మాయలోకం. మన ఆర్థిక పరిస్థితిని బట్టే తోటి వారైనా, తోడ బుట్టిన వారైనా, బంధుమిత్రులైనా గౌరవ,

# మీ జుట్టు రాలిపోతుందా ? ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా దీనికి సరైన పరిష్కారం!



డా. దీపిక నర్రా
(MD Dermatology)
కన్సల్టెంట్ డెర్మటాలజిస్ట్

అందమైన, ఒత్తైన శిరోజాలను మనలో ప్రతి ఒక్కరు కోరుకుంటారు. వాస్తవానికి ఇది సాధ్యమేనా ? నేడు పొద్దు పొడిచినప్పటి నుండి పొద్దువాలేలోపు తలపై ఏమాత్రం వెంట్రుకలు మిగులుతాయోనన్న భయం వెంటాడుతున్నది. **అధికంగా జుట్టు రాలడం లేదా బట్టతల వల్ల కోల్పోయిన జుట్టుని తిరిగి పొందుటకు మార్గాలు ఏమిటి ?** జుట్టుకి కావాల్సిన ఐరన్, బి12, థైరాయిడ్, ఇతర హార్మోన్లు ఏమైనా తక్కువగా ఉంటే సరిదిద్దుకొంటూ రాలిపోయిన జుట్టును తిరిగి పొందటానికి Platelet rich plasma వంటి stimulation పద్ధతులతో ప్రయత్నించవచ్చు. Oliva అడ్వాన్స్‌డ్ హెయిర్ అండ్ స్కిన్ క్లినిక్స్‌కు చెందిన కన్సల్టెంట్ డర్మటాలజిస్ట్ డా. దీపిక ఇలా అన్నారు. "Oliva లో ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్ చికిత్సలో ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా ఇంజెక్షన్లతో పాటు టాపికల్ మినాక్సడిల్ వాడతారు. ఈ విధానంలో బట్టతల గల వ్యక్తి నుండి మేము కొంత రక్తం సేకరిస్తాము. సెంట్రల్ డిఫ్యూజన్ తర్వాత ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మాను వేరు చేస్తారు. ఈ ప్లేట్‌లెట్లలో వృద్ధి కారకాలు, వాస్కులర్ ఎండోథెలియల్ వృద్ధి కారకాలు మరియు రూపాంతరం చెందే వృద్ధి కారకాల నుండి వచ్చిన ప్లేట్ లెట్లు సమృద్ధిగా ఉంటాయి. ఇవి మీ జుట్టు ఒత్తుగా, దృఢంగా పెరుగుటకు మరియు ఆరోగ్యవంతంగా కన్పించుటకు దోహదపడతాయి. ఇది వైద్య చికిత్స ద్వారా మీ జుట్టు యొక్క పెరుగుదల మరియు ఆరోగ్యాన్ని పెంపొందిస్తుంది. ఎట్టి దుష్ఫలితాలు లేవు మరియు ఇన్ఫెక్షన్లకు అవకాశమే లేదు. మంచి ఫలితాల కోసం నెలవారీ అంతరాలలో సాధారణంగా ఎనిమిది సెషన్లు ఆచరించవలెను". మీరు కోల్పోయిన జుట్టును తిరిగి పొందటానికి సమర్థవంతమైన మరియు సురక్షితమైన పరిష్కారమార్గమిది.

**ఫీమేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**

**మేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**

**ఈ ట్రీట్‌మెంట్‌కు సుమారుగా 35,000 నుండి 50,000 వరకు ఖర్చు అవుతుంది.**

మర్యాదలు చూపిస్తారు. మహానుభావుడు మార్క్స్ అననే అన్నాడు 'మానవుల మధ్య బంధాలన్నీ ఆర్థిక సంబంధాలే' అని' అరవై ఏళ్లొచ్చిన తనకే మనుషుల నైజం సరిగా అర్థం కావడం లేదు. పసివాళ్లు తన పిల్లలు ఎలా బతుకుతారు? ఈ మాయల మోసాల ప్రపంచంలో? అడుగడుగునా మోసాలే. ఛాన్స్ దొరికితే ప్రతివాడూ ఏమార్చేవాడే! తన తర్వాత వీళ్లు ఎట్లా బతుకుతారో? '

పురుషోత్తం తన పిల్లలవైపు చూస్తూ తలపోశాడు. పిల్లలిద్దరూ సూట్‌కేసుల మీద కూర్చున్నారు, అటూఇటూ తిరుగుతున్న జనాన్ని గమనిస్తూ..

పెద్ద తమ్ముడు మన్మథరావుకి ఫోన్ చేశాడు పురుషోత్తం. చాలాసేపు రింగవుతూ ఉంది కానీ ఎత్తటం లేదు. నాలుగుసార్లు ట్రైచేసిన తర్వాత రిసీవర్ లిఫ్ట్ చేశారు.

### కొత్తగాలి... 

**సామాన్యుని**
**పెదాలమీద**
**దరహాసం మాయం!**
**'ధర' హాసం ప్రత్యక్షం!**

– జి. శైలూషి,
హైదరాబాద్

"హలో! ఎవరూ? " విసుగ్గా ఉంది ఆమె కంఠం.

"నేను పురుషోత్తంని మాట్లాడుతున్నా! మన్మథరావు లేడా? "

"అయ్యో! బావగారూ! మీరా? బాగున్నారా? " అంది శుభలక్ష్మి.

"బాగానే ఉన్నాను"

"మీ తమ్ముడికి ఒంట్లో బాగోలేదండీ. జ్వరం.. లేపమంటారా? "

"జ్వరమా! లేపొద్దులే!" అని ఫోన్ కట్ చేశాడు పురుషోత్తం.

తర్వాత చిన్నతమ్ముడికి ఫోన్ చేశాడు. లక్ష్మణరావు వెంటనే పలికాడు.

"ఏరా! స్టేషన్‌కి ఎవరూ రాలేదేం? " సీరియస్‌గా అడిగాడు పురుషోత్తం.

"అదేంటి? అన్నయ్య వస్తానన్నాడే! రాలేదా? " అన్నాడు చిన్నతమ్ముడు లక్ష్మణరావు ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ.

"రాలేదనేగా నీకు చెప్పింది? "

"నేను స్టేషన్‌కి వెళ్తాలేరా! అన్నాడు రాత్రి నాతో. ఇద్దరం ఎందుకులే, మళ్లీ లగేజి కూడా ఉంటుంది, కారులో ఇరుకవుతుందని నేను రాలేదు"

"వాడికి జ్వరం వచ్చిందట! శుభలక్ష్మి చెప్పింది, నేను ఫోన్ చేస్తే"

"మరి జ్వరం వచ్చినవాడు, ఆ సంగతి నాకు చెప్తే నేను వచ్చేవాడిని గదా!"

"సర్లే! ఎవరు రాకపోతే మాత్రం ఏంటిగానీ, అమ్మ ఎలా ఉంది? "

"అమ్మ బాగానే ఉంది అన్నయ్యా!"

"ఇప్పుడు అమ్మ ఎక్కడ ఉంది? మీ ఇంట్లోనా? వాడింట్లోనా? "

"అమ్మ మన పాత ఇంట్లో ఉంటోంది"

"ఒక్కతే ఉంటోందా? "

"అమ్మకి ఎవరితోనూ పడదని నీకు తెలుసుగా అన్నయ్యా! ఇంట్లో తెచ్చి పెట్టుకున్నా అన్నింట్లో వేలు పెడుతుంది. అన్నీ తనకి కావాలి. ప్రతి పనిలో జోక్యం చేసుకుంటుంది. పిల్లల్ని కూడా సతాయిస్తుంది. వాళ్లేమో లెక్కచెయ్యరు. ఏమన్నా అంటే పెద్దదాన్ని మంచి చెడూ చెప్పొద్దా అంటుంది" చెప్తున్నాడు లక్ష్మణరావు.

"సరే! సరే!! అమ్మకి చెప్పు! సాయంకాలానికి ఇంటికి వస్తామని" అన్నాడు పురుషోత్తం చిరాకు పడుతూ.

"సాయంకాలం దాకా ఎందుకు? తెనాల్లో ఎక్కడుంటారు? ఇప్పుడు బయల్దేరి ఊరికి రారేంటి? "

"హోటల్లో ఉంటాంలే" అని ఫోన్ కట్ చేశాడు పురుషోత్తం.

తెనాలి స్టేషన్‌కి ఎవరూ రాలేదని పురుషోత్తంకి కోపం వచ్చిందని గ్రహించాడు లక్ష్మణరావు. వెంటనే తను రింగ్ చేశాడు.

"అన్నయ్యా! హోటల్లో ఉండటం ఏంటి? ఇంటికి వచ్చేయండి" అన్నాడు.

"కాదులే! జర్నీలో పిల్లలు అలిసిపోయారు. ఇక్కడ రెస్ట్ తీసుకుంటారు హోటల్లో. సాయంకాలానికి వస్తాంలే" అన్నాడు పురుషోత్తం.

"నీ ఇష్టం అన్నయ్యా!" అన్నాడు లక్ష్మణరావు.

ఇద్దరు పిల్లలూ తండ్రి వైపు చూస్తున్నారు, ఫోన్‌లో మాట్లాడుతూ ఉంటే..

"ఇదివరకు నేనెప్పుడొచ్చినా బాబాయిలు తెనాలికి వచ్చి నా కోసం వెయిట్ చేసేవాళ్లు. నేను ఫ్లైట్‌లో విజయవాడ వస్తే కారు తీసుకుని గన్నవరం ఎయిర్‌పోర్ట్ దగ్గర రెడీగా ఉండేవాళ్లు. మా అమ్మ సంతోషపడేది. 'మీరంటే మీ తమ్ముళ్లకి ఎంత ప్రేమో? రాముడికి తగిన తమ్ముళ్లు!' అనేది. పాపం పిచ్చిది దానికేం తెలుసు? అంతా డబ్బు మహత్యమని. మనిషికి పవర్ ఉండాలంటే డబ్బుండాలి. పవర్, డబ్బు ఒకటే! తేడా లేదు. 'డబ్బులేనోడు డుబ్బుకి కొరగాడు అనేవాళ్లు' నా చిన్నప్పుడు" అన్నాడు పురుషోత్తం పిల్లలతో.

"డబ్బు అంటే 'మనీ' అని తెలుసు డాడీ! 'డుబ్బు' ఏంటి? వాటీజ్ ద మీనింగ్?" అడిగాడు చైతన్య.

పురుషోత్తం నవ్వాడు. "నాక్కూడా మీనింగ్ తెలీదు. నా చిన్నప్పుడు పెద్దవాళ్ల అనేమాట గుర్తుపెట్టుకుని ఇప్పుడు వాడాను. సరైన మీనింగ్ తెలియాలంటే

శబ్దరత్నాకరం చూడాలి. అందులోనైనా ఉంటుందని గ్యారంటీ లేదు" అన్నాడు.

"యూజ్‌లెస్ ఫెలో అనేమో డాడీ" అంది గీతిక.

"కావొచ్చమ్మా! డబ్బులేనోడిని ఎవరూ లెక్కచెయ్యరు. ఎందుకూ పనికిరానోడని తీసి పారేస్తారు" అన్నాడు కూతురి వైపు మెచ్చుకోలుగా చూస్తూ.

ముగ్గురూ స్టేషన్ బైటకి వచ్చారు. టాక్సీ ఎక్కి హోటల్‌కి బయల్దేరారు.




**నో**ట్లో వేపపుల్ల పెట్టుకుని పళ్లు తోముకుంటూ బయల్దేరాడు లక్ష్మణరావు, తమ పాత ఇంటికి. అతను ఉంటున్న ఇంటికి ఫర్లాంగ్ దూరంలో ఉంటుంది ఆ ఇల్లు. తండ్రి కృష్ణారావు బతికి ఉన్నప్పుడు అందరూ ఆ ఇంట్లోనే ఉండేవారు. ముగ్గురు అన్నదమ్ములు, చెల్లెలు అంతా ఆ ఇంట్లోనే పుట్టిపెరిగారు. పెళ్లిళ్లు, పేరంటాలు అన్నీ అక్కడే జరిగాయి. పంట కాలువ కింద ఎనిమిది ఎకరాల పొలం ఉండేది. ఇంట్లో పాడి.. దేనికీ కొదవ ఉండేదికాదు. పురుషోత్తం చిలుమూరులోనే టెన్త్ వరకు చదువుకున్నాడు. ఇంటర్ గుంటూర్లో, ఇంజనీరింగ్ కాకినాడలో చదివాడు. గవర్నమెంట్ ఉద్యోగం వచ్చింది. వ్యవసాయం చేస్తున్న తండ్రి చనిపోవడంతో మన్మథరావు, లక్ష్మణరావు టెన్త్‌తో చదువు చాలించారు. ఆడపిల్లకి రెండు ఎకరాలు కట్నం ఇచ్చి పెళ్లిచేశారు. మిగిలిన పొలం ఇద్దరూ కలిసి చేస్తున్నారు. పురుషోత్తం తన భాగం రెండు ఎకరాలు, చెరొక ఎకరం తమ్ముళ్లకి రాసిచ్చాడు. తల్లి శేషమ్మకి కావాల్సిన పప్పు, ఉప్పులు తనే సంపాదించుకుంటోంది, కొడుకులు వేరుపడ్డాక. అయినా బియ్యం, పప్పులు ఊళ్లో ఉన్న కొడుకులు తెచ్చి పడేస్తుంటారు. శేషమ్మ ఇద్దరు కొడుకులకు పాలు పంపిస్తూంటుంది. పురుషోత్తం ఎప్పుడైనా పెళ్లిళ్లకు, బంధువుల కర్మలకు వచ్చినప్పుడు తల్లికి డబ్బు ఇస్తాడు.

"నాకెందుకురా ఇంత డబ్బు?" అంటుంది శేషమ్మ.

"ఉండనియ్యవే అమ్మా! ఎందుకైనా పనికొస్తుంది. నీకేదైనా అవసరం వస్తే పోస్ట్ మాష్టర్‌కి చెప్పు. నాకు ఫోన్ చేస్తాడు. డబ్బు పంపిస్తాను" అంటాడు.

అయితే ఆమెకు అంత అవసరం ఎప్పుడూ రాలేదు. శేషమ్మది దృఢమైన శరీరం. ఆమెకు పదమూడో ఏటనే పెళ్లయింది. అప్పట్నుంచి ఆమె వంచిన నడుం ఎత్తకుండా పనిపాటలు ఇష్టంగా చేస్తోంది. ఇప్పుడున్న ఏ సౌకర్యాలు ఆ రోజుల్లో లేవు. ఇంట్లో కరెంటు కూడా లేదు. పాలేరు పొలం పనికే పరిమితమయ్యేవాడు. ఇంటి పనంతా నెత్తిన వేసుకునేది. అంట్లు తోమడం, ఇల్లు ఊడవడం, వంట అయ్యేవరకు పొయ్యి ముందే కట్టెలు ఎగదోస్తూ కూర్చునేది. ఆ పొయ్యి ఎప్పుడూ మండుతూనే ఉండేది. రాత్రికి ఎద్దులకు ఉలవ గుగ్గిళ్లు వేసిన తర్వాతే పొయ్యి ఆరేది. ఇక పండగలప్పుడు తెల్లవారుజామునే లేచి పప్పు రుబ్బేది. పిల్లలు లేచి స్నానాలు చేసేటప్పటికి గారెలు వండి కొబ్బరి పచ్చడి రెడీ చేసేది. కోడళ్లు, అల్లుళ్లు వచ్చి మనవలు పుట్టి పెరుగుతున్నా శేషమ్మ విశ్రాంతి తీసుకోలేదు. క్షణం తీరిక లేకుండా ఏదొక పనిచేస్తూ

# వేరికోస్ వీన్స్ తగ్గడం సులువే!


డా. పవన్ రెడ్డి



జనవరి 2, 2014...

74 ఏళ్ల ఆయన మా క్లినిక్‌కి వచ్చారు. రెండు కాళ్లలోనూ పిక్కలు లాగుతున్నాయన్నది ఆయన మొట్టమొదటి కంప్లెయింట్. నాలుగేళ్ల నుంచి వేరికోస్ వీన్స్ సమస్య వల్ల కాళ్లు నల్లగా అయినాయి. కాళ్ల నొప్పుల వల్ల ఆయనకు నిలబడడం, కొద్ది దూరం నడవడం కూడా కష్టం అవుతోంది. కూర్చుంటే నొప్పి తగ్గినట్టుగా ఉంటోంది. కాని రెండు పాదాలు కూడా మొద్దుబారినట్టు అవుతున్నాయి. దీనివల్ల సరిగా నిద్ర కూడా పోలేకపోతున్నాడు.

**మరిన్ని లక్షణాలు.**

కూర్చుని లేచినప్పుడు కళ్లు తిరుగుతున్నాయి. నడుస్తున్నప్పుడు కూడా ఇదే పరిస్థితి. సరిగా నడవలేకపోవడం, వెనకనుంచి ఎవరో తోస్తున్నట్టు అవడం వల్ల ఇలాంటి ఇబ్బంది కలుగుతున్నది. ఆయనకు అధిక రక్తపోటు కూడా ఉంది. దానికి మందులు వాడుతున్నాడు.

★ నాలుగేళ్లుగా మూత్రవిసర్జన సమయంలో మంట ఉంటోంది. పదే పదే వెళ్లాల్సి వస్తోంది.

★ అజీర్తి, కడుపుబ్బరం, కొంచెం తిన్నా కూడా పొట్ట నిండిపోయి, ఉబ్బరంగా ఉంటోంది.

★ ఏమాత్రం వాతావరణం మారినా, నీళ్లు మారినా బలుబు, దగ్గు బాధిస్తాయి.

★ రెండు కాళ్లలోని సిరలకు కలర్ డాప్లర్ స్టడీ చేశాం. పరీక్షలో తొడ మధ్య భాగంలో రిఫ్లక్స్ (ప్రతిచర్య) కనిపించింది. పిక్క భాగంలోని ఎముకలో రంధ్రాలు ఉన్నట్టు తేలింది. ఎస్ఎఫ్‌పి - పాప్లిటియల్ విభాగంలో (మోకాలి వెనుక భాగం) కలర్ ఫిల్లింగ్ లేకపోయినా సిరల్లో రక్తం గడ్డ కట్టివున్నట్టు స్పష్టమైంది.

**శరీర తత్వం**

ఆకలి బాగానే ఉంది. కాని తినడానికి ఏమాత్రం ఆలస్యం అయినా తట్టుకోలేడు. శరీరం అంతా వణుకు మొదలవుతుంది. (ఆయనకు మధుమేహం లేదు).

★ దాహం ఎక్కువ. నీళ్లు ఎక్కువగా తాగుతాడు.

★ స్వీట్లు, చేపలు, మసాలా ఆహారం, పండ్లు ఎక్కువ ఇష్టంగా తింటాడు.

★ 13 ఏళ్లుగా సిగరెట్ తాగుతున్నాడు. రోజుకి 10 సిగార్లు కాల్చేస్తాడు.

★ మలవిసర్జన సవ్యంగానే ఉంది గాని, నిద్ర లేవగానే టాయిలెట్‌లోకి పరుగు తీయాల్సిందే.

★ మూత్రం ఆగి ఆగి వస్తుంది. మంట కూడా ఉంటుంది.

★ అధికంగా చెమట పడుతుంది.

★ కాళ్ల నొప్పుల వల్ల నిద్ర సరిగా పట్టదు.

★ వేడి వాతావరణాన్ని తట్టుకోలేడు. చలికాలంలో కూడా కప్పుకొని పడుకోవాల్సిందే.

**మానసిక తత్వం**

★ చాలా వేగంగా మాట్లాడతాడు. అర్థం చేసుకోవడం కష్టం.

★ ఏ పని చేసినా తొందర ఎక్కువ పరిగెత్తినట్టుగా నడుస్తాడు.

★ మార్పు ఇష్టం ఉండదు. అందుకే 30 ఏళ్లుగా ఒకేచోట పనిచేస్తున్నాడు. జ్ఞాపకశక్తి తక్కువ కాబట్టి కొత్త విషయాలు నేర్చుకోలేడు. కొత్త రకమైన పనిని చేయలేడు.

★ చిన్నప్పటి నుంచి కూడా చాలా పిరికివాడు. తన సందేహాలను అడగడానికి కూడా భయమే. ఈ స్వభావం వల్ల రిజర్వ్‌గా ఉండడం అలవాటైంది.

★ ప్రతిరోజూ రెండు మూడు వార్తాపత్రికలు అక్షరం వదలకుండా చదువుతాడు. ఆధ్యాత్మిక పుస్తకాలు చదవడం ఇష్టం.

**చికిత్స**

ఈ విషయాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుని జనవరి 25ననే మందులు మొదలుపెట్టాం.

★ 26-3-2014 నాటికల్లా నిలబడినప్పుడు కళ్లు తిరగడం తగ్గింది. పాదాల్లో మంట కూడా తగ్గింది. తద్వారా నిద్ర సరిగా పడుతున్నది.

★ 27-6-2014 కల్లా నిలబడడం, నడవడం మెరుగయ్యాయి. వేరికోస్ వీన్స్ వల్ల వచ్చిన కాళ్లలో నలుపు దనం తగ్గింది. ఎటువంటి ఇబ్బంది లేకుండా కొంత దూరం నడవగలుగుతున్నాడు.

★ 27-8-2014 రోజుకి కళ్లుతిరగడం పూర్తిగా తగ్గింది. వేరికోస్ వీన్స్ వల్ల వచ్చిన నలుపుదనం చాలావరకు తగ్గింది. పొట్ట ఉబ్బరం, అజీర్తి లాంటి వన్నీ తగ్గు ముఖం పట్టాయి.

★ 9-12-2014 రోజుకల్లా కళ్లు తిరిగే సమస్య ఎంతమాత్రమూ లేకుండా హాయిగా నడవగలిగాడు. వేరి కోస్ వీన్స్ నొప్పి, నలుపుదనం తగ్గిపోయాయి.

ఉంటుంది. పని చెయ్యడం ఆమెకు వ్యసనం. కోడళ్లు కూడా తనలా ఉండాల నుకునేది. కానీ ఎందుకు ఉంటారు? ఎంతో కొంత చదువుకున్న వాళ్లు, నాగరీకులు గదా? ఊళ్లోనే ఇళ్లు కట్టుకుని వేరుగా ఉంటున్నారు. ఎనభై ఏళ్ల వయసులో గూడా శేషమ్మ ఉక్కుముక్కలా కనిపిస్తుంది. ఆమెకు జ్వరం రావడం ఆ ఊళ్లో వాళ్లెవరూ ఎరగరు. అంతేనా? జబ్బుగా జ్రరున చీదినప్పుడు చూసిన వాళ్లు కూడా లేరు.

లక్ష్మణరావు వెళ్లేసరికి శేషమ్మ వాకిలి ఊడుస్తూ కనిపించింది. పొద్దున్నే చిన్నకొడుకు తన దగ్గరకి వచ్చాడంటే ఏదో విశేషం ఉందని ఆమె గ్రహించింది. అతను ఇంటి ముందున్న గాబు (నీళ్ల తొట్టె) దగ్గర చెంబుతో నీళ్లు తీసుకుని ముఖం కడుక్కున్నాడు. అతను ఆ పని చేస్తుండగా శేషమ్మ వంటగదిలోకి వెళ్లి ఇత్తడి గ్లాసుతో కాఫీ తెచ్చింది.

లక్ష్మణరావుకి ఆ గ్లాసు చూస్తేనే భయం. అర లీటరు కాఫీ పడుతుంది దాంట్లో. చిన్నప్పుడు దాన్ని రేలంగి గ్లాసు అనేవాళ్లు. అదేదో సినిమాలో అంత పెద్ద గ్లాసులో కాఫీ తాగాడట రేలంగి. 'ఏదైనా కప్పులో ఇవ్వమ్మా!' అని మొత్తుకున్నా ఆమె వినదు. లక్ష్మణరావు గ్లాసు అందుకుని "అమ్మా! పెద్దన్నయ్య సాయంకాలానికి వస్తానన్నాడే!" అన్నాడు.

ఆ మాట వినగానే శేషమ్మ ముఖం మతాబాలా వెలిగిపోయింది. "దుబాయ్‌లో బయల్దేరాడా? " అని అడిగింది.

"ఆఁ. పొద్దున్నే తెనాలి వచ్చాడు"

"తెనాలి దాకా వచ్చినోడు సాయంత్రం దాకా ఎందుకు అక్కడ? ఇంటికి రావొచ్చుగా? "

"పిల్లలు హోటల్లో రెస్టు తీసుకుంటారంట. రాత్రి రైల్లో సరిగా నిద్దర లేదంట"

"మనింటికన్నా పెద్దదేంరా ఆ హోటలు? " అడిగింది శేషమ్మ.

"ఆఁ పెద్దదే! ఎ.సి. రూములు అవీ ఉంటాయి" అన్నాడు. కాఫీ తాగిన తర్వాత "కూరగాయలు ఏమన్నా కావాలా? ఇంట్లో వంట సామాను అంతా ఉందా? " అడిగాడు.

"అన్నీ ఉన్నాయిలే" చెప్పింది శేషమ్మ.

లక్ష్మణరావు కొంచెం సేపు కూర్చుని వెళ్లిపోయాడు. సాయంకాలానికి పెద్దకొడుకు, పిల్లలు వచ్చేటప్పటికి చేయాల్సిన పనులన్నీ మొదలు పెట్టింది.

పది సెంట్లలో ఊరిమధ్యలో ఉన్న ఆ పెంకుటిల్లు కృష్ణారావు తాతల నాటిది. సున్నంతో కట్టినా ఇప్పటికీ దృఢంగానే ఉంది. పెద్దపెద్ద గదులు ఆరున్నాయి. వంటకి వెనుకవైపు వేరే పెంకుటిల్లు ఉంది. ఒక పక్కగా పశువుల కొట్టం. ఇంటి చుట్టూ తాటాకుల దడి. ఆ ఇల్లు ఊడవడానికి శేషమ్మకి గంటసేపు పడుతుంది. ఇంటి వెనుక వెలగచెట్టు, వేప చెట్టు, బాదం చెట్టు. ఆకులు ఊడ్చి వాటికి మంట పెడుతుంది. ఆ పొగకి దోమలు పారిపోతాయి. ఆ సంగతి శేషమ్మకి అత్త గారు చెప్పింది. ఆమె మాట తూచా తప్పక పాటిస్తోంది ఇప్పటివరకు.

రెండు గదులు తెరిచి ఊడ్చి, కడిగి శుభ్రం చేసింది. మంచాల మీద ఉతికిన దుప్పట్లు పరిచింది. దిండు గలీబులు మార్చింది. చింతపల్లి వాళ్ల మొక్కజొన్న చేలోకి వెళ్లి కండెలు తెచ్చింది. వాటిని వలిచి, కచ్చాపచ్చాగా రోట్లో రుబ్బి, సెనగ పిండి, ఉల్లిపాయల ముక్కలు, పచ్చిమిర్చి తరిగి కలిపింది. పెద్దకొడుకు, పిల్లలు రాగానే వేడివేడిగా పకోడీలు వేయాలని ఎదురు చూస్తోంది.

చీకటి పడకముందే పురుషోత్తం, పిల్లలు కారులో వచ్చారు.

కారు హారన్ వినగానే పరుగెత్తుకొచ్చింది శేషమ్మ. "ఏరా! అయ్యా! బాగు

న్నావా? చైతూ బాగా పొడుగయ్యావే? దీపూ అచ్చం మీ అమ్మలాగే ఉన్నావే ఇప్పుడు" అని అందర్నీ పలకరించింది.

"నువ్వెట్లా ఉన్నావే అమ్మా? " అడిగాడు పురుషోత్తం తల్లివైపు చూసి నవ్వుతూ.

"నాకేం రోగం? బాగానే ఉన్నాలే! పదండి లోపలకి" అంది.

టాక్సీడ్రైవర్ డిక్కీ తెరిచి లగేజి తెచ్చి లోపలపెట్టాడు. పురుషోత్తం అతనికి డబ్బు ఇచ్చాడు.

"సార్! ఇక వెళ్తా నేను" అన్నాడు డ్రైవర్.

పురుషోత్తం తల ఊపాడు.

"అరే అబ్బాయ్! కాసేపు ఉండరా కాఫీ తాగిపోదుగాని" అంది శేషమ్మ.

"ఔనోయ్! మా అమ్మ చేతి కాఫీ తాగితే జన్మలో మర్చిపోవు. రేలంగి గ్లాసుతో ఇస్తుంది" అని నవ్వాడు పురుషోత్తం.

శేషమ్మ వంటగదిలోకి వెళ్లి పకోడీలు వండటం మొదలుపెట్టింది. డ్రైవర్‌కి ప్లేటులో పకోడీలు పెట్టి ఇచ్చింది. అతను కారులో కూర్చుని తినసాగాడు. తర్వాత కాఫీ తాగి వెళ్లిపోయాడు శేషమ్మని మెచ్చుకుని.

కాసేపటికి మన్మథరావు, లక్ష్మణరావు వచ్చారు. పొద్దున స్టేషన్‌కి రాలేకపోయినందుకు కారణాలు ఏకరువు పెట్టారు. దుబాయ్‌లో పురుషోత్తం బిజినెస్ ఎందుకు దెబ్బతిన్నదీ వివరంగా అడిగి తెలుసుకున్నారు.

"పోతే పోయింది లేరా! నేను అక్కడ ఉద్యోగం చేసి సంపాదించిన దాంతో బిజినెస్ పెట్టాను. కలిసొచ్చింది. సంపాదించాను. ఎట్లా వచ్చిందో అట్లాగే పోయింది. మీ వదిన ఉన్నంత కాలం అదృష్టం కలిసొచ్చింది. అది ఎప్పుడైతే పోయిందో,

అంతా తిరగబడింది. దాంతోనే పోయింది. ఏం చేస్తాం? నేను ఇక్కడ్నుంచి తీసుకెళ్లింది ఏంలేదు. అట్లాగే తెచ్చిందీ లేదు"

పురుషోత్తం చెప్పింది విన్నారు తమ్ముళ్లు.

"ముందు పిల్ల పెళ్లి చెయ్యాలిరా! వాడికి ఏదైనా ఉద్యోగం చూడాలి. వీళ్ల గురించే నాకు దిగులురా!" అన్నాడు పురుషోత్తం.

"చూద్దాంలే అన్నయ్యా!" అన్నాడు మన్మథరావు.

"కాంతి కొడుకు బాగానే ఉంటాడు అన్నయ్యా! గుంటూర్లో ఇల్లు కట్టుకున్నారు. బావ ఆటోనగర్లో షాపు నడుపుతున్నాడు. లారీలు కూడా ఉన్నాయి" అన్నాడు లక్ష్మణరావు.

"ఇప్పుడు అది బాగా మారిపోయింది అన్నయ్యా! డబ్బు సంపాదించారుగా! ఇది వరకటిలా లేదు. అసలు మనూరు రావడమే మానేసింది. ఏం ఉంది ఆ పల్లెటూళ్లో అంటుంది. ఎన్ని పెళ్లిళ్లకు పిలిచినా రాలేదు. మీ చెల్లెలికి గర్వం అని నా మొహానే అన్నారు చుట్టాలు" చెప్పాడు మన్మథరావు.

"రవి ఏం చదివాడేం? " అడిగాడు పురుషోత్తం.

"ఇంటర్ చదివాడనుకుంటా! అయినా వాడికి చదువెందుకులే! బిజినెస్ బాగానే ఉందిగా!" అన్నాడు మన్మథరావు.

"ఎట్లా ఉందిరా మీ వ్యవసాయం? " టాపిక్ మార్చాడు పురుషోత్తం.

"ఏం బాగాలేదన్నయ్యా! పంట పండితే రేటుండదు. రేటున్నప్పుడు పంట చేతికొచ్చేటయానికి తుఫాన్లు ముంచుకొస్తాయి. ఎరువుల రేట్లు, పురుగుల మందు రేట్లు పెరిగిపోయాయి. ఒక్కో సంవత్సరం పెట్టుబడి కూడా చేతికి రావడం లేదు"

తమ్ముళ్లిద్దరూ తమ ఇబ్బందులు చెప్పుకొచ్చారు. "మనూళ్లో కొందరు వరి వెయ్యడం మానేసి తమలపాకుల తోటలు వేస్తున్నారు అన్నయ్యా! వాళ్ల పని బాగానే ఉంది. ఆకులు కోయించి కట్టలు కట్టి బుట్టలకెత్తి తెనాలి మార్కెట్‌కి పంపిస్తున్నారు"

"మరి మీరు కూడా ఆ పని చెయ్యండి" అన్నాడు పురుషోత్తం.

"అదే చెయ్యాలనుకుంటున్నాం" అన్నారు ఇద్దరూ.

చైతన్యని, గీతికను పలకరించి కాసేపు కబుర్లు చెప్పి వెళ్లిపోయారు మన్మథరావు, లక్ష్మణరావు.

"ఎంతసేపూ వాళ్ల సంగతులేనా చెప్పుకునేది? ఆ దేశంలో వ్యాపారం దెబ్బతిని వచ్చావు గదా? ఇకముందు ఇక్కడ ఏం చేస్తావు అన్నయ్యా! అని మాట వరసకైనా అడగరేంరా నీ తమ్ముళ్లు? " అంది శేషమ్మ మండిపడుతూ.

పురుషోత్తం నవ్వాడు. "వాళ్ల మొహం? వాళ్లు నాకేం చేస్తారే? " అన్నాడు.

"ఔన్రా పెద్దోడా! ఈ వయసులో ఇక్కడేం చేస్తావురా? పిల్ల పెళ్లెట్లా చేస్తావు? తల్చుకుంటే నాకే భయంగా ఉందిరా? " అంది శేషమ్మ కన్నీళ్లు పెట్టుకుంటూ.

"నువ్వేం దిగులు పడకే! అన్నీ సవ్యంగానే జరుగుతాయి" అన్నాడు.

శేషమ్మకి గుండెల నిండా దిగులు గూడుకట్టుకుని ఉంది. పెద్దకొడుకు పరిస్థితి ఇట్లా దిగజారుతుందని ఆమె కలలో కూడా ఊహించలేదు.

పురుషోత్తం బాగా చదువుకుని ఇంజనీర్ అయినందుకు సంబరపడింది. అప్పుడెప్పుడో నైజాం వెళ్లి పొలాలు కొనుక్కుని స్థిరపడిన పల్నాటి రామయ్య తన కూతురు అన్నపూర్ణని ఇచ్చి పెళ్లి చేశాడు. హైదరాబాద్‌లోనే గొప్పగా పెళ్లిచేశాడు. చిలుమూరు నుంచి బస్సుల్లో, రైళ్లలో హైదరాబాద్ పెళ్లికి వెళ్లారు. అందరికీ

హోటళ్లలో విడిది ఏర్పాట్లు చేసి, మర్యాదలు చేశారు వియ్యాలవారు. ఆ పెళ్లి గురించిన ముచ్చట్లు చాలారోజులు తలచుకున్నారు ఊళ్లో వాళ్లు. మేలిమి బంగారు ఛాయలో ఉన్న కోడల్ని చూసుకుని మురిసిపోయింది శేషమ్మ.

పురుషోత్తంకి ఇద్దరు పిల్లలు కలిగాక, అధికారులతో పడక గొడవైంది. ఉద్యోగానికి రాజీనామా చేశాడు. కొడుకు ఎట్లా బతుకుతాడోనని తల్లడిల్లింది శేషమ్మ. పురుషోత్తం దుబాయ్ వెళ్లిపోయాడు. అక్కడ ఒక కంపెనీలో ఉద్యోగం చేశాడు. తర్వాత అక్కడ సొంతంగా ఒక కంపెనీ పెట్టానన్నాడు. దుబాయ్‌లో కోట్లు సంపాదిస్తున్నాడని ఊళ్లో వాళ్లు అనుకుంటుంటే గర్వపడింది శేషమ్మ. అన్నదమ్ములు భాగాలు పంచుకున్నప్పుడు పురుషోత్తం తన భాగం కింద వచ్చిన రెండెకరాలు, తమ్ముళ్లకు చెరొక ఎకరం రాసి ఇచ్చాడు. పెద్దోడిది పెద్దమనసు అనుకుని మురిసింది శేషమ్మ.

దురదృష్టం వల్ల అన్నపూర్ణ జబ్బుతో చనిపోయింది. ఆమె పుట్టిల్లు నేరేడుకొండ లోనే అంత్యక్రియలు చేశారు. ఆమెతోనే ఐశ్వర్యం హరించుకుపోయింది. దుబాయ్ వ్యాపారంలో నష్టాలొచ్చి అక్కడ బతకలేక ఇక్కడికి వచ్చాడు. పిల్ల పెళ్లీడుకొచ్చింది. దానిపెళ్లి చేసి పంపిస్తే ఒడ్డున పడ్డట్టే. చైతన్య మగాడు.. ఎట్లాగైనా బతుకుతాడు.

శేషమ్మకు ఇప్పుడు పెద్దకొడుకు కుటుంబం గురించి దిగులు పట్టుకుంది. పురుషోత్తం ఏమీ జరగనట్టు ధీమాగా ఉన్నా ఆమెకు ధైర్యం కలగడం లేదు.

మన్మథరావు, లక్ష్మణరావు పిల్లలు పెద్ద

నాన్న పిల్లల డ్రెస్సులు, ఖరీదైన వాచీలు, బూట్ల జతలు అబ్బురంగా చూస్తున్నారు. గీతిక, చైతన్యలు వాడే ఎలక్ట్రానిక్ వస్తువులు చూస్తుంటే కళ్లు తిరుగుతున్నాయి.

"అమ్మా! చైతూ అన్నయ్యా వేసుకునే బూట్లు పదివేలంట. దుబాయ్‌లో కొన్నాడంట"

"అమ్మా! గీతిక అక్క చెవులకున్న డైమండ్స్ ఏభైవేలంట"

"అక్కకు బంగారం వడ్డాణం ఉందే!"

"అక్క డ్రెస్సులు ఒక్కోటి పదేస్తివేలంట. బోలెడున్నాయి అమ్మా! అక్కనడిగి ఒక డ్రెస్ తీసుకుంటానే"

"అమ్మా! అన్నయ్యా పాత బూట్లు అడగనా? "

పిల్లలు చెప్తున్న కబుర్లతో మన్మథరావు, లక్ష్మణరావు భార్యలకు మండుకొస్తోంది.

"ఛీ! నోర్మూయ్యండి! అట్లా ఇష్టమొచ్చినట్టు అయినదానికి, కానిదానికి డబ్బు తగలేసి కదూ అక్కడ దివాలా ఎత్తి వచ్చింది. పిచ్చి మాటలు మానండి. వాళ్లనేమీ అడక్కండి పరువు తక్కువ" అని పిల్లల్ని మందలిస్తున్నారు.

బావగారి దగ్గర ఎంతో కొంత బంగారం ఉంది. పిల్లపెళ్లికి దిగుల్లేదని మరదళ్లకి అర్థమైంది. అయితే వాళ్లకి ఇంకొక భయం మొదలైంది.

"అప్పుడెప్పుడో మీ అన్నయ్య తన వాటా రెండెకరాలు మీకు చెరొక ఎకరం రాసిచ్చాడు కదా? " అని మన్మథరావుని అడిగింది అతని భార్య.

"ఔను!"

"ఇప్పుడా ఎకరం తిరిగి ఇచ్చెయ్యమంటాడేమో? " అని సందేహం వెలిబుచ్చింది.

లక్ష్మణరావు భార్యకు కూడా అదే అనుమానం కలిగింది.

"అన్నయ్యా అట్లా అడగడు లేవే!" అని పైకి అన్నారు.

'కానీ విధి బలీయం కదా? బతికి చెడి వచ్చాడు. ఒకవేళ అడిగితే ఏం చేయాలి? ' అనే ఆలోచనలో పడ్డారు.

★ ★ ★

"గీతికకి సంబంధాలు చూడండిరా! దాని పెళ్లిచేస్తే నాకు దిగులుండదు. చైతూని తీసుకుని హైదరాబాద్ వెళ్లిపోతాను. అక్కడ వాడికి ఏదొక ఉద్యోగం దొరుకుతుంది" అన్నాడు పురుషోత్తం ఒకరోజు తమ్ముళ్లతో.

"ఎక్కడో సంబంధం ఎందుకు? కాంతిని అడుగుదాం అన్నయ్యా! తన కొడుక్కి చేసుకోమని" అన్నాడు మన్మథరావు.

"కాంతి కొడుక్కా? వాడు చదువుకోలేదు గదరా? " అని సందేహం వ్యక్తంచేశాడు పురుషోత్తం.

"ఇంటరు దాకా చదివాడు. వాళ్లది బిజినెస్సేగా! అంతకంటే ఎక్కువ ఎందుకు? లెక్కలన్నీ వాడే చూస్తాడంట. వాళ్ల నాన్నది పెత్తనమేనట. కాంతి చెప్తాంటుంది"

"చెల్లాయి కొడుక్కిస్తే బాగానే ఉంటుంది అన్నయ్యా! అమ్మాయికి తల్లిలేదు. మేనత్త అత్త అయితే కడుపులో పెట్టుకుంటుంది. ఏమంటావు? "

తమ్ముళ్లు చెప్పింది విన్నాడు పురుషోత్తం.

"వాళ్లిప్పుడు బాగా సంపాదించారంటున్నారుగా? కొడుక్కి భారీగా కట్నం అడుగుతుందేమో? గీతిక దగ్గర బంగారమైతే ఉంది. కట్నం అనేసరికి డబ్బు కావాలి. పెళ్లి ఖర్చులు ఉండనే ఉంటాయి. కాంతితో తూగగలమంటారా? " అన్నాడు.

"అడిగి చూద్దాం అన్నయ్యా!" అన్నారు తమ్ముళ్లు.

"సరే! మీరిద్దరూ వెళ్లి కదిపి చూడండి. అది సుముఖంగా ఉంటే నేను తర్వాత మాట్లాడతాను" అన్నాడు పురుషోత్తం.

తమ్ముళ్లిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

# భూగోళం విశేషాలు




మనం నివసించే భూగోళానికి చెందిన నిజాలేమిటో మీకు తెలుసా!

★ ఓ రోజుకి ఇరవై నాలుగ్గంటలు అని మనకి లెక్క. కానీ భూమి తన చుట్టూ తాను తిరగడానికి పట్టే సమయం 23 గంటల 56నిమిషాల 4క్షణాలు దీనికి 'సైడ్‌రియల్ డే' అని పేరు

★ భూగోళాన్ని అత్యంత దూరం నించి తీసిన ఫొటోలో అది లేత నీలం రంగు చుక్కలా కనిపిస్తుంది. 370కోట్ల మైళ్ళ దూరం నించి ఇక్కడున్న ఈ ఫొటోను తీశారు.

★ అంతరిక్షం లోంచి గ్రేట్ చైనా వాల్ కనబడదు కానీ, చైనాలోని వాయు కాలుష్యం కనిపిస్తుంది.

★ 1957లో రష్యా స్పుత్నిక్‌ని ప్రయోగించినప్పటినించి నేటి దాకా అంతరిక్షంలో మనిషిని పంపించిన వాహనాల సంఖ్య 38వేలు.

★ అంతరిక్షంలో సరైన రక్షణ లేని మనిషి రెండు నిమిషాల్లో మరణిస్తాడు.

★ నిత్యం తోక చుక్కలు పగిలి వాటి కణాలు భూమి మీదకి వంద టన్నులు చేరుతుంటాయి.

★ అంతరిక్షంలోకి 19కిలోమీటర్లు వెళ్ళాక ప్రెషరైజ్డ్ సూట్‌ని ధరించకపోతే శరీర ఉష్ణోగ్రతకే లోపలి నీరు మరుగుతుంది.

★ నిత్యం 86లక్షల మెరుపులు భూగోళాన్ని తాకుతుంటాయి.

★ ఇంతదాకా భూమి మీద నమోదైన అత్యధిక ఉష్ణోగ్రత 57.8సెల్సియస్. 1922లో లిబియాలోని ఎల్ అజోజియాలో ఇది నమోదైంది.



★ ఇంతదాకా భూమి మీద నమోదైన అత్యల్ప ఉష్ణోగ్రత 1983లో అంటార్కిటికాలో ఓస్టక్ స్టేషన్‌లో రికార్డయింది. అది మైనస్ 89.2 డిగ్రీలు.

★ ఖండాలు ఏడాదికి రెండు సెంటి మీటర్ల చొప్పున దూరంగా జరుగుతున్నాయి.

"ఏంరా మాట్లాడరు? ఏంటి ప్రాబ్లమ్?" అడిగాడు పురుషోత్తం.

"అదికాదు అన్నయ్యా! పిల్లనివ్వాలనుకుంటున్నది నువ్వుకదా? నువ్వు వెళ్లి అడిగితే మర్యాదగా ఉంటుంది. పెద్దన్నయ్య అడగలేదని కాంతి ఫీలవుతుందేమో?"

పురుషోత్తం నవ్వాడు.

"సరే! సరే!! రేపు గుంటూరు వెళ్దాం! కారు మాట్లాడండి" అన్నాడు.

కారు మాట్లాడమనేసరికి గతుక్కుమన్నారు. డబ్బు ఎవరు పెట్టుకుంటారు? కారు కిరాయి అన్నను అడగలేరు కదా?

"ఇక్కడ కార్లెక్కడ ఉంటాయి? పొద్దున్నే బస్సుకి వెళ్దాం. తెనాలి నుంచి పదినిముషాలకొక బస్సుంటుంది గుంటూరికి" అన్నాడు మన్మథరావు.

"సర్లే! కరువులో అధికమాసమని, అసలే ఇబ్బందుల్లో ఉన్నాం. పొదుపుగా బస్సులోనే వెళ్దాంలే" అని ఒప్పుకున్నాడు పురుషోత్తం.

"గుంటూరు చేరాక ఫోన్‌చేస్తే బావ కారు పంపిస్తాడు బస్టాండ్‌కి" అన్నాడు మన్మథరావు.

"బావకి ఎందుకు ఫోన్ చెయ్యడం? ఆటోలో పోదాంలే" అన్నాడు లక్ష్మణరావు.

"ఔన్రా! పిల్లనివ్వడానికి వెళ్తున్నాం. వాళ్లని దేబిరించడం ఎందుకు? ఆటోలో కాకపోతే కారు మాట్లాడుకుని వెళ్దాం"

అన్నాడు పురుషోత్తం.

మర్నాడు ఉదయం పురుషోత్తంతో పాటు చైతన్య కూడా వచ్చాడు.

"అమ్మ చెప్పిందిరా వీడిని కూడా తీసు కెళ్లమని. ముగ్గురు ఎందుకు వెళ్తారు? నలుగురు వెళ్లండి అంది. వీడు కూడా 'అత్త వాళ్లిల్లు చూస్తా' అంటే తీసుకొ చ్చాను" అన్నాడు పురుషోత్తం.

కాంతిమతి ఇంటికెళ్లేసరికి పదకొండు దాటింది. అన్నల్ని చూసి ఏమంత సంతోషం వ్యక్తంచేయలేదు ఆమె.

"చిలుమూరొచ్చి పది రోజులైందటగా? ఇప్పుడా మా ఇంటికి రావడం?" నిష్ఠూ రంగా అంది కాంతిమతి.

"నేనొచ్చి పది రోజులైందని తెలుసు కదా? నువ్వు కనీసం ఫోన్ చేశావా? ఎట్లా ఉన్నారని అడిగావా?" అన్నాడు పురుషోత్తం అంతే నిష్ఠూరంగా.

"నాకు ఎక్కడ తీరిక ఉంటుంది అన్నయ్యా! పది లారీల వ్యవహారం చూసుకోవాలి. వచ్చేవాళ్లు, పోయేవాళ్లు, అందరికీ వండిపెట్టడంతో సరిపోతుంది. మా అత్తగారి ఊరి నుంచి రోజూ వస్తూనే ఉంటారు ఎవరో ఒకరు. ఆ ఊళ్లో వీళ్లది కౌరవసైన్యం. చస్తున్నాను చాకిరీ చెయ్య లేక" అంది కాంతిమతి.

'మనిషి చూస్తే గుమ్మం పట్టకుండా ఉంది. ఏం తింటోందో? ఒళ్లు బాగా పెరి గిపోయింది. జబ్బల కండ ఊగుతూ ఉంది. ఇది పనిపాటలు చేస్తుందా?' అని నవ్వుకున్నాడు.

అన్నలు వస్తున్నారని తెలుసు గనుక లంచ్ ఏర్పాట్లు చేసి పెట్టింది. లంచ్ టైమ్‌కి ఉపేంద్ర వచ్చాడు, కొడుకుని వెంట బెట్టుకుని.

"ఊరక రారు మహానుభావులు" అంటూ జోక్ చేశాడు వస్తూనే.

"ఊరికే ఎక్కడ వచ్చాం? డబ్బులు ఖర్చు పెట్టుకునే వచ్చాం" అన్నాడు మన్మ థరావు.

"బావా! బాగున్నావా? మీరొచ్చారని తెలిసింది. మీ ఊరు వద్దామంటే కుద రడం లేదు" అన్నాడు ఉపేంద్ర.

పురుషోత్తం నవ్వి ఊరుకున్నాడు. ఇల్లంతా కలయజూశాడు. ఇల్లంతా మార్బుల్‌స్టోన్‌తో మెరిసిపోతోంది. హాల్లో ఖరీదైన సోఫాలున్నాయి. గోడకి డెబ్బై అంగుళాల ఎల్‌ఈడీ స్మార్ట్ టీవీ ఉంది. ఇక కాంతిమతి ఒంటి నిండా నగలు దిగే సుకుని పట్టుచీర కట్టుకుని అమ్మోరిలా ఉంది. ఇంట్లో ఎక్కడ చూసినా ఖరీదైన సామానుతో ఐశ్వర్యం తాండవిస్తోంది.

"ఏరా! రవీ! ఏం చదువుకున్నావ్?" మేనల్లుడిని అడిగాడు పురుషోత్తం.

రవి సిగ్గుతో మెలికలు తిరిగాడు. పొడుగ్గా, కొంచెం లావుగానే వున్నాడు.

"ఇంటరు మావయ్యా?"

"పాసయ్యావా?"

లేదన్నట్టు అడ్డంగా తలవూపాడు

"మాకు చదువెందుకు బావా? చది వింది చాలు. కాస్త లెక్కలొస్తే చాలు. బిజినెస్ లెక్కలన్నీ వాడే చూస్తాడు. పెర్ ఫెక్ట్ అనుకో! నేను పైపైన పెత్తనమే!" అన్నాడు ఉపేంద్ర నవ్వుతూ.

"భోజనానికి రండి. కబుర్లు తర్వాత చెప్పుకోవచ్చు" అన్నది కాంతిమతి అందర్నీ వుద్దేశించి.

భోజనాలు అయ్యాక అందరూ హాల్లో సోఫాల్లో కూర్చున్నారు. పాత రోజుల కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అయితే బావా! మీరిక దుబాయ్ నుంచి ఇక్కడకు పూర్తిగా వచ్చేసినట్టేనా?" అడిగాడు ఉపేంద్ర

"ఆc అంతే!"

"ఇక్కడేం చేస్తావ్?"

"చేసేదేం లేదు. అక్కడ వుండలేని పరి స్థితి వచ్చింది.. వచ్చేశాం. ఈ వయసులో ఎవరి దగ్గరా వుద్యోగం చేయలేను. బిజి

నెస్ చెయ్యలేను"

"అదేంటి బావా? ఇంజనీర్‌వి ఏ కంపెనీలోనైనా అడ్వైజర్‌గా కళ్ళకద్దుకుని తీసుకుంటారు"

"చెప్పాగా చేయలేనని? "

"ఖాళీగా వుండి ఏం చేస్తావు? "

"ఖాళీ ఎక్కడ వుంది? మా అమ్మాయి పెళ్ళిచేయాలా? మా వాడికి ఏదైనా దారి చూపించాలిగా బతకడానికి? "

"బావా! కోట్లు సంపాదించావు దుబాయ్‌లో. ఒక్కసారిగా అవన్నీ ఎట్లాపోయినయ్? "

"అంతా దేవుడిలీల" పురుషోత్తం రెండు చేతులూ పైకెత్తి చూపించాడు

"ఎవరైనా పార్టనర్లు మోసం చేశారా? "

"ఇప్పుడు అదంతా ఎందుకులే బావా! కట్టు బట్టలతో వచ్చేశాం. దుబాయ్‌తో మాకు రుణం తీరిపోయింది. అక్కడ మీ అక్కయ్యని పోగొట్టుకున్నాను" పురుషోత్తం కళ్ళు తుడుచుకున్నాడు.

చైతన్య బిక్కమొహం వేసుకుని కూర్చున్నాడు తండ్రి మాటలు వింటూ..

"బాధ పడకు బావా! జరిగిపోయిందానికి ఏం చెయ్యగలం? ఇక ముందు జరగాల్సింది ఏమిటని ఆలోచించుకోవాలి" ఓదారుస్తూ అన్నాడు ఉపేంద్ర.

"నిజమే బావా! ఇప్పుడు మేం ఎందుకొచ్చామంటే గీతిక పెళ్లి చేయాలి ముందు, అందుకు.." అంటూ మన్మథరావు గీతిక ఫోటోలున్న ఆల్బమ్ ఉపేంద్రకు ఇచ్చాడు.

ఉపేంద్ర ఆల్బమ్ తిరగేశాడు. "అచ్చం అన్నపూర్ణ అక్కలాగే వుంది. అంతా తల్లి పోలిక" అన్నాడు.

"ఔను! అది పుట్టినప్పుడే చెప్పాను" అన్నది కాంతిమతి.

"చూడు నీ కోడలు ఎంత బాగుందో! అంటూ ఉపేంద్ర ఫొటో ఆల్బమ్ భార్యకు అందించాడు.

కాంతిమతి ఆల్బమ్ తిరగేసింది.

"కాంతీ! దీపికను రవికి ఇద్దామనుకుంటున్నాడు అన్నయ్య. ఏమంటావు? అడిగాడు మన్మథరావు.

"నాదేముంది అన్నాయ్! మీ బావ ఇష్టం" అంది కాంతిమతి, ఉపేంద్ర వైపు చూస్తూ.

"నాదేవుంది? ఇంట్లో కోడలితో పడాల్సింది నువ్వు, కాపురం చేయాల్సింది నీ కొడుకు. మీరిద్దరూ ఆలోచించుకోండి" అన్నాడు, ఉపేంద్ర నవ్వుతూ.

"అంతా కలిసి ఆలోచించుకోండి! ఇక మేం బయల్దేరతాం" అన్నాడు పురుషోత్తం సోఫాలో నుంచి లేస్తూ.

"అయ్యో! అప్పుడే వెళ్లిపోతారా? రాత్రికి వుండండి. రేపెళ్ళొచ్చులే" అన్నాడు ఉపేంద్ర

"ఔను! ఏం తొందర? " అంది కాంతిమతి.

"కాదులే! పనులున్నాయి" అన్నాడు మన్మథరావు.

"సరే! వెళ్ళొస్తాం అమ్మాయ్!" అన్నాడు లక్ష్మణరావు.

"మీరు బాగా డిస్కస్ చేసుకుని ఫోన్ చెయ్యండి" అన్నాడు పురుషోత్తం.

అంతా బయల్దేరారు. గేటు దగ్గరి వరకు వచ్చి వీడ్కోలు చెప్పారు భార్యాభర్తలు.

"చూశావా అన్నాయ్! ఇంట్లో కారుంది. డ్రైవర్ అక్కడే వున్నాడు. మనల్ని బస్టాండ్ వరకైనా డ్రాప్ చేయమని వాడితో అనొచ్చుగా! మాట్లాడకుండా వూరుకున్నారు" అన్నాడు లక్ష్మణరావు కోపంతో.

పురుషోత్తం నవ్వాడు.

'లోగడ తాము దుబాయ్ నుంచి ఎప్పుడొచ్చినా కారుని, డ్రైవర్‌ని అప్పగించేవారు. 'ఇక్కడ వున్నన్ని రోజులు వాడుకోండి!' అనేవారు. కనీసం పెట్రోలు కూడా పోయనిచ్చేవాళ్ళు కాదు. ఎప్పుడు కావల్సినా ట్యాంక్ ఫుల్ చేయించమని డ్రైవర్‌కి డబ్బిచ్చేవాడు ఉపేంద్ర.

'నా కోడలు బాగా పొడుగవుతోంది. వదినా!' అంటూ అన్నపూర్ణతో చెప్పి మురిసిపోయేది కాంతిమతి. 'తన దగ్గర కోట్లు కరిగిపోయాయనీ, కట్టుబట్టలతో మిగిలారనీ తెలిసి కాంతిమతి మారిపోయింది. మానవ సహజం' అనుకున్నాడు పురుషోత్తం.

"ఇదివరకు కారులో చిలుమూరు వరకు సాగనంపేవారుగా? ఇప్పుడేమైంది? " అక్కసుగా అన్నాడు లక్ష్మణరావు.

"ఎవరైనా అంతేరా? మన దగ్గర డబ్బు మూలుగుతున్నప్పుడు మర్యాద ఇస్తారు. లేనప్పుడు చిన్నచూపు చూస్తారు. ఈ ప్రపంచమే అంత. వాళ్ళని అనే పనే వుంది? " అన్నాడు పురుషోత్తం.

ఆ మాటలు తమకు కూడా వర్తిస్తాయని భుజాలు తడుముకున్నారు అన్నదమ్ములు.

గుంటూరు వెళ్ళొచ్చి వారమైనా కాంతిమతిగానీ, ఉపేంద్రగానీ ఫోన్ చేయలేదు.

ఒకరోజు మన్మథరావు పొద్దున్నే వచ్చాడు. "అన్నయ్యా! బావగానీ, కాంతిగానీ ఫోన్ చేశారా? " అడిగాడు.

"లేదురా! అన్నాడు పురుషోత్తం.

మన్మథరావు తన సెల్‌ఫోన్ నుంచి ఫోన్ చేశాడు చెల్లెలికి.

"అన్నయ్యా! ఏమనుకోకండి! మా రవికి పాతిక లక్షలు కట్నం ఇస్తామని తిరుగుతున్నారు. పెద్దన్నయ్యా కట్నం ఇచ్చే పరిస్థితుల్లో లేరుగా! అందుకే ఏం చెప్పాలో తెలియక ఫోన్ చెయ్యలేదు" అంది కాంతిమతి.

"అయితే మీకు డబ్బే ముఖ్యమన్న మాట!" కోపంగా అన్నాడు మన్మథరావు.

"ఔను అన్నయ్యా! పేరుకి పది లారీలు తిరుగుతున్నాయి గానీ, అప్పులు కూడా వున్నాయి. బళ్లమీద ఫైనాన్స్ కట్టలేక తికమకపడుతున్నాడు మీ బావ. రవికి కట్నం వస్తే అప్పులు తీర్చేయాలని ఆశపడుతున్నాడు.

కాంతిమతి మాటలు విని మండిపడ్డాడు మన్మథరావు. పురుషోత్తం వారించాడు. తన మనుమరాలిని కోడలుగా చేసుకోవడానికి కూతురు ఒప్పుకోలేదని తెలిసి శేషమ్మ కూడా తిట్టింది.

"పోన్లేమ్మా! దాన్నెందుకు అంటారు? లోకమే అట్లా తయారైంది. డబ్బు మీద నడుస్తోంది. అది తన కొడుక్కి చేసుకోకపోతే నా కూతురికి పెళ్లికాదా? దేవుడు ఎక్కడో రాసి పెట్టుంటాడు" అన్నాడు పురుషోత్తం తమ్ముడిని, తల్లిని సముదాయిస్తూ.

ఆ రోజు సాయంకాలం పురుషోత్తం తీరిగ్గా ఉన్నప్పుడు చైతన్య తండ్రిని అడిగాడు. "డాడీ! ఆ రవిగాడు నాకేం నచ్చలేదు. చెల్లాయ్ కూడా వాడిని చేసుకోవడానికి ఒప్పుకుంటుందనుకోను. నల్లగా, బోండాంగాడు. ఇంటర్ కూడా చదవలేదు. వాడికి పిల్లనివ్వాలని మీరు, బాబాయిలు వాళ్లింటికి వెళ్లడం ఏంటి నాన్సెన్స్? "

పురుషోత్తం పకపకా నవ్వాడు.

"మనిషి దగ్గర డబ్బున్నప్పుడు బంధువులుగానీ, మిత్రులుగానీ ఎంత గౌరవిస్తారో! మర్యాదగా చూస్తారో! లేనప్పుడు ఎట్లా మారిపోతారో దీన్నిబట్టి నువ్వు తెలుసుకో! నేనున్నప్పుడే నీకు ఇటువంటివి ప్రాక్టికల్‌గా తెలియజెప్పాలి. నీ అంతట నువ్వు తెలుసుకోవడం కష్టం. అందుకు నీ వయసు, అనుభవం సరిపోదు. నీకు తెలియాలనే నిన్నుకూడా వాళ్లింటికి తీసుకెళ్లాను" అన్నాడు.

"మరి అత్తయ్యావాళ్లు, చెల్లాయిని రవికి చేసుకుంటామని ఒప్పుకుంటే ఏం చేసేవాడివి? " అడిగాడు చైతన్య.

"ఒప్పుకోరని నాకు ముందే తెలుసు! ఎందుకంటే ఇక్కడ మనవాళ్లు, వాళ్లకోసం వాళ్లు బతకరు.. ఇతరుల కోసం బతుకుతారు. కొలతలు వేసుకుంటూ తృప్తి పడ




# అందరూ అందరే!

కాలం శక్తిమంతమైంది. పేదవాడిని భూపాలుడిగా, నరపాలుడిని బికారిగా మార్చగలది. దాని ముందు ఎవరైనా అశక్తులే. కాలపురుషుడి మహిమతో ఓసారి శ్రీనాథమహాకవి కూడా ఓ చిన్న రాజ్యానికి అర్థిగా రావాల్సి వచ్చింది. ఆయన పాండిత్యం గురించి అక్కడెవరికీ తెలీదు. ఊరూపేరూ లేని అక్కడి పండితులు ఆయన కవిత్వపటుత్వానికి పరీక్షపెట్టారు. 'అందరు అందరే మరియు అందరు అందరె అందరందరే' సమస్యను పూరించండి అన్నారు.

వారి చిల్లర చేష్టలకి కవిసార్వభౌముడికి కడుపుమండింది. తన ప్రతిభకు పరీక్ష ఇదా అని కోపం వచ్చింది. అందుకే విసురుగా లేచి-

**కొందరు భైరవాశ్వములు; కొందరు పార్థుని తేరిటెక్కెముల్;**
**కొందరు ప్రాక్కిటీశ్వరులు; కొందరు కాలుని ఎక్కిరింతలున్;**
**కొందరు కృష్ణజన్మమున కూసినవారలు; ఈ సదస్సులో**
**అందరు అందరే మరియు అందరు అందరె అందరందరే!**

అంటూ అనర్గళంగా ఓ పద్యం చెప్పి కూర్చున్నాడు.

అంతే! సభలో అందరి ముఖాలూ మాడిపోయాయి. స్థూలంగా దీని అర్థం ఏమంటే- ఈ సదస్సులో అందరూ అందరే. కొందరు కుక్కలు, కొందరు కోతులు, కొందరు పందులు, కొందరు దున్నపోతులు, కొందరు గాడిదలు అని. మహాకవి కనుక ఆయన ఈ విషయాన్ని ఎంత సొగసుగా చెప్పాడంటే- 'కుక్కలు' అని నేరుగా అనేలేదు. భైరవాశ్వములు అంటూ గౌరవంగా చెప్పాడు. కోతుల్ని- అర్జునుడి రథంమీద జెండాపై ఉండేవాళ్లు అన్నాడు. కిటి అంటే పంది! అందుకే ప్రాక్కిటీశ్వరులు అన్నాడు. గాడిదల్ని కూడా కృష్ణుడు పుట్టినప్పుడు అరిచినవాళ్లు అంటూ తూర్పారపట్టాడు. మరి శ్రీనాథుడా మజాకా?

– చంద్రప్రతాప్

తారు. ఫలానా కాంతిమతి కొడుక్కి పాతి కలక్షలు కట్నం ఇచ్చారని అందరూ తెలుసుకోవాలి. ఉపేంద్ర మూడంతస్తుల మేడ కట్టాడని గొప్పలు చెప్పుకోవాలి"

"ఇవన్నీ నాకెందుకు? నేనెందుకు తెలుసుకోవాలి? " అడిగాడు చైతన్య.

"విదేశాలలో బతకడం వేరు. అక్కడ మనవాళ్లు ఎవరూ లేరు. మన పని మనం చేసుకుంటూ పోతాం. ఎవరూ జోక్యం చేసుకోరు. ఇక్కడ అలాకాదు. మీరిక్కడ ఇండియాలో బతకాలనుకుంటున్నప్పుడు ఇక్కడి మనుషుల గురించి కూడా తెలుసుకోవాలి. మీకు తెలియజెప్పాల్సిన బాధ్యత నాకుంది. నేను చెప్పకపోతే మీ అంతట మీరు తెలుసుకోలేరు. మీకు ఇతరులు కూడా చెప్పరు"

"ఏంటో డాడీ! నాకు సరిగా అండర్‌స్టాండ్ కావడం లేదు. మనుషులు నేచరల్‌గా సెల్ఫిష్ గదా? మనం కట్నం పాతిక లక్షలు ఇవ్వం అని తెలిసి అత్తయ్య దీపికను కోడలుగా చేసుకోడానికి రిజెక్ట్ చేసింది. తప్పేంటి? " అడిగాడు చైతన్య.

"నేను తప్పు అనడం లేదు. మొదటి నుంచి 'దీపిక మా కోడలు' అని అత్తయ్య అందరితో అంటూ ఉండేది. ఎందుకంటే అప్పుడు వాళ్లు అంత ఉన్నవాళ్లు కాదు. మనం మిలియనీర్స్! ఫారిన్‌లో ఉంటున్నాం! ఇప్పుడు తల్లకిందులైంది. వాళ్లు మిలియనీర్స్! మనం పాపర్! అందుకే మనసు మార్చుకున్నారు. అది నువ్వు అండర్‌స్టాండ్ చేసుకో"

"దట్సాల్ రైట్ డాడీ!"

"ఇంకొక విషయం తెలుసుకో! కొంత కాలం క్రితం మా బావ ఉపేంద్ర లారీ ఒక్కటే నడిపిస్తూ కిందామీదా పడుతూ ఉండేవాడు. అద్దె ఇంట్లో ఉండేవాడు. అత్తయ్య మన ఊరొచ్చి అప్పుడప్పుడు బియ్యం, పప్పులు మూటలు కట్టుకెళ్లి ఇల్లు గడుపుకునేది. లారీకి యాక్సిడెంట్ అయ్యింది. దివాలా తీశారు. మన ఇంటికి వచ్చి ఇద్దరూ ఏడ్చారు. అత్తయ్యకు ఇచ్చిన పొలం రెండు ఎకరాలు అమ్మి డబ్బు ఇవ్వమన్నారు. మా నాన్న ఒప్పుకోలేదు. నేనే ఒప్పించి నా డబ్బు సర్దాను. లారీకి ఫైనాన్స్ ఇప్పించి షూరిటీ సంతకం చేశాను. ఇప్పుడు వాళ్లు అవన్నీ మర్చిపోయారు. మనకు ఏదైనా సహాయం చేద్దామనే ఆలోచనే లేదు" చెప్పాడు పురుషోత్తం.

"డాడీ! ఫైనాన్స్ వ్యవహారాలు వేరు. పిల్లని కోడలుగా చేసుకోవడం వేరు కదా? నువ్వు కావాలంటే ఉపేంద్ర మావయ్య ఫైనాన్స్ సహాయం చేస్తాడేమో? "

"ఫైనాన్స్ అక్కర్లేదు. నీకేదైనా జాబ్ వంటిది ఇప్పించి హెల్ప్ చెయ్యమను చూద్దాం!"

"నాకేం జాబ్ ఇప్పిస్తాడు? "

"వాళ్లకి గుంటూర్లో స్పేర్‌పార్ట్స్ షాప్ ఉంది. లారీ ట్రాన్స్‌పోర్ట్ ఉంది. తల్చుకుంటే ఏదైనా జాబ్ ఇవ్వగలడు"

"అదేదో నువ్వే అడుగు డాడీ!" అన్నాడు చైతన్య.

పురుషోత్తం ఉపేంద్రకు కాల్ చేశాడు.

"సారీ బావా! పరిస్థితులు అట్లా ఉన్నాయ్! రవికి కట్నం తీసుకుంటేగానీ ఫైనాన్స్ ప్రాబ్లమ్స్ తీరవు. మీ చెల్లెలు అన్నీ చెప్పే ఉంటుంది" అన్నాడు ఉపేంద్ర.

"దాందేవుందిలే బావా! నేనేమనుకోవడం లేదు. ఇప్పుడు ఎందుకు కాల్ చేశానంటే మా చైతన్య గురించి"

"చెప్పు బావా!"

"వాడికి జాబ్ ఏదైనా గుంటూర్లో చూస్తావేమోనని.."

"గుంటూర్లోనా? !"

"ఔను! వాడి ఖర్చులకు సరిపడా జీతం వచ్చేది ఉంటే చాలు!"

"ఇక్కడ ఏం ఉంటాయి బావా? కుర్రా

ళ్లంతా జాబ్స్ కోసం హైదరాబాద్ వెళ్తున్నారు"

"పెద్ద జాబ్స్ కాదులే! మీ ట్రాన్స్‌పోర్టులో లెక్కలు చూసేపనిగానీ, షాపులో సేల్స్‌లోగానీ చూడు పోనీ!"

"దుబాయ్‌లో పెరిగి వచ్చినోడు ఇటువంటి పనులు చేస్తాడా? షాపులో సేల్స్‌కి అన్ని స్పేర్స్ గురించి తెలిసి ఉండాలి. ఇక లెక్కలు మా రవి చూసుకుంటాడు" చెప్పాడు ఉపేంద్ర.

"ఇప్పుడంటే ఇప్పుడు కాదులే! ముందు ముందు ఏదైనా ఉంటే చూడు! ఈ ఊళ్లో ఏం తోచడం లేదని వీడు గొడవపెడుతున్నాడు"

"సరే బావా! అలాగే బావా!" అన్నాడు ఉపేంద్ర ఏదో మొక్కుతీర్చుకున్నట్టు.

చైతన్యకు జరిగినదంతా చెప్పాడు పురుషోత్తం.

★ ★ ★

చైతన్య, బాబాయి పిల్లలతో పంట కాలువల్లో ఈత కొట్టడం, రామలింగేశ్వరస్వామి గుడికి వెళ్లి మారేడుచెట్టు నీడలో కూర్చుని కబుర్లు చెప్పుకోవడం, తోటల్లో తిరగడం వంటి వాటితో కాలక్షేపం చేస్తున్నాడు.

పురుషోత్తం రామారూరల్ కాలేజీకి వెళ్లి లైబ్రరీలో పుస్తకాలు తెచ్చుకుని చదువుకుంటున్నాడు.

గీతికకే సరిగా కాలక్షేపం కావడం లేదు. పిన్నమ్మల దగ్గర కూర్చుని వంట నేర్చుకుంటోంది. అదికూడా బోరుగానే ఉంటోంది. వాళ్లకి లేటెస్ట్ వంటకాలు తెలీవు. అరిసెలు, గారెలు, బూరెలు తప్ప! తనకేమో పిజ్జాలు, బర్గర్లు కావాలి.

"డాడీ! బోరుగా ఉంది. ఎన్నాళ్లు ఈ పల్లెటూళ్లో ఉండేది? " తండ్రి భుజాల మీద చేతులు వేసి గోముగా అడిగింది గీతిక.

"వెళ్దాంలే! ప్లాన్ చేస్తున్నా! నాకు చివరి రోజులు ఇక్కడే గడపాలని ఉంది. ఈ ఊళ్లో పుట్టి పెరిగాను గదా! ఆ మమకారం అటువంటిది. మీకు అండర్‌స్టాండ్ కాదులే!" అన్నాడు పురుషోత్తం.

పురుషోత్తం కూతురుతో కబుర్లు చెప్తూ ఉండగా నర్సయ్య వచ్చాడు. అతను టెన్త్‌లో పురుషోత్తం క్లాస్‌మేట్. పురుషోత్తం పైచదువులకు వెళ్తే నర్సయ్య టెన్త్ తర్వాత ఇక్కడే వ్యవసాయంలో ఉండిపోయాడు.

"గీతా! వీడు నర్సయ్య! నా క్లాస్‌మేట్" అన్నాడు.

గీతిక నమ్మలేనట్టు చూసింది.

ఎండలో, వానలో, చలిలో, పొలంలో, మట్టిలో మట్టిమనిషిగా బతికే నర్సయ్య రూపం ఎట్లా ఉంటుంది? దాదాపు అరవై ఏళ్ల వయసులో? నల్లటి మనిషి, ముఖం ముడతలు పడి, ఎండిపోయిన శరీరంతో, తెల్లగా నెరిసిన జుట్టుతో ముసలివాడు. నీడపట్టున ఆఫీసు ఎ.సి. రూముల్లో ఉండే పురుషోత్తం అరవైలో కూడా నిగనిగలాడుతూ తేటగా ఉన్నాడు గదా!

"డాడీ! ఇంత ఓల్డ్‌మెన్ నీకు క్లాస్‌మేటా? " ఆశ్చర్యంతో అడిగింది గీతిక.

"వీడు నా అంత ఓల్డేనమ్మా! ఎండల్లో పొలం పనులు చేసుకునేవాళ్లు అట్లానే ఉంటారు. నేనంటే ఎ.సి. రూముల్లో ఉండేవాడిని గదా! పెద్దగా మార్పు ఉండదు" చెప్పాడు పురుషోత్తం.

## కొత్తగాలి...

**దేశ రాజధానిలో**
**కమలం వాడింది**
**చేతికి చెమటలు పట్టాయి**
**బూజు దులిపేందుకు**
**అందరూ చీపురు పట్టారు**

– తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్

"రేపు పిల్లల్ని మా ఇంటికి పంపరా! తేగలు పాతర తీసి కాల్పిస్తున్నాం" అన్నాడు నర్సయ్య.

"తేగలు! వాటీజ్ తేగలు డాడ్?" అడిగింది దీపిక.

"తాటి పండ్ల టెంకలు భూమిలో పాతి పెడితే వాటి నుంచి మొలకలు వస్తాయి. అవే తేగలు. కాల్చి తింటే రుచిగా ఉంటాయి. ఫైబర్ బాగా ఉంటుంది వాటిల్లో. నీకు చెప్తే అర్థం కాదు. రేపు వీడింటికి వెళ్లి తిందాం!" అన్నాడు పురుషోత్తం.

"బై అంకుల్! రేపు మీ ఇంటికి వస్తా!" అని ఇంట్లోకి వెళ్లింది గీతిక.

శేషమ్మ రేలంగి గ్లాసుతో కాఫీ తెచ్చి నర్సయ్యకి ఇచ్చింది.

"ఏరా! నర్సయ్యా! కన్పించడం లేదేం?" అడిగింది.

"ఎక్కడ పెద్దమ్మా! తమలపాకుల తోట వేశాక తీరికే దొరకడం లేదు. సంవత్సరం పొడుగూతా దానికి సేవ చెయ్యాలి" అన్నాడు నర్సయ్య.

"సంవత్సరం పొడుగూతా డబ్బులు రావడంలా!" నవ్వింది శేషమ్మ.

"అరేయ్! పురుషోత్తం! మనతోపాటు బెంచీలో కూర్చునేవాడు చూడు సూర్యనారాయణ!"

"ఆc సూర్యం! నాకెందుకు గుర్తులేదూ? నాలుగేళ్ల క్రితం ఊరొచ్చినప్పుడు కలిశాడులే! అనంతారంలో ఉంటున్నానని చెప్పాడు. నేనున్నన్ని రోజులూ ఏదో టైంలో వచ్చేవాడు. ఇద్దరం గుడికెళ్లి మారేడు చెట్టుకింద కూర్చుని చిన్నప్పటి కబుర్లు గుర్తుచేసుకునేవాళ్లం. ఆ రోజుల్లో ఎంత అల్లరి చేసేవాళ్లం! కాలువలో ఎట్లా ఈతలు కొట్టేవాళ్లం?"

పురుషోత్తం చిన్ననాటి జ్ఞాపకాల్లోకి వెళ్లిపోయాడు.

"వాడేరా! పాపం చచ్చిపోయాడు" చెప్పాడు నర్సయ్య.

పురుషోత్తం ఉలిక్కిపడ్డాడు. సూర్యం రూపం కళ్ల ముందు కదిలాడింది. "చచ్చిపోయాడా? ఎప్పుడ్రా?" గొంతులో ఆవేదన ధ్వనించింది.

"నువ్వు ఊళ్లోకి రావడానికి ముందే! పదిరోజులైందేమో? పోయినసారి నిన్ను కలిసినప్పుడు హడావిడిలో ఉండి చెప్పలేకపోయాను"

"ఏమైందిరా వాడికి?"

"వాడి చిన్నకూతురి పెళ్లి గురించి పెళ్లాంతో గొడవట. ఆత్మహత్య చేసుకున్నాడంటున్నారు. కాదులే వాడికి ఉబ్బసం. చలికి ముదిరి పోయాడంటున్నారు బామ్మర్దులు"

"కూతురు పెళ్లిగురించి గొడవేంటి?"

"సంబంధం ఏదో కుదిరింది. వాళ్లు లక్ష రూపాయలు కట్నం అడిగారు. సూర్యం పెళ్లాం సరే అంది. ఒప్పుకుంది. వీడి దగ్గర డబ్బులేదు. పొలం అమ్ముదామని వీడంటే, పెళ్లాం ఒప్పుకోలేదు. అప్పు చేసి పెళ్లి చేద్దాం అని ఆవిడ పట్టుదల. అప్పుకి వడ్డీ కట్టడం సరిపోతుంది. అసలు తీర్చడానికి ఏళ్లు పడుతుంది, అసలే చేస్తున్న వ్యాపారం సరిగా సాగడం లేదు అని మొత్తుకున్నాడు సూర్యం. రోజూ ఇంట్లో గొడవలేనంట. వాడికి జీవితం మీద విరక్తి పుట్టిందో ఏమో! పాపం!" చెప్పాడు నర్సయ్య.

పురుషోత్తం కళ్లముందు సూర్యనారాయణ కనిపిస్తున్నాడు. 'ఎంత మంచి వాడు? చిన్నతనంలో తినడానికి ఏం తెచ్చుకున్నా తనకు పెట్టకుండా తినేవాడు కాదు. ఎన్ని ఆటలు ఆడుకునేవాళ్లు? చదువుకునే రోజుల్లో! ఆఫ్టాల్ లక్షకోసం ప్రాణం తీసుకున్నాడా? ఏమి జీవితాలు వీళ్లవి?' పురుషోత్తం కదిలిపోయాడు. మనసు విచారంతో అల్లకల్లోలమైంది. కళ్లల్లో నీళ్లు తిరిగాయి. కళ్లు తుడుచుకు

న్నాడు.

"పదిహేనో రోజు చేస్తారంట వాడి దినం. వాళ్ల బామ్మర్ది చెప్పిపోయాడు" అన్నాడు నర్సయ్య.

"ఆ రోజు తప్పకుండా వెళ్దాం రా! నువ్వు మా ఇంటికి వచ్చేయ్! ఇద్దరం కలిసి పోదాం ఏం? " అన్నాడు పురుషోత్తం.

నర్సయ్య తలూపాడు.

చెప్పినట్టే వచ్చాడు నర్సయ్య బైక్ వేసుకుని. పురుషోత్తం అతనితోపాటు అనంతారం వెళ్లాడు.

సూర్యనారాయణ ఉంటున్న పెంకుటిల్లు ముందు షామియానా వేసి ఉంది. అందులో కొన్ని ప్లాస్టిక్ కుర్చీలు వేసి ఉన్నాయి. కొందరు బంధువులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. నర్సయ్య ఒక పక్కగా బైక్ ఆపాడు. వీళ్లని చూసి చంద్రయ్య ముందుకు వచ్చాడు. అతను సూర్యనారాయణ బామ్మర్ది.

"రా నర్సయ్యన్నా!" అంటూ పురుషోత్తం వైపు ఎవరు? అన్నట్టు చూశాడు.

"అరేయ్! చంద్రయ్యా! ఈయన తెలియదురా నీకు? మీ బావతోపాటు చిన్నప్పుడు చదువుకున్నాడు. సూర్యం, నేను, వీడు ఒకే బెంచీలో కూర్చునేవాళ్లం. భలే అల్లరి చేసేవాళ్లంలే. వీడి పేరు పురుషోత్తం. దుబాయ్‌లో ఉండేవాడు. ఇప్పుడు వచ్చేశాడ్లే! చిలుమూర్లో కృష్ణారావు గారని నీకు తెలిసే ఉంటుంది. వాళ్ల పెద్దబ్బాయి. ఇంజనీర్‌లే..!" అంటూ నర్సయ్య నాన్‌స్టాప్‌గా చెప్తున్నాడు.

"చెప్పింది చాల్లేరా!" అని నవ్వాడు పురుషోత్తం.

చంద్రయ్య వీళ్లని షామియానాలోకి తీసుకెళ్లి కూర్చోబెట్టాడు: "మా బావ ఇంటి పేరున్న వాళ్లంతా చెరువు దగ్గరకి వెళ్లారు. వచ్చేస్తారు కూర్చోండి" అన్నాడు చంద్రయ్య.

"ఎట్లా పోయాడు మీ బావ? " అడిగాడు పురుషోత్తం.

నర్సయ్య చెప్పిన విషయమే దాదాపుగా చెప్పాడు చంద్రయ్య.

"ఊళ్లో రకరకాలుగా అనుకుంటున్నారండీ! మా బావకి అప్పులు చేయడం ఇష్టం ఉండదు. ఉన్నంతలో సర్దుకోవాలంటాడు. లక్ష రూపాయలు అప్పు చేసి తీర్చడం కష్టమే. మా బావకి లోకజ్ఞానం తెలుసు. వడ్డీలు కట్టడమే సరిపోతుంది. వాళ్లది చిన్నషాపు. ఈ మధ్య అదీ సరిగా నడవడం లేదు. అయితే మా చెల్లెలు కొంచెం మొండిది. తన మాట చెల్లాలంటుంది. పిల్ల పెళ్లి గురించి ఇద్దరికీ ఘర్షణ జరుగుతున్న మాట వాస్తవం. అయితే మా బావ ఆత్మహత్య చేసుకునే పిరికివాడు మాత్రం కాదు. మనసులో దిగులు ఉండొచ్చు. ఉబ్బసం ఎక్కువై ఊపిరాడక పోయాడని డాక్టరు కూడా చెప్పాడు" చంద్రయ్య కళ్లు తుడుచుకున్నాడు.

"బాధ పడకండి! జరిగిందేదో జరిగింది. పోయినోళ్లంతా మంచోళ్లు.. అదృష్టవంతులని అనుకోవాలి. బాధల నుంచి విముక్తి పొందారు. ఇక ముందు ఏం జరగాలో ఆలోచించండి" అన్నాడు పురుషోత్తం.

"ఔన్రా! చంద్రయ్యా! ఇప్పుడేం చేద్దామనుకుంటున్నారు? మీ చెల్లెలు ఏమంటోంది? " అడిగాడు నర్సయ్య.

"అది అనేదేముంది అన్నాయ్! పొలం అమ్మేసి పిల్ల పెళ్లి చెయ్యడమే! మళ్లీ ఆ సంబంధం వెనక్కిపోతే కష్టం గదా? వాళ్లు కూడా మంచోళ్లే! ఆర్నెల్ల తర్వాత పెళ్లి చెయ్యొచ్చు. ముందు పెళ్లి చెయ్యండి. కట్నం సంగతి తర్వాత చూసుకుందాం అన్నారు" చెప్పాడు చంద్రయ్య.

"అయితే వాళ్లు మంచి మనసున్నవాళ్లే! అలాగే చెయ్యండి. మీ చెల్లెలికి నచ్చజెప్పండి" అన్నాడు నర్సయ్య.

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక బయల్దేరారు.

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య సహా ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర నవల' అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీనికి అనుగుణంగా రచయితలు నవలల్ని రాసి పంపాలి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు తిప్పి పంపేందుకు వీలుగా తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా గల కవరు జతపరచాలి. స్టాంపులు అంటించని నవలలు ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి.

★ నవలలపై నిర్ణయం తెలియజేయడానికి 6-8 వారాలు పడుతుంది. ఫోన్/ ఎస్సెమ్మెస్/ ఈమెయిల్ ద్వారా మా నిర్ణయాన్ని తెలియజేస్తాం. గడువులోగా సమాచారం అందకపోతే మమ్మల్ని సంప్రదించవచ్చు.

★ నవలతోపాటు మీ చిరునామా, ఫోన్ నెంబరు, ఈ మెయిల్ వివరాలు స్పష్టంగా రాయాలి.

★ సంపాదకులను ఉద్దేశించి 'హామీ పత్రం' తప్పనిసరిగా పంపాలి. హామీ పత్రం లేని నవలలు పరిశీలించలేమని మనవి.

## నమూనా హామీ పత్రం

సంపాదకులు చతుర!

ఫలానా నవలను 'చతుర'లో ప్రచురణార్థం పంపుతున్నాను. ఈ నవల నా సొంతం. దేనికీ అనువాదం కాదు. ఒకవేళ అనువాదమైతే (అనువాద నవల ఫలానా భాషా రచయితది (రచయిత పేరు). ఫలానా పబ్లిషర్‌నుంచి, ఫలానా భాషలో స్వీకరించి అనువదించాను).

ఈ నవలను ఇంతవరకూ ఏ పత్రికకూ పంపలేదు. ఎవరి పరిశీలనలోను లేదు. ఏ వెబ్‌సైట్, బ్లాగులో కానీ ప్రచురితం కాలేదు. ఈ అనువాద నవలకు మూల రచయిత/రచయిత్రి/ ప్రచురణకర్తల నుంచి అనుమతి పొందాను/ పొందలేదు. ప్రచురణకు స్వీకరించని పక్షంలో తిప్పి పంపటానికి స్టాంపులు అంటించిన కవరు జతపరిచాను/లేదు.

తేదీ:

స్థలం: సంతకం:

**చిరునామా :** ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఫోన్ : 23318181, Ext: 6658, 6532 ఈ మెయిల్: vipula.chatura@gmail.com

"నర్సయ్యా! నేనొకసారి సూర్యం భార్యతో మాట్లాడాలి" అన్నాడు పురుషోత్తం.

"ఇప్పుడు వద్దులే! పుస్తెలు తియ్యడం, గాజులు పగలగొట్టడం వంటి కార్యక్రమాలు ఏవో చేస్తుంటారు ఆడవాళ్లు. తర్వాత వచ్చి పరామర్శిద్దాంలే! ఆ అమ్మాయి కూడా పుట్టెడు దుఃఖంలో ఉంటుంది" అన్నాడు నర్సయ్య.

పురుషోత్తం తల ఊపాడు.

నర్సయ్య పురుషోత్తంని ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు. "ఒకసారి మా తమలపాకుల తోట చూట్టానికి రారా! మళ్లీ ఊరెళ్తున్నానని అంటున్నావు. మళ్లీ ఎప్పుడు వస్తావో? " అన్నాడు నర్సయ్య.

"వస్తాలే! ఒకసారి సూర్యం భార్యని పలకరించి వద్దాం! గుర్తుంచుకో!" అన్నాడు పురుషోత్తం.

★ ★ ★

గీతికతోపాటు గొంతు కలిపాడు చైతన్య. "డాడీ! పదిహేను రోజులైంది మనం వచ్చి. మాకేం తోచడం లేదు. బోర్ డాడీ..! హైదరాబాద్ వెళ్లిపోదాం. అక్కడ మీ ఫ్రెండ్స్ ఎవర్నైనా చెప్పు మనకొక ఇల్లు అద్దెకు చూడమని"

"వెళ్దాంలే! ఈలోపు మనం నాగార్జునసాగర్ వెళ్లొద్దాం" అన్నాడు పురుషోత్తం.

"డాడీ! నువ్వక్కడ పనిచేశానని చెప్పావు గదా? "

"ఔను! అక్కడ జూనియర్ ఇంజనీర్‌గా పనిచేశాను. కొందరు ఫ్రెండ్స్ కూడా ఉన్నారక్కడ. ఒకసారి వెళ్లొద్దాం అనుకుంటూనే, ఎప్పుడు ఇండియా వచ్చినా వెళ్లలేకపోయాను. ఇప్పుడు నాకు అంతా తీరికేగా! చివరిసారి చూసొస్తాను"

"చివరిసారేంటి డాడీ? " అనుమానంగా అడిగాడు చైతన్య.

పురుషోత్తం కంగారుపడి సర్దుకున్నాడు. "చివరిసారి అంటే, మాటిమాటికి అక్కడికి వెళ్లం గదా? మళ్లీ వెళ్తానో లేదోనని" అన్నాడు.

మర్నాడు పురుషోత్తం ఒక్కడే గుంటూరు వెళ్లాడు.

చైతన్య వస్తానని అన్నా తీసుకెళ్లలేదు. మన్మథరావు, లక్ష్మణరావు వచ్చి అడిగారు. వాళ్లకి కూడా చెప్పకుండా గుంటూరు ఏ పని మీద వెళ్లాడో ఎవరికీ అర్థం కాలేదు.

అప్పుడే నర్సయ్య కూడా వచ్చాడు. "వాడికి ఫోన్ చేస్తే లైన్ కలవడం లేదురా! సెల్ ఎందుకు స్విచ్ఛాఫ్ చేశాడో కనుక్కుందామని వచ్చాను" అన్నాడు నర్సయ్య మన్మథరావుతో.

"అన్నయ్య గుంటూరు వెళ్తున్నానని అమ్మకి చెప్పాడంట. ఒక్కడే ఏం పనిమీద వెళ్లాడో తెలీదు" అన్నాడు మన్మథరావు.

"గీతికకి ఏదైనా పెళ్లి సంబంధం గురించి వెళ్లాడేమో? " అన్నాడు లక్ష్మణరావు.

"పెళ్లి సంబంధం గురించి అయితే మాకు చెప్పకుండా ఎందుకు వెళ్తాడు? ఇంకేదో అయి ఉంటుందిలే!" అన్నాడు మన్మథరావు.

ఇంతలో శేషమ్మ అందరికీ కాఫీ తెచ్చి ఇచ్చింది.

"ఇంటికొస్తే చాలు మా పెద్దమ్మ కాఫీ ఇవ్వకుండా వదలదు. పెద్దమ్మా! నీ చేతి కాఫీ రుచి ఎక్కడా చూళ్లేదు నేను. ఏం మహత్యం ఉందో నీ చేతిలో!" అన్నాడు నర్సయ్య మెచ్చుకోలుగా.

"మహత్యం లేదు! నా బొందా లేదు! నేను పాలలో నీళ్లు కలపనురా నర్సయ్యా! అందుకే అంత రుచి" అసలు సంగతి చెప్పింది శేషమ్మ.

"పెద్దమ్మా! వీడు ఒక్కడే గుంటూరు ఎందుకెళ్లినట్టు? నీకేమైనా చెప్పాడా? " అడిగాడు నర్సయ్య.

"ఏమోరా! నాకేం చెప్పలేదు. ఏం పనో మరి? ఫస్ట్ బస్‌కే వెళ్తానని వెళ్లాడు.

టిఫిన్ కూడా చెయ్యలేదు. గుంటూర్లో చేస్తాలే అన్నాడు. స్నానం చేసి కాఫీ తాగి వెళ్లాడు" అంది శేషమ్మ.

"ఏరా! మీ అన్నయ్య కూతురికి పెళ్లి చెయ్యాలనుకుంటున్నాడు. ఏవైనా సంబంధాలు చూస్తున్నారా?" అడిగాడు నర్సయ్య.

మన్మథరావు, లక్ష్మణరావు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"మొన్ననే గుంటూరెళ్లి మా చెల్లెల్ని అడిగి వచ్చాం తన కొడుక్కి చేసుకోమని. పాతిక లక్షలు ఇస్తామని సంబంధాలు వస్తున్నాయని దీర్ఘాలు తీసింది. ఇప్పుడు అన్నయ్య దెబ్బతిని ఉన్నాడుగా! కట్నం ఇవ్వలేడని అదొక వంక. అది డబ్బు మనిషయి పోయింది" అన్నాడు మన్మథరావు అక్కసుగా.

"ఈ సంగతి మీ అన్న చెప్పాడులే! అయినా రోజులు మారాయిలే. అందరూ డబ్బు మనుషులే. పూర్వం ఉన్న ప్రేమలు, ఆప్యాయతలు, మనుషుల మధ్య మమకారాలు ఎక్కడ ఉన్నాయి? ప్రపంచం మారింది. మీ అన్న దగ్గర కోట్లు ఉండి ఉంటే మీ చెల్లెలు ఇక్కడే మకాం వేసేది. 'నీ కూతుర్ని నా కోడల్ని చేస్తావా? లేదా?' అని గొడవ చేసేది. 'మేనరికం వదులుకుంటే దూరం అయిపోతాం అన్నయ్యా!' అని ఏడ్చిమొత్తుకునేది" అన్నాడు నర్సయ్య.

అన్నదమ్ములు ఇద్దరూ అవునని తలలూపారు. కాసేపు కూర్చుని వెళ్లిపోయారు. నర్సయ్య ఒక్కడే వరండాలో కూర్చుని ఉన్నాడు.

"ఏరా! నర్సయ్యా! పెద్దాడితో ఏదైనా పనుందా?" అడిగింది శేషమ్మ.

"పనేం లేదు పెద్దమ్మా! అనంతారం వెళ్దాం అన్నాడు. సూర్యం భార్యని పలకరించి వద్దామంటే వచ్చా! ఫోన్‌లో పలక లేదు. చార్జింగ్ అయిపోయిందేమోనని అనుకున్నా! గుంటూరు వెళ్లాడని ఇక్కడి కొచ్చాకే తెలిసింది"

"సర్లే! పోనీ రేపెళ్లి పలకరించి రండి"

## 'చతుర'లో నాలుగో నవల

**వాణిశ్రీ**

'చతుర'లో ఇది నా నాలుగో నవల. మొదటి నవల 1966లో ప్రజామత, బెంగళూరు వారపత్రికలో ధారావాహికగా వచ్చింది. మొదటి కథ సైనిక సమాచార్, న్యూఢిల్లీ, 1958లో ప్రచురితమైంది. ఇప్పటివరకు ఇరవై నవలలు, ఎనిమిదొందల కథలు వివిధ పత్రికలలో అచ్చయ్యాయి. 1979లో చక్రపాణి అవార్డు మొదలు అనేక కథలకు బహుమతులు పొందాను. 2009లో చిలుమూరు రామా విద్యాసంస్థల వారితో బాల సాహిత్యంలో కృషికి 'చక్రపాణి-కొలసాని' అవార్డు అందుకున్నాను. కొన్ని నవలలు పుస్తకరూపంలో, వివిధ కథలు సంకలనాలు, సంపుటాలుగా వెలువడ్డాయి. ప్రస్తుతం తెలుగు కథ రచయితల వేదికకు కన్వీనర్‌గా పనిచేస్తున్నాను. పుట్టింది గుంటూరులో, నాగార్జున సాగర్ ప్రాజెక్టులో ఆఫీసు సూపరింటెండెంట్‌గా పదవీ విరమణ చేశాను.

చిరునామా:
**వాణిశ్రీ (సిహెచ్. శివరామ ప్రసాద్)**
స్వగృహ అపార్ట్‌మెంట్స్, సి బ్లాక్,
ఎఫ్-2, భాగ్యనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్-72

"అంతే ఇక. ఔను పెద్దమ్మా! వీడు తన భాగం పొలం రెండెకరాలు తమ్ముళ్లకే రాసిచ్చాడు గదా! ఇన్నాళ్లూ అనుభవించారు. ఇప్పుడు వాడు అవసరంలో ఉన్నాడు. బిజినెస్‌లో దెబ్బతిని వచ్చాడు. పిల్ల పెళ్లి చెయ్యాలి. తమ్ముళ్లిద్దరూ ఆ పొలం వీడికి తిరిగిచ్చేస్తే బాగుంటుదిగా! దాన్ని అమ్మితే పిల్ల పెళ్లికి పనికొస్తుంది డబ్బు" అన్నాడు నర్సయ్య.

శేషమ్మ నర్సయ్య కూర్చున్న కుర్చీ పక్కనే నేల మీద చతికిలబడింది. "గట్టిగా అనకురా! తమ్ముళ్లు మనవాళ్లయినా మరదళ్లు మనవాళ్లా? పరాయివాళ్లే ఎప్పటికైనా! వీళ్లకి ఇవ్వాలని ఉన్నా, ఆళ్లు పడనిస్తారంటరా! నీ పిచ్చిగానీ! వాళ్లిస్తానని వస్తే అప్పుడు అది వేరుగానీ, పెద్దాడి సంగతి తెలుసుగా! వాడు ఇచ్చేవాడే గానీ పుచ్చుకునే రకం కాదు. వాళ్లు ఇస్తానన్నా వీడు పుచ్చుకోడు. నాకు తెలుసు గదా? మనం ఇట్టా అనుకుంటున్నామని తెలిస్తే కోడళ్లు నామీద పడి ఏడ్చి చస్తారు" అంది శేషమ్మ.

"వీడు పుచ్చుకోడని ఎట్టా అనుకుంటాం పెద్దమ్మా? వాళ్లు 'ఇస్తాం అన్నాయ్' అంటే గదా తెలిసేది? వీడి పొలం వీడికి ఇవ్వడానికి ఏం తీపర్రం? "

"దానికి సవాలక్ష చెప్తార్రా నర్సయ్యా! పెద్దోడు తన భాగం తమ్ముళ్లకి రాసిచ్చినప్పుడే మా కోడళ్ల తరపువాళ్లు 'వూరికే ఏం ఇవ్వలేదు. ఉమ్మడి ఖర్చు మీద గదా ఇంజనీరింగ్ చదివింది? చిన్నాళ్లిద్దరికీ చదువు ఖర్చులేదుగా? అందుకని పొలం ఇచ్చేశాడు. ఉద్యోగం మీద సంపాదించుకుంటాడుగా? ఇక పొలం ఎందుకు? ఆ మాదిరిగా అన్నార్రా! ఇప్పుడూ అవే మాటలు అంటారు" చెప్పింది శేషమ్మ.

"నాతో వాడేం అనలేదు. నా మనసులో మాట చెప్పాను పెద్దమ్మా! బతికి చెడి మనుగడ సాగించడం కష్టం" అన్నాడు నర్సయ్య.

"నిజమేరా నర్సయ్యా! ఖర్మ! ఏం చేస్తాం? ఏదైనా బేరం ఉంటే చెప్పు, ఈ ఇల్లు అమ్మేసి డబ్బు పెద్దోడికి ఇస్తాను. అంతకంటే నేనేం చేస్తాను? " అని కళ్లొత్తుకుంది శేషమ్మ.

పెద్దకొడుకు పరిస్థితి గురించి ఆమె ఎంత బాధపడుతోందో అతనికి అర్థమైంది.

"ఇల్లు అమ్ముతావా పెద్దమ్మా? " ఆశ్చర్యంతో అన్నాడు నర్సయ్య.

తల ఊపింది శేషమ్మ.

తాతల నాటి స్థావరం పోగొట్టుకోవటానికి సిద్ధపడడం ఎవర్కైనా ఎంత బాధాకరం? తరతరాలుగా ఆ ఇంట్లో పెళ్లిళ్లు, పేరంటాలు జరిగాయి వైభవంగా. పిల్లలు పుట్టి పెరిగారు ఆ ఇంట్లోనే. బంధుజనంతో కళకళలాడిన ఆ లంకంత ఇల్లు ఆ ఊరికే గర్వకారణం. గాలివానలు వచ్చినప్పుడు పూరిళ్లలో ఉండేవాళ్లు అందులో తలదాచుకోవడం తను ఎరుగును. అటువంటి పురాతన కట్టడం అమ్మేస్తే ఏముంది? పడేసి కొత్తది కట్టుకుంటారు ఎవరైనా? ఊరికి మధ్యలో ఉండడం వలన మంచి విలువ చేస్తుంది. అయితే అమ్మినప్పుడు అతని తమ్ముళ్లు భాగం అడగకుండా ఉంటారా?

నర్సయ్య భారమైన హృదయంతో లేచి

---

**కొత్తగాలి...**

**అలనాటి 'చందమామ కథలు'**
**చెట్టెక్కాయి**
**లాప్‌టాప్ కథలు**
**ఒళ్లోకొచ్చాయి!**

– వై.వి.ఎస్.ఎస్. అన్నపూర్ణ,

బయల్దేరాడు.

మర్నాడు పురుషోత్తమే నర్సయ్యకు ఫోన్ చేశాడు. "అర్జెంటుగా గుంటూరు వెళ్లానురా పనిమీద. నిన్న వచ్చి వెళ్లావ టగా? అమ్మ చెప్పింది"

"ఔన్రా! అనంతారం వెళ్దామనుకున్నాం గదా! సూర్యం భార్యని పలకరించి వద్దాం అని వచ్చా! నిన్న నీ ఫోన్‌కి లైన్ కలవ లేదు. అందుకని ఏమైందోనని వచ్చా!" అన్నాడు నర్సయ్య.

"సరే! ఇప్పుడు నీకు తీరిక ఉంటే రా! వెళ్దాం" అన్నాడు పురుషోత్తం.

"ఇప్పుడు కాదులే! ఆకులు కోయిస్తున్నా! సాయంకాలం నాలుగింటికి వస్తాను. అప్ప టికి సరుకు తెనాలి వెళ్లిపోతుంది" చెప్పాడు నర్సయ్య.

"నీ ఇష్టం" అన్నాడు పురుషోత్తం.

సాయంకాలం వచ్చాడు నర్సయ్య. "ఏంట్రా అంత అర్జెంట్ గుంటూర్లో? " అడిగాడు వస్తూనే.

"రేపు నాగార్జునసాగర్ వెళ్తున్నా, పిల్లల్ని తీసుకుని. అక్కడ ఇప్పుడు ఉన్నవాళ్ల ఫోన్ నెంబర్లు ఇస్తానంటే నాగభూషణం దగ్గరికి వెళ్లాను. వాడు నాతోపాటే పనిచేసి ఇప్పుడు గుంటూర్లో ఉంటున్నాడు. ఒక సారి వాడిని చూసినట్టు ఉంటుంది, ఫోన్ నెంబర్లు తీసుకున్నట్టు ఉంటుందనీ వెళ్లా! పాత స్నేహితులను కలుసుకోవడం నాకు చాలా సంతోషంగా ఉంటుంది. అప్పట్లో గడిపిన రోజులు గుర్తొచ్చి ఆనందం కలు గుతుంది" చెప్పాడు పురుషోత్తం.

నర్సయ్య పురుషోత్తం ముఖంలోకి పరీ క్షగా చూసి "ఏంట్రా చాలా అలిసిపోయి నట్టు కనిపిస్తున్నావు? " అడిగాడు.

"ఏం లేదు. నిన్నంతా రెస్ట్ లేకుండా తిరిగా గదా? ఇంట్లో ఉంటే కాస్త నిద్ర పోయేవాడ్ని అంతే!" అన్నాడు పురు షోత్తం.

నర్సయ్య బైక్ మీద పురుషోత్తం అనం తారం బయల్దేరాడు.




**చి**లుమూరు నుంచి తెనాలి వెళ్లే దారి లోనే ఉంటుంది అనంతారం. పక్క ఊరే! పది నిముషాల ప్రయాణం. వీళ్లు సూర్య నారాయణ ఇంటికి వెళ్లే సరికి అతని బామ్మర్ది చంద్రయ్య ఎదురు వచ్చాడు.

"రండి! రండి!" అని ఇంట్లోకి తీసుకెళ్లి కూర్చోపెట్టాడు.

పురుషోత్తం ఇల్లంతా కలయజూశాడు. ఇల్లు బాగా పాతబడిపోయి ఉంది. ఎప్పుడో సున్నంతో కట్టింది.

సూర్యనారాయణ కూతురు దమయంతి ట్రేలో కాఫీ కప్పులు తెచ్చింది.

"మా చెల్లెలి కూతురు దమయంతి" అన్నాడు చంద్రయ్య.

"ఇప్పుడే తాగి వచ్చాం! ఇప్పుడెందు కమ్మా కాఫీ" అన్నాడు పురుషోత్తం.

"ఫరవాలేదు! తీసుకోండి మావయ్యా!" అంది దమయంతి వినయంగా.

చామనచాయతో ఎత్తుగా ఉంది. మంచి కళగల ముఖం.

"ఏం చదువుకున్నావమ్మా? " అడిగాడు పురుషోత్తం.

"ఇంటర్ పాసయ్యాను మావయ్యా!" అంది.

"డిగ్రీలో చేరలేదా? "

"చిలుమూరులో ఇంటర్ దాకా ఉంది కాబట్టి చదివింది. అది కూడా వాళ్ల

స్కాలర్‌షిప్పు ఇచ్చారు కాబట్టి. తెనాలి పోయి ఏం చదువుతుంది? అక్కడ ఫీజులు కట్టాలి, హాస్టల్లో ఉండాలి. అంత స్తోమత లేదుగా? " అన్నాడు చంద్రయ్య.

"డిగ్రీ నేను చదివిస్తాను. చదువు తావా? " అడిగాడు పురుషోత్తం.

దమయంతి తెల్లబోయి చూసింది పురు షోత్తంవైపు. ఏం జవాబు చెప్పాలో తోచ లేదు. తలవంచుకుని నిలబడింది.

"ఇప్పుడిక ఏం చదువుతుంది లెండి! ఇంటర్ అయిపోయి రెండేళ్లు దాటి పోయిందిగా! చదువుతో టచ్ పోయి ఉంటుంది. అదీగాక పెళ్లి కుదిరిందిగా!" అన్నాడు చంద్రయ్య.

లోపలి నుంచి సూర్యనారాయణ భార్య మాలతి వచ్చి "నమస్కారం అండీ" అని నిలుచుంది.

బోసిపోయిన మెడ, బొట్టులేని ముఖంతో దైన్యంగా నిలబడింది వారి ముందు.

"కూర్చోమ్మా!" అన్నాడు పురుషోత్తం.

సూర్యనారాయణ తాము చిన్నతనంలో చదువుకోవడం, అప్పటి అనుబంధం చెప్పాడు నర్సయ్య. ఆమె వింటూ అప్పుడ ప్పుడు భర్తని తల్చుకుని కన్నీళ్లు కారుస్తూ, తల ఊపుతోంది.

"నీకొక విషయం చెప్పాలమ్మా! చాలా కాలమైంది. సూర్యం దగ్గర కొంత డబ్బు తీసుకున్నాను. తర్వాత దుబాయ్ వెళ్లిపో యాను. అప్పట్లో నా ఉద్యోగంలో గొడ వలు అయ్యాయి. నన్ను సస్పెండ్ చేశారు. ఆర్నెల్లు జీతం రాలేదు. అది తెలిసి సూర్యం ఇంటి కొచ్చి డబ్బిచ్చాడు. నేనే ఇవ్వలేకపోయాను" అన్నాడు పురుషోత్తం.

మాలతి ఆశ్చర్యపోతూ చూసింది. చంద్రయ్యకి కూడా కొత్తసంగతే. తన బావ అప్పిచ్చాడంటే నమ్మలేనట్టు చూశాడు.

"వాడు ఎంత ఇచ్చాడు? ఇప్పుడు నేను ఎంత ఇస్తున్నాను. వివరాలు ఏం అడ గొద్దు.. సరేనా? " అంటూ నోట్ల కట్ట మాలతి చేతిలో ఉంచాడు పురుషోత్తం.

సరికొత్త నోట్లు కట్ట. అన్నీ వెయ్యి రూపాయలు. తళతళ మెరుస్తున్నాయి. అందులో గాంధీతాత బోసినోటితో నవ్వుతూ చూస్తున్నాడు. మాలతికి ఆనం దంతో కన్నీళ్లు జలజలరాలాయి. లేచి పురుషోత్తం కాళ్లను తాకింది.

"భలే దానవమ్మా! నేనేం చేశాను. వాడి బాకీ తీర్చాను. మీ అమ్మాయి పెళ్లికి పిల వండి. తప్పకుండా వస్తాను" అంటూ ఆమె తలమీద చెయ్యి ఉంచి అన్నాడు.

మాలతి కొంగుతో కళ్లు తుడుచుకుని "మీ రుణం తీర్చుకోలేమండీ!" అంది.

"రుణ పడింది నేను. ఇప్పుడా రుణం తీర్చుకున్నాను. వస్తానమ్మా!" అంటూ లేచాడు పురుషోత్తం.

ఇంతలో సూర్యం కూతురు దమయంతి లోపలి నుంచి వచ్చింది.

"దమయంతీ! మావయ్యకు దణ్ణం పెట్టు" అంది మాలతి.

దమయంతి వంగి పురుషోత్తం కాళ్లకు దణ్ణం పెట్టింది.

"చల్లగా ఉండు! నీ పెళ్లికి తప్పకుండా వస్తా! ఏం? " అంటూ ఆమె రెండు భుజాలు పట్టుకుని లేవదీశాడు.

దమయంతి తల ఊపింది.

పురుషోత్తం, నర్సయ్య బయల్దేరారు.

దమయంతి తల్లిచేతిలోని నోట్లకట్ట వైపు ఆసక్తిగా చూస్తోంది.

"మాలతీ! బావ ఆయనకు అప్పు ఎప్పు డిచ్చి ఉంటాడు? నీకేమైనా చెప్పాడా? " చెల్లెల్ని అడిగాడు చంద్రయ్య.

మాలతి పెదవి విరిచింది. "ఏమో! అన్నాయ్! నాకు తెలీదు. నాకెప్పుడూ చెప్పలేదు" ఆమెకు కూడా భర్త అప్పు ఇవ్వడం మీద సందేహం మొదలైంది. ఇంట్లో ఆర్థిక పరిస్థితి గురించి ఆమెకు

# గుప్పెడంత గుండెలో..




మానవ దేహంలోని గుండె గుప్పెడే అయినా, అది అత్యద్భుతమైన పరికరం. దాని శక్తిని తెలిపే కొన్ని విషయాలు.

★ ఒకరోజు గుండె పనిచేసే శక్తి, ఓ లారీ ఇరవై మైళ్ల ప్రయాణించే శక్తితో సమానం.

★ ఓ మనిషి జీవిత కాలంలో చంద్రుడి దగ్గరకి లారీలో వెళ్లి వచ్చేంత శక్తికి సమానం!



★ ఓ మనిషి జీవిత కాలంలో గుండె పంపు చేసే రక్తం రైల్లో రవాణా చేసే రెండొం దల ట్యాంకుల్లో నింపేంత! ఇది ఒకటిన్నరకో ట్ల బేరల్స్‌కి సమానం.

★ గర్భస్థ శిశువుకి నాలుగు వారాలు నిండాక గుండె పనిచేయడం ఆరం భిస్తుంది.

★ సోమవారం ఉదయం హార్ట్ అటాక్స్ అధికంగా జరుగుతుంటాయి.

★ సాధారణ గుండె వాల్వ్ రూపాయి నాణెం పరిమాణంలో ఉంటుంది.

★ గుండెని శరీరం నుంచి వేరుచే సినప్పటికీ ఆమ్లజని సరఫరా జరుగు తున్నంతసేపు దానికవసరమైన విద్యు త్‌ని గుండె తయారు చేస్తుంటుంది. ఇందువల్లే గుండె మార్పిడి సాధ్యం.

★ 1967 డిసెంబరు 3న డాక్టర్ క్రిస్టియన్ బర్నార్డ్ సౌత్ ఆఫ్రికాలో తొలి గుండెమార్పిడి చికిత్సని చేసి, కొత్త గుండెని లూయిస్ వహన్క్స్ అనే వ్యక్తికి అమర్చాడు.

★ మహిళ గుండె మగవాడి గుండె కన్నా వేగంగా కొట్టుకుంటుంది.

★ నవ్వడం వల్ల గుండె ద్వారా ప్రవహించే రక్తం 20 శాతం అధికమవుతుంది.

★ ఇటీవల స్వీడన్‌లో జరిగిన ఓ పరిశోధ నలో కలిసి పాడే వారి గుండెలు ఏకకాలంలో ఒకే విధంగా కొట్టుకుంటాయని తెలిసింది.

అన్నీ తెలుసు. ఎప్పుడైనా చీటీ పాడి తెచ్చి నప్పుడు తప్ప పదివేలు కళ్ల జూడడం అరుదు.

చంద్రయ్యకు కూడా అనుమానమే! "పోనీలే! సమయానికి ఇచ్చాడు" అన్నాడు.

నర్సయ్య ఇంటి ముందు బైక్ ఆపాడు. పురుషోత్తం దిగాడు. "పద కాఫీ తాగి వెళ్లవు గానీ" అన్నాడు పురుషోత్తం.

"లేదులే! వెళ్లాలి. ఔరా! నువ్వేంటి ఇబ్బందుల్లో ఉండి కూడా వాళ్లకి లక్ష రూపాయలు ఇచ్చావు? "

"వాళ్ల పరిస్థితికి జాలివేసింది రా!"

"సూర్యం నీకు ఎప్పుడో అప్పు ఇచ్చాడని కట్టుకథలు ఎందుకు చెప్తావు? నేను నమ్ముతాననుకున్నావా? వాడికి అంత స్తోమత ఏనాడూ లేదు" అన్నాడు నర్సయ్య.

"మంచి పనికి అబద్ధాలు చెప్తే మాత్రం తప్పేముంది? నేను ఊరికే డబ్బిస్తానంటే బాగుంటుందా? వాళ్లెందుకు తీసుకుం టారు? బీదవాళ్లయినా వాళ్లకీ ఆత్మాభి మానం ఉంటుంది. దాని మీద దెబ్బకొట్ట గూడదు" చెప్పాడు పురుషోత్తం.

"సరే! నేను వస్తాను. నువ్వు నాగార్జున

సాగర్ వెళ్తానన్నావుగా రేపు. తిరిగొచ్చాక కలుద్దాం" అన్నాడు నర్సయ్య.

తల ఊపాడు పురుషోత్తం. నర్సయ్య బైక్ స్టార్ట్ చేశాడు. "నేను సూర్యం ఇంట్లో డబ్బు ఇచ్చినట్టు ఎక్కడా అనకు" అని నవ్వాడు.

"నాకు తెలీదా ఏం? " అంటూ వెళ్లిపోయాడు నర్సయ్య.

★ ★ ★

సిల్వర్ కలర్‌లో మెరిసిపోతున్న కారు ఇంటి ముందు ఆగడంతో శేషమ్మ బైటకు వచ్చింది. "ఎవరిదబ్బాయ్ కారు? " అడిగింది కారు దిగిన డ్రైవర్ని.

"ట్రావెల్స్‌దండీ మామ్మగారూ! పురుషోత్తం సార్ నాలుగు రోజులకు బుక్ చేశారు. నాగార్జునసాగర్ వెళ్లి రావడానికి" చెప్పాడు డ్రైవర్.

"అద్దెకారా? "

"ఔనండీ!"

"రోజుకి అద్దె ఎంత? "

"రెండు వేలండి. పెట్రోలు పోయించాలండి. నాకు రోజుకి రెండొందలు బేటా ఇవ్వాలండి" మళ్లీమళ్లీ శేషమ్మ అడగబోయే ప్రశ్నలకు ఒక్కసారే సమాధానం చెప్పాడు.

శేషమ్మ మనసులోనే కారుకి అయ్యే ఖర్చు లెక్కేసింది. పదివేలు పైనే అవుతాయి అనుకుంది. అసలే ఇబ్బందుల్లో ఉన్నప్పుడు ఎందుకు ఇంత ఖర్చు అనుకుంది. అయితే కొడుకుతో అనలేదు బాధ పడతాడని.

పురుషోత్తం, చైతన్య, గీతిక కారు దగ్గరకి వచ్చారు. డ్రైవర్ లగేజి డిక్కీలో పెట్టాడు.

"సాగర్‌లో ఎక్కడ ఉంటార్రా మీరెళ్లి? అక్కడ మీకు ఇల్లు లేదుగా? " అడిగింది శేషమ్మ.

"అక్కడ విజయవిహార్ గెస్ట్‌హౌస్ ఉంది మామ్మా! నాన్న మాట్లాడాడు వాళ్లతో" చెప్పాడు చైతన్య.

"ఔన్లే! మీ నాన్న అక్కడ పనిచేశాడుగా ఇదివరకి. నాలుగైదు రోజులు ఊరికే ఉండనిస్తార్లే" అంది శేషమ్మ.

చైతన్య పకపకా నవ్వాడు, నాయనమ్మ మాటలు విని.

"ఎందుకురా నవ్వుతావు? " అంది మనవడిని విచిత్రంగా చూస్తూ.

"ఊరికే ఉండనియ్యరు మామ్మా! రోజుకి మూడువేలు కట్టాలి. భోజనాలకి వేరే ఇవ్వాలి" చెప్పాడు చైతన్య.

"ఆc-" అంది శేషమ్మ.

ఆమె లెక్క తప్పింది. పదివేలుపైన కాదు, ఖర్చు పాతిక వేలుపైన అని తెలింది.

"ఇప్పుడెందుకురా పెద్దోడా! అంత ఖర్చు పెట్టుకుని వెళ్లడం? " అంది శేషమ్మ, కొడుకుని మందలిస్తూ.

"నేనక్కడ పనిచేశా కదే! వీళ్లప్పుడు బాగా చిన్నపిల్లలు. ఊహ తెలీదు. నాగార్జునసాగర్ చూడాలని సరదాపడుతున్నారు. చూడాల్సిన ప్లేస్‌కదే! ఇక్కడేం తోచడం లేదని గొడవపెడుతున్నారు. నాలుగు రోజులు వెళ్లొస్తాం" చెప్పాడు పురుషోత్తం.

'హుc- పిల్లల సరదా కోసం పాతికవేలు తగలెయ్యాలా? ఉన్నప్పుడు ఎంత ఖర్చు పెట్టినా దిగుల్లేదు. వ్యాపారం దెబ్బతినీ, ఆదాయం లేనప్పుడూ వెనకట్లా ఖర్చులు పెట్టుకుంటూ పోతే ఎలా? ఉన్నప్పుడు ఉన్నట్టుండాలి. లేనప్పుడు లేనట్టు ఉండాలి. వీడికి ఆ లోకజ్ఞానం లేదు. పిచ్చోడు. పిల్ల పెళ్లెట్లా చేస్తాడో? ముందు ముందు ఎట్లా బతుకుతాడో? ' శేషమ్మ లోలోపల వాపోయింది.

పిల్లలు "బై.. నాయనమ్మా!" అని చేతులూపుతుంటే తనూ యాంత్రికంగా చేతిని పైకెత్తింది శేషమ్మ. కొడుకు భవిష్యత్తు అగమ్యగోచరంగా తోచింది ఆమెకు.

# మనసున ఉన్నదీ...

★ ఫిబ్రవరి 'చతుర'లో పాలంకి సత్య నవల 'మారీచ మార్గం' ఆసాంతం చదివాను. నాగన్న జీవితం నన్ను కలచివేసింది. భారతీయ మూలాలున్న మారిషస్‌ను 'మారీచ దేశం'గా లచ్చుమ్మ అభివర్ణించడం నవ్వు తెప్పించింది. నవల కథా కథనం చాలా బాగుంది. రచయిత్రికి అభినందనలు. చాలా ఏళ్ల తర్వాత మంచి నవల చదివానని అనిపించింది.

*– కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం*

★ చతుర జన్మదిన ప్రత్యేక సంచికలో పాలంకి సత్య నవల 'మారీచ మార్గం' ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. 19వ శతాబ్దం ఆరంభంలో బ్రిటిష్ పాలనలో భారతీయుల వెతలను కళ్లకు కట్టించింది. నాగన్న నేపథ్యంలో సాగిన ఈ నవలలో చెన్నపట్నం సంగతులు, మారిషస్ పర్యటన వివరాలు, ఉత్తరాల కథాకమామిషు ఉత్కంఠను రేకెత్తించేలా ఉన్నాయి. 'కొత్తగాలి' కవితలు ప్రశంసనీయం. 'అపశ్రుతులు' చతురకత బాగుంది. 'నవలావలోకనం'లో కొలిపాక రమామణి 'ఏటి ఒడ్డున నీటి పూలు' సమీక్ష వివరణాత్మకంగా ఉంది.

*– ముక్కెర రమేష్‌చంద్ర,*
*గుర్రంపేట, వరంగల్ జిల్లా*

★ జన్మదిన సంచిక అందమైన ముఖచిత్రంతో ఆకట్టుకుంది. 'కొత్తగాలి' కవితలు చతురకు అలంకారంగా ఉన్నాయి. 'ఏటి ఒడ్డున నీటి పూలు' నవల సమీక్ష నదీతీరానికి విహారానికి వెళ్లినంత హాయిగా అనిపించింది. 'భామనే సత్య భామనే' ఫీచర్స్ మహిళలను ఆకట్టుకున్నాయి. ఈశ్వరచంద్ర చతురోక్తులు చక్కని హాస్య స్ఫూర్తి కలిగి ఉన్నాయి. 'అపశ్రుతులు' చతురకత బాగుంది.

*– డాక్టర్ శివభూషణం, కర్నూలు*

★ పాలంకి సత్య నవల 'మారీచ మార్గం' విభిన్నమైన పతాక శీర్షికతో ఆరంభం నుంచి ముగింపు దాకా ఆసక్తిగా సాగింది. చక్కని నవలారాజం చదివామన్న తృప్తి కలిగింది. కొత్తగాలులన్నీ చక్కని స్పార్క్‌తో, భావార్థంతో ఆకట్టుకున్నాయి. బాక్సుల ద్వారా ప్రత్యేకంగా ప్రచురించడమే, 'కొత్తగాలి' రచయితలకు మీరిచ్చే నజరానా. ఈశ్వరచంద్ర చతురోక్తులు ఆహ్లాదాన్ని పంచాయి. 'భామనే.. సత్యభామనే..!' శీర్షికలో 'గుండె పదిలం!' అంటూ తెలియజేసిన విషయం బాగుంది.

*– నేమాన సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం*

★ 'మారీచ మార్గం' నవల నిజంగా మాకు చతుర జన్మదిన కానుక! దాదాపు రెండు శతాబ్దాల వెనక్కు తీసుకెళ్లి ఆనాటి సమాజం, మానవ సంబంధాలు, ఆత్మీయత, అనుబంధాలను కళ్లకు కట్టినట్లు చిత్రించిన విధానం ఆకట్టుకుంది. రచయిత్రికి అభినందనలు!

*– కొర్రపాటి అంకమ్మ,*
పూనూరు గ్రామం, ప్రకాశం జిల్లా

★ పాలంకి సత్య నవల 'మారీచ మార్గం' ఆసక్తిగా సాగింది. మారిషస్‌లో తెలుగువారు అధికమని తెలిసినా వారు అక్కడికి ఎలా వెళ్లారో, ఎంతటి ఇబ్బందిని ఎదుర్కొన్నారో నవల ద్వారా తెలుసుకుని ఆశ్చర్యపోయాం. భారతీయులు ఏ పరిస్థితుల్లో అక్కడికి వలస వెళ్లారో రచయిత్రి చక్కగా విశదీకరించారు.

*– గానుగపెంట నరసింహులు,*
బద్వేలు, కడపజిల్లా

★ 'మారీచ మార్గం' తెల్లదొరల కుయుక్తులకు అద్దం పట్టింది. పనికోసం మారిషస్ వెళ్లిన భారతీయులను అక్కడే ఆపేందుకు బ్రిటిష్‌వారు వేసిన ఎత్తులను ఆసక్తికరంగా నవలీకరించిన పాలంకికి ధన్యవాదాలు. ఈశ్వరచంద్రగారి చతురోక్తులు ఆకట్టుకున్నాయి.

*– భాగ్యశ్రీ రాజేష్*, పాన్గల్

★ దాదాపు రెండు శతాబ్దాల క్రితం భారతదేశంలో నెలకొన్న పరిస్థితులకు, పాశ్చాత్యులు మనదేశాన్ని దోచుకున్న తీరుకు దర్పణం 'మారీచ మార్గం'. రచయిత్రి పాలంకి సత్య అభినందనీయురాలు.

*– మోహన్ లింగబత్తుల, హైదరాబాద్*

కారు గుంటూరు చేరేటప్పటికి ఒంటి గంట కావస్తోంది. "చైతూ! మనం ఇక్కడ లంచ్ చేసేద్దాం" అన్నాడు పురుషోత్తం. బ్రాడీపేటలో శంకర్‌విలాస్ హోటల్ ముందు వీళ్లు కారు దిగుతుంటే ఉపేంద్ర కనిపించాడు.

"బావా! ఎక్కడికి ప్రయాణం?" అడిగాడు ఉపేంద్ర.

"నాగార్జునసాగర్ వెళ్తున్నాం. పిల్లలు సైట్ సీయింగ్‌కి వెళ్దామంటే బయల్దేరాం" చెప్పాడు పురుషోత్తం.

"నాకు ఫోన్ చేస్తే భోజనాలు ఇంట్లో అరేంజ్ చేసేవాడినిగా? హోటల్లో ఏం బాగుంటుంది?" అన్నాడు ఉపేంద్ర.

"బాగో! ఓగో! అప్పుడప్పుడూ బైట రుచులు కూడా టేస్ట్ చేయాలి. అయినా ఇక్కడ ఆగాలని అనుకోలేదు. ముందు ముందు మంచి రెస్టారెంట్లు ఉన్నాయో? లేదో? అని ఇక్కడే చేద్దాం అనుకున్నాం"

ఉపేంద్ర కాసేపు మాట్లాడి పని ఉందంటూ వెళ్లిపోయాడు. పిల్లలు ముందుగానే రెస్టారెంట్‌లోకి వెళ్లారు.

లంచ్ చేశాక బయల్దేరారు.

"చైతూ! నీకు సాగర్లో ఉన్నప్పటి సంగతులు ఏవైనా గుర్తున్నాయా?" కొడుకుని అడిగాడు పురుషోత్తం.

"మన ఇంట్లో మామిడి, నిమ్మ చెట్లున్నాయి. మమ్మీ గులాబీ, కనకాంబరం, మల్లె మొక్కలు పెంచేది. వాటికి హోస్ పైపుతో నీళ్లు పోస్తుండేది. ఇంటి ముందు ములక్కాయల చెట్టుండేది. మనింటికి గేటు కూడా ఉంది. నేను కాన్వెంట్ స్కూల్‌కి వెళ్లడం గుర్తుంది డాడీ! ఇంకా బాలవిహార్లో ఎవరి పెళ్లిళ్లకో భోజనాలకు వెళ్లేవాళ్లం" చెప్పాడు చైతన్య.

"నీకప్పుడు పదేళ్లుకూడా లేవు. ఏం గుర్తుంటాయిలే" అన్నాడు పురుషోత్తం.

"డాడీ! నేను కూడా సాగర్‌లో ఉన్నానా?" గీతిక ప్రశ్నించింది.

"ఎందుకు లేవూ? నువ్వింకా చిన్నపిల్లవు. ఐదేళ్లున్నాయోమో?" అన్నాడు.

"నాకే సరిగా గుర్తులేదు. నీకేం ఉంటాయి?" అన్నాడు చైతన్య చెల్లెలితో.

"చైతూ! నీకు అరుణా ఆంటీ గుర్తుందా? హనుమంతరావు అంకుల్? మనింటికి అప్పుడప్పుడు వస్తుండేవాళ్లు. మనం ఉన్న లైన్‌లోనే ఉండేవాళ్లు" అన్నాడు పురుషోత్తం.

చైతన్య గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

"హనుమంతరావు అంకుల్! నాతోపాటే జేఈగా పనిచేశాడు. ఎండాకాలం కెనాల్స్‌లో రిపేర్లు చేస్తుండేవాళ్లు. హనుమంతరావు కెనాల్లోకి దిగి పనిచేయిస్తుండగా పై నుంచి బండరాయి మీద పడింది. పాపం అక్కడికక్కడే చనిపోయాడు. ఇద్దరు పిల్లలు వాడికి. అరుణ ఆంటీ హస్బెండ్ అతను" అప్పటి సంగతులు చెప్పాడు పురుషోత్తం.

సాయంకాలానికి కారు నాగార్జున సాగర్ చేరింది. హిల్‌కాలనీలో రిజర్వాయర్ ఒడ్డున మహారాజసౌధంలా ఉంది విజయవిహార్ గెస్ట్‌హౌస్. చైతన్య, గీతిక కారు దిగి చుట్టూ చూశారు. కొండల మధ్య లోతుగా, సముద్రంలా కనిపిస్తున్నాయి నీళ్లు. దూరంగా చిన్న బొమ్మలా సాగర్ డ్యామ్. విజయవిహార్ ముందు పచ్చటి లాన్ తివాచీలా అందంగా ఉంది. చల్లటి గాలి వీస్తోంది రిజర్వాయర్ మీద నుంచి.

చైతన్యకు చిన్నప్పటి జ్ఞాపకాలు ముసురుకుంటున్నాయి. విజయవిహార్ ఆవరణలో ఫెన్సింగ్ లోపల లేళ్లు ఉండేవి. మొసళ్లు మరొక చోట. లాన్‌లో ఆడుకున్న ఆటలు గుర్తుకొస్తున్నాయి. అక్కడ్నుంచి తను చదువుకున్న కాన్వెంట్ స్కూల్ కనిపిస్తోంది. అప్పటి పిల్లలు ఇప్పుడు ఎక్కడున్నారో? లీలగా వారి ముఖాలు కళ్ల



ముందు కనిపిస్తున్నాయి.

"ఫ్రెష్ అయిన తర్వాత అరుణా ఆంటీ ఇంటికి వెళ్దాం." అన్నాడు పురుషోత్తం.

రూమ్‌లోకి వెళ్లిన తర్వాత గీతిక స్నానం చెయ్యడానికి బాత్‌రూమ్‌లోకి వెళ్లింది.

"ఇప్పుడు నేను చెప్పే విషయాలు చెల్లెలికి చెప్పకు. హనుమంతరావు చనిపోయినప్పుడు వాళ్ల ఆర్థిక పరిస్థితి ఏమీ బాగా లేదు. అరుణ పుట్టింటి వాళ్లు పట్టించుకో

లేదు. హనుమంతరావుకి అన్నదమ్ములు లేరు. అతని తల్లిదండ్రులు కూడా ఉన్న వాళ్లు కాదు. పల్లెటూళ్లో ఉండేవాళ్లు. రెండె కరాల పొలం ఉండేది తుమ్మపూడిలో. అది సాగుచేసుకుని బతుకుతుండేవాళ్లు. దినం అయిపోయిన తరువాత ఎటువా ళ్లటు వెళ్లిపోయారు. పాపం అరుణకు దిక్కుతోచలేదు. అప్పటికి హనుమంత రావు సంపాదించింది ఏం లేదు. వాడికి పేకాట వ్యసనం ఉండేది. నెల జీతం కోసం ఎదురుచూస్తుండే వాడు. జి.పి.ఎ ఫ్.లో కూడా డబ్బులేదు. డబ్బు లేక పోగా అప్పులుండేవి. అరుణ మన ఇంటికి వచ్చి ఏడ్చింది.

"అన్నయ్యా! నాకేం చేయాలో తోచడం లేదు. నాకు ఎవ్వరూ లేరు సాయం చేసే వాళ్లు. నువ్వే దిక్కు" అంది.

మీ అమ్మ కూడా కదిలిపోయింది. అరుణ పరిస్థితికి కళ్లనీళ్లు పెట్టుకుంది.

"ఇద్దరు పిల్లల్తో పాపం ఎట్లా బతుకు తుంది? ఏదొకదారి చూడండి. హనుమం తరావు ఉద్యోగం అరుణకు ఇస్తారేమో విచారించండి" అంది.

హనుమంతరావు ఇంజనీర్. అరుణ ఇంటర్ తప్పింది. ఉద్యోగం ఇప్పించా లంటే జూనియర్ అసిస్టెంట్ క్వాలిఫికే షన్ కూడా లేదు. అప్పట్లో 'శ్రీహరి' అని డిప్యూటీ చీఫ్ ఇంజనీర్ ఉండేవాడు. క్లబ్బులో నాతోపాటు షటిల్ ఆడేవాడు. బాగా పరిచయం ఉంది. అరుణ పరిస్థితి గురించి చెప్పాను. ఆయన ఆఫీసుకెళ్లాక ఎస్టాబ్లిష్‌మెంట్ సూపరింటెండెంట్‌ని పిలిచి అడిగాడు 'అరుణకు మనం ఏం చేయగలం?' అని.

"ఇంజనీర్ భార్యకు మరీ అటెండర్ జాబ్ ఇవ్వడం బాగుండదు సార్! రికార్డు అసిస్టెంట్ పోస్ట్ ఖాళీ ఉంది. అందులో అపాయింట్ చేద్దాం" అన్నాడు.

అరుణకు చెప్తే ఆ ఉద్యోగం చేస్తానంది. ఆ ఉద్యోగానికి ముందు బోలెడంత తతంగం. తాశీల్దారు దగ్గర లీగల్ హెయిర్ సర్టిఫికెట్ కోసం తిరగాలి. మళ్లీ మెడికల్ సర్టిఫికెట్ వగైరా. అప్పుల వాళ్లు ఇంటి చుట్టూ తిరగడం. నేనే అప్పులన్నీ చెల్లించాను. తర్వాత హనుమంతరావుకి ఆఫీసు నుంచి కొంత డబ్బు వస్తే, అరుణ తిరిగి ఇచ్చిందనుకో. రెండు నెలలు పైనే పట్టింది ఉద్యోగం వచ్చేసరికి.

రికార్డు అసిస్టెంట్ ఎన్నాళ్లు పనిచేసినా ఎదుగూబొదుగూ ఏం ఉండదు. అందు కని అరుణతో ఓపెన్ యూనివర్శిటీలో డిగ్రీ చదవడానికి ప్రోత్సహించాను. మొత్తానికి బి.ఎ. పాసైంది. ఆఫీసులో జూనియర్ అసిస్టెంట్‌గా ప్రమోషన్ ఇచ్చారు. అప్పుడు చాలా సంతోష పడింది. నాకు, మీ అమ్మకు కొత్తబట్టలు పెట్టి, పళ్లు, స్వీట్లు తెచ్చి ఇచ్చింది.

"నువ్వు నాకు దేవుడివి అన్నయ్యా! నీ రుణం తీర్చుకోలేను" అంది.

"డాడీ! ఆంటీ ఇంకా జాబ్‌చేస్తోందా?" అడిగాడు చైతన్య.

"ఆc. చేస్తోంది. ఇప్పుడు ఆమె ఆఫీసు సూపరింటెండెంట్ అయింది. ఇద్దరు పిల్లలూ బాగా చదివారు. పెద్దోడు నాగా ర్జున డాక్టర్. రెండోవాడు జగపతిరావు ఇంజనీర్. హేపీగా ఉన్నార్లే"

"ఇప్పుడు మనం వాళ్లింటికి వెళ్తున్నామా డాడీ?"

"ఊరికే వెళ్లడం కాదు. గీతికను వాళ్ల అబ్బాయిల్లో ఒకడికి చేసుకోమని అడుగు తాను. అరుణ ఫేవర్‌గా మాట్లాడితే అప్పుడు గీతికకు చెబుదాం. అంతవరకు నువ్వేం చెప్పకు. ఏం?" అన్నాడు పురు షోత్తం.

"అరుణ ఆంటీ కష్టాల్లో ఉన్నప్పుడు హెల్ప్ చేశావుగా! గీతికను వాళ్లబ్బాయికి చేసుకోవడానికి తప్పక ఒప్పుకుంటుంది డా డీ! హెల్ప్ చేసిన వాళ్లని మర్చిపోరుగా!"

అన్నాడు చైతన్య.

పురుషోత్తం నవ్వాడు.

"కాంతిమతి అత్తయ్య కష్టాల్లో ఉన్నప్పుడు ఆదుకున్నాం. చిలుమూరు వచ్చి సంవత్సరాల తరబడి బియ్యం, పప్పులు మూటలు కట్టి తీసుకెళ్లి సంసారం గడిపింది. ఉపేంద్ర మావయ్య దివాలా ఎత్తితే, మా నాన్న ఒప్పుకోక పోయినా పొలం అమ్మించి డబ్బు ఇప్పించాను. లారీ కొన్నప్పుడు ఫైనాన్సర్ దగ్గర షూరిటీ సంతకం చేశాను. మరి వాళ్లు చేసిన హెల్ప్ గుర్తుంచుకున్నారా? గీతికను ఇస్తానంటే, పాతిక లక్షలు కట్నం ఇస్తామని సంబంధాలు వస్తున్నాయని నిర్మొహమాటంగా అంది గదా? నీకు ఏం అర్థమైంది? "

"మనం పాతిక లక్షలు ఇస్తే సంబంధం ఒప్పుకుంటామని" అన్నాడు చైతన్య.

"అదే చెప్తున్నా! మార్క్స్ చెప్పిన గోల్డెన్ వర్డ్స్ మరొకసారి గుర్తు చేస్తున్నా! మానవ సంబంధాలు ఆర్థిక సంబంధాలతో ముడి పడి ఉంటాయి" అన్నాడు పురుషోత్తం.

'మానవ సంబంధాలు అర్థం చేసుకోమని డాడీ తనకు పదేపదే బ్రెయిన్ వాష్ ఎందుకు చేస్తున్నాడు?' అని ఆలోచనలో పడ్డాడు చైతన్య.

దీపిక స్నానం చేసి డ్రెస్ మార్చుకుని వచ్చింది. తర్వాత పురుషోత్తం, చైతన్య ఫ్రెష్ అయ్యారు. రెస్టారెంట్ కెళ్లి కాఫీ తాగి బయల్దేరారు అరుణ క్వార్టర్‌కి.

ఇంటి ముందు కారు ఆగగానే అరుణ బైటకు వచ్చింది. గబగబా వచ్చి గేటు తీసింది.

"రండి అన్నయ్యా! మీ కోసమే ఎదురు చూస్తున్నా!" అంది సంతోషపడిపోతూ.

"బాగున్నావా అరుణా? " పలకరించాడు పురుషోత్తం.

"ఆఁ..! బాగున్నా! అన్నయ్యా!" అని పిల్లలు ఇద్దర్నీ ఎగాదిగా చూసింది.

"ఏరా చైతన్యా గుర్తున్నానా? దీపిక బాగా పొడుగైంది. అచ్చం వదినలాగే ఉంది" అంది.

చైతన్య నవ్వాడు. దీపిక ఆమెను పరీక్షగా చూస్తోంది.

నాగార్జున, జగపతిరావు వరండాలో నిల్చున్నారు. అరుణ కొడుకుల్ని పరిచయం చేసింది.

"అంకుల్! మీరు గుర్తున్నారు!" అని ఇద్దరూ చెప్పారు.

హాల్లో కూర్చున్నాక అరుణ ట్రేలో

## ఫిబ్రవరి - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **వారణాసి విజయలక్ష్మి**
   - పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా
2. **ఎ. రామకృష్ణ**
   - హెచ్.ఎ.ఎల్. కాలనీ, జీడిమెట్ల
3. **పి. చంద్రిక**
   - గాంధీచౌక్, ఖమ్మం
4. **నిమ్మల భరత్ చంద్ర**
   - హన్మకొండ, వరంగల్ జిల్లా
5. **ఎస్.ఎస్. భీమరాజు**
   - కొత్త అగ్రహారం, విజయనగరం

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. పుల్లమ్మ | 6. మారిషస్ గవర్నర్ |
| 2. రామయ్య | 7. నాగలాపల్లె కరణం |
| 3. మారిషస్ | 8. ఫ్రెంచివారి |
| 4. హర్షవర్థన్ | 9. నాగప్ప |
| 5. మల్లమ్మ | 10. కలిపాక రమామణి |

స్వీట్స్, బూందీ ఉన్న ప్లేట్లు పెట్టుకుని వచ్చింది.

"ఇప్పుడు . ఎందుకమ్మా ఇవన్నీ?" అన్నాడు పురుషోత్తం.

"ఫరవాలేదు తీసుకోండి అన్నయ్యా! చైతూ, దీపికా సిగ్గుపడకండి! నేను మీ అత్తయ్యని తెలుసా? మీరు దుబాయ్ వెళ్లిపోయారు గనుక దూరం అయ్యాం" అంది అరుణ.

"ఇప్పుడు దగ్గరయ్యాంగా!" అన్నాడు పురుషోత్తం నవ్వుతూ.

"ఔను అన్నయ్యా! పాతవాళ్లని చూసినప్పుడంతా నాకు చాలా సంతోషంగా ఉంటుంది. మా పిల్లలు కూడా 'హైదరాబాద్‌లో వాళ్లు కనిపించారు.. వీళ్లు కనిపించారు.. మీరు సాగర్ వాళ్లు గదా! అని పలకరించారు..' అని చెప్పి మురిసిపోతుంటారు" అంది అరుణ.

పురుషోత్తం నాగార్జున, జగపతిరావులతో వాళ్లేం ఉద్యోగాలు చేస్తున్నారో, జీతం ఎంత? అనీ అడుగుతున్నాడు. దీపికను అరుణ లోపలకు తీసుకెళ్లింది. చైతన్య వాళ్ల సంభాషణ వింటూ కూర్చున్నాడు.

రాత్రి డిన్నర్ అయ్యాక "ఏవమ్మా అరుణా! ఇంకా ఎన్నేళ్లుంది సర్వీసు?" అడిగాడు పురుషోత్తం.

"ఇంకా ఎనిమిదేళ్లుంది అన్నయ్యా!" అంది.

"కొడుకులిద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంకెందుకు? హైదరాబాద్ వెళ్లిపో" అన్నాడు.

"చూద్దాం అన్నయ్యా! అక్కడికెళ్లినా నాకేం తోస్తుంది. కేంప్ ఆఫీసులో ఖాళీ వస్తే ట్రాన్స్‌ఫర్ అవుదాం అనుకుంటున్నా"

"అదే మంచిదమ్మా!"

"ఇంకేంటి అన్నయ్యా సంగతులు?"

"ఏముందమ్మా ఇక్కడ నన్ను గిట్టని వాళ్లు అల్లరి చేసి సస్పెండ్ చేయించారుగా! కేసులేవీ నిలవలేదు. నాకు మళ్లీ పోస్టింగ్ ఇచ్చారు. నాకే ఉద్యోగం చేయ బుద్ధి కాలేదు. అందుకే రిజైన్ చేసి దుబాయ్ కంపెనీలో చేరిపోయా!"

"ఔను అన్నయ్యా! సిన్సియర్‌గా పనిచేసేవాళ్లని ఉండనీయరు డిపార్టుమెంట్‌లో. ఇప్పుడు మరీ ఘోరం. రాజకీయ నాయకులు పీక్కుతింటున్నారు, కంట్రాక్టర్లని.. ఇంజనీర్లని. మంచి పనిచేశావు"

"అక్కడ కూడా కొన్నేళ్లకి జాబ్ మానేసి సొంతంగా కంపెనీ పెట్టా. పార్టనర్లతో బాగానే సంపాదించా! కానీ కష్టాలు ఒంటరిగా రావంటారు. మీ వదిన పోయింది. కంపెనీ నష్టాల్లో మునిగింది. సంపాదించింది అంతా పోయింది. కట్టుబట్టలతో ఇండియా వచ్చేశాం అనుకో" చెప్పాడు పురుషోత్తం.

"వదిన పోయిందని తెలిసి చాలా బాధపడ్డాను అన్నయ్యా!" అంది అరుణ.

కాసేపు కూర్చున్నాక "ఇక వెళ్లొస్తాం అరుణా! రేపు లాంచీలో నాగార్జున కొండ చూపించాలి పిల్లలకి" అన్నాడు.

"రేపు లంచ్‌కి రండి అన్నయ్యా!" అంది అరుణ.

"కుదరదులే! ఎందుకంటే కొండ నుంచి తిరిగి వచ్చేటప్పటికే దాదాపు రెండు అవుతుంది. రైట్ బ్యాంక్‌లోనే భోజనం చేసి ఎత్తిపోతల చూట్టానికి పోతాం"

"సరే! రాత్రికైనా రండి"

"చూద్దాంలే! నేను ఫోన్ చేస్తాగా!" అన్నాడు పురుషోత్తం.

అందరి దగ్గరా సెలవు తీసుకుని కారెక్కారు. కారు విజయవిహార్ వైపుకి బయల్దేరింది.

మర్నాడు ఉదయం తొమ్మిదిన్నరకి విజయపురి సౌత్ లాంచి స్టేషన్‌కి చేరుకున్నారు. నాగార్జున కొండలో మ్యూజియం చూసి తిరిగి వచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. హోటల్లో లంచ్ చేసి ఎత్తి

పోతల జలపాతం దగ్గరికి వెళ్ళి, అక్కడ ఫొటోలు దిగి సాయంకాలం విజయవి హార్ గెస్ట్‌హౌస్‌కి వచ్చారు.

ఆ మర్నాడు ఉదయం పురుషోత్తం హిల్ కాలనీలో ఆఫీసులకి వెళ్ళి పాత పరి చయస్తులను పలకరించి వారితో కాలం గడిపాడు. పవర్‌హౌస్‌కి పిల్లల్ని తీసుకెళ్లి నీళ్ళ నుంచి కరెంట్ ఎట్లా జనరేట్ అవు తుందో చూపించాడు.

ఇక ఆ రాత్రి రెస్ట్ తీసుకున్నారు. ఉద యమే బయల్దేరాలని అనుకున్నారు. విజ యవిహార్ లాంజ్‌లో కూర్చుని వుంది గీతిక. పురుషోత్తం కొడుక్కి సైగ చేశాడు బైటకు రమ్మని. లాన్‌లో కూర్చున్నాక చెప్పాడు

"అరుణ ఆంటీతో మాట్లాడతా! విను" అన్నాడు. స్పీకర్ ఆన్ చేశాడు.

"హలో! అరుణా? "

"అన్నయ్యా! మళ్లీ రాలేదేం? నువ్వు ఫోన్ చేస్తావని చూశాను"

"కుదర్లేదమ్మా! అటూ ఇటూ తిరుగు తున్నాం. రేపు ఉదయం బయల్దేరు తున్నాం. నీకు చెప్పాలని కాల్ చేశాను"

"రేపు లంచ్‌కి ఇంటికి రండి అందరూ!"

"వద్దులేమ్మా! చాలా దూరం కదా! లేట వుతుంది. తెనాలి నుంచి మళ్లీ చిలు మూరు వెళ్ళాలి. చీకటి పడితే కష్టం. రోడ్డు కూడా సరిగాలేదు. అయినా మీ ఇంటికి వచ్చాం కదా? "

"సరే! అన్నయ్యా!"

"అరుణా! మా గీతికను చూశావుగా ఎలా వుంది? "

"దానికేం అన్నయ్యా! అన్నపూర్ణ వదిన లాగే వుంది. పాత సినిమాలో జమునలా ముద్దుగా వుంది"

"నీకు నచ్చింది కదా! గీతిక పెళ్లి చేద్దాం అనుకుంటున్నాం. నీ కోడల్ని చేసుకో రాదూ!"

"నాకు నచ్చింది సరే! ఈకాలం పిల్లలకి చెప్పలేం. పెద్దాడు తనతో పనిచేస్తున్న డాక్టరమ్మను చేసుకుంటాననంటున్నాడు. చిన్నాడు గవర్నమెంట్ జాబ్ చేస్తున్నాడు. వాడు కూడా నీకులా చాలా సిన్సియర్ అన్నయ్యా! రాజకీయనాయకుల్తో పడలేక పోతున్నాననీ జాబ్ మానేసి సొంతంగా ఒక కంపెనీ పెట్టాలనీ ఆశపడుతున్నాడు. 'ఏభైలక్షలైనా కట్నం వచ్చే సంబంధం వుంటే చూడమ్మా!' అంటున్నాడు. నేనేం చెయ్యాలి అన్నయ్యా! మీరు అంత కట్నం ఇచ్చేట్లు లేరుగా? "

"ఔనమ్మా! ఏదో గీతికకు వాళ్ల అమ్మ ఇచ్చిన బంగారం కొంత వుంది. పెళ్లి ఘనంగా చేస్తాం కానీ అంత కట్నం ఇవ్వ లేను"

"సారీ అన్నయ్యా! ఏమి అనుకోకు! ఒక ప్పుడు నాకు ఎంతో సహాయం చేశావు. అందరికీ చెప్తుంటాను, పురుషోత్తం అన్నయ్య లేకపోతే నేనేమైపోయేదాన్నో అని. ఇప్పుడు నేను నీకేం చెయ్యలేకపోతు న్నాను. చాలా బాధగా వుంది"

"నువ్వేం ఫీలవ్వకు అరుణా! నీ చేతిలో ఏం లేదుగా! పిల్లలు హేపీగా వుండడం ముఖ్యం. వాళ్ళకి ఇష్టమైనట్టు చేసుకో నివ్వు. ఇక వుంటా"

పురుషోత్తం కాల్ కట్‌చేశాడు. చైతన్య వైపు తిరిగి చూశాడు. వాడేం మాట్లాడ లేదు.

"నువ్వేమనుకున్నావు? అంత హెల్ప్ చేసిన నాకు ఏదైనా చేస్తుందన్నావు కదూ! చూశావుగా అరుణ ఏం మాట్లాడిందో. ఏభై లక్షలు కట్నం డిమాండ్ చేస్తోంది" అన్నాడు పురుషోత్తం.

"ఏంటో డాడీ! ఎవర్ని నమ్మాలో తెలి యడం లేదు" నిట్టూరుస్తూ అన్నాడు చైతన్య.

"గుర్తుంచుకో! బంధువులు, మిత్రులు ఎవర్నైనా గానీ నమ్మకు. కేవలం నమ్మి నట్టు నటించు. అందరూ మనలా వుంటా

రని అనుకోకు"

తల వూపాడు చైతన్య. అతనికి ఏదో జ్ఞానోదయం కలుగుతున్నట్టుగా అను భూతి కలుగుతోంది. సమయం వస్తేగానీ మనుషుల నిజరూపాలు బైట పడవని అర్థమవుతోంది.

"నీకు ఒక సంగతి చెప్పలేదు. గుంటూర్లో ఒక ఫ్రెండ్ కనపడి చెప్పాడు. గుంటూర్లో ఒక కార్పొరేటర్ కూతుర్ని పెళ్ళిచూపులు చూడ్డానికి వచ్చిందట అరుణ, చిన్న కొడుకుని తీసుకుని. వాళ్ళు ఏభైలక్షలు ఇవ్వడానికి సిద్ధపడ్డారట. అయితే కొడుకు చేసుకోనని అడ్డు తిరిగా డట. ఎందుకంటే ఆ పిల్ల బాగా లేదట. పెద్ద కొడుక్కి రెండు కోట్లు ఇచ్చే సంబంధం కుదిరిందని చెప్పిందట. చూశావా! ఇవన్నీ మనకు చెప్పలేదు. దాన్నిబట్టి అర్థం చేసుకో" అన్నాడు పురు షోత్తం.

చైతన్య తల పట్టుకున్నాడు.

"గీతిక పెళ్ళి సరేగానీ నాకు బోర్ కొడు తోంది. మనం హైదరాబాద్ వెళ్ళిపోదాం. మెయిల్ చెక్ చేసుకోవాలి. చాలా కంపె నీలకు రెస్యూమ్ పంపాను. ఏదో ఒక కంపెనీలో చేరిపోతాను. చిలుమూరులో వుండడం నా వల్ల కాదు" అన్నాడు.

పురుషోత్తం నవ్వి "సర్లేరా! వెళదాం. ఇ ల్లు కాస్త బాగు చేయిద్దాం. మరీ పాతబ డింది. ఎప్పుడో తాతలనాడు సున్నంతో క ట్టారు. బాగు చేయించకపోతే ఏ తుఫాను కో పడిపోతుంది" అన్నాడు.

"ఇప్పుడా ఇంటికి రిపేర్లు అవీ ఎందుకు డాడీ? నాయనమ్మ ఒక్కతే గదా! మనతో రమ్మను హైదరాబాద్‌కి. ఒక్కతే ఎందుకు అక్కడ? ఆ బర్రెలు, చాకిరీ అవసరమా? ఇరవై నాలుగు గంటలు ఏదొక పనిచే స్తూనే వుంటుంది. తిరుగుతూనే వుంటుంది. ఏ అర్థరాత్రో కాస్త పడుకుం టుంది. అప్పుడైనా నిద్రపోతుందో? లేదో? "

"మా అమ్మ సంగతి నీకు తెలీదు. ఎన భై ఏళ్ళు దాటినా అంత ఆరోగ్యంగా ఎందుకు వుందనుకున్నావు? వర్క్‌కల్చర్! పనికి అలవాటు పడినవాళ్ళు ఖాళీగా కూర్చోలేరు. అదీగాక మా అమ్మ ఎవరిం ట్లోను వుండదు. బాబాయిల ఇళ్ళల్లో ఎందుకు వుండడం లేదనుకున్నావు?

"ఒంటరిగా ఎన్నాళ్ళు వుంటుంది? మూలన పడితే ఏం చేస్తుంది? "

"ఇప్పుడప్పుడే అమ్మకు ఏంకాదు. నాకు తెలిసి మా అమ్మ ఏనాడూ జ్వరం అని పడుకుని వుండడం చూళ్ళేదు తెలుసా! వందేళ్ళుపైనే బతుకుతుంది. అమ్మ కళ్ల ముందు నేనేపోతాను" అన్నాడు పురు షోత్తం.

తండ్రి మాటలకు కరవరపడ్డాడు చైతన్య.

"అదంతేరా! సుఖానికి అలవాటు పడ్డ శరీరాలకు లాంగ్‌లైఫ్ వుండదు" అన్నాడు పురుషోత్తం తాత్త్విక ధోరణిలో.




**పు**రుషోత్తం నాగార్జునసాగర్ వెళ్ళి తిరిగి వచ్చిన, ఈ నాలుగు రోజుల్లో చిలు మూరులో అనూహ్య సంఘటనలు జరి గాయి.

ఆ రోజు పురుషోత్తం అటు వెళ్ళగానే నర్సయ్య శేషమ్మ దగ్గరికి ఒక పెద్దమని షిని తీసుకొచ్చాడు. ఆయన పేరు రవీంద్ర

నాథ్. తెనాలి నుంచి వచ్చాడు. చిలుమూరులో రెసిడెన్షియల్ డిగ్రీ కాలేజీ ఏర్పాటు చేయాలనే సంకల్పంతో వచ్చాడు. ఊరి చివర కావాలంటే ఎకరం స్థలమైనా దొరుకుతుంది గానీ, వూరిమధ్య దొరకదు. కాలేజీ వూరి చివరవున్నా హాస్టల్‌కి వూళ్లో కావాలని తిరుగుతున్నాడు. పురుషోత్తం వాళ్లది ఇరవై సెంట్ల స్థలం, అందుకు సరిపోతుందని నర్సయ్య రవీంద్రనాథ్‌కి చెప్పాడు. పురుషోత్తం కూతురు పెళ్లికి ఇల్లు అమ్మేయాలని శేషమ్మ అనడం గుర్తుంది. అందుకే రవీంద్రనాథ్‌ని శేషమ్మ దగ్గరికి తీసుకొచ్చాడు నర్సయ్య.

"పెద్దమ్మా! ఈయన రవీంద్రనాథ్‌గారు, తెనాలి నుంచి వచ్చారు. మన ఇల్లు కొనడానికి ఆసక్తిగా వున్నారు. ఊరి చివర డిగ్రీ కాలేజీ కట్టాలనుకుంటున్నారు. హాస్టల్ బిల్డింగ్ వూరి మధ్య బాగుంటుందని అనుకుంటున్నారు" అన్నాడు

రవీంద్రనాథ్ "నమస్కారం శేషమ్మగారూ! కృష్ణారావుగారు వున్నప్పుడు కొన్నిసార్లు మీ ఊరు వచ్చాను ఎలక్షన్లప్పుడు, మా బావ కోసం. ఆయన పరిచయమే" అన్నాడు

శేషమ్మ ఆయన్ని ఇంట్లో కూర్చోబెట్టి కాఫీ ఇచ్చింది. రవీంద్రనాథ్ లావుగా, ఖద్దరు బట్టల్లో హుందాగా వున్నాడు. ఖరీదైన కారులో వచ్చాడు. ఆయన బాగా ధనవంతుడేనన్న విషయం శేషమ్మ గ్రహించింది.

"పెద్దమ్మా! ఇప్పుడు సెంటు రెండు లక్షలకు కొనడానికి రెడీగా వున్నాడు. మామూలుగా అయితే ఇంత పెద్దస్థలం మనూళ్ళో కొనేవాళ్ళెవరూ లేరు. అమ్మదల్చుకుంటే బేరం ఆడదాం. ఇంకొంచెం ఎక్కువైనా వెనక్కిపోడు" పక్కకి పిలిచి శేషమ్మకి చెప్పాడు నర్సయ్య.

శేషమ్మ మనసులో లెక్కవేసుకుంది. దాదాపు నలభై లక్షలపైనే వస్తాయి. పిల్ల పెళ్ళి దర్జాగా చెయ్యొచ్చు అనుకుంది.

"మా పెద్దబ్బాయి పురుషోత్తం వూరెళ్ళాడండీ! నాలుగు రోజుల్లో తిరిగొస్తాడు. వచ్చిన తర్వాత మీకు కబురు పంపుతాను" అంది శేషమ్మ.

రవీంద్రనాథ్ ఇంటి లోపల, బైట ఖాళీ స్థలమంతా చూసి తృప్తిపడి వెళ్లాడు.

ఆ సమయంలోనే లక్ష్మణరావు భార్య రేణుక అటుగా వచ్చింది. ఇంటి ముందు కారు వుండడం చూసి ఎవరొచ్చారో? చూడ్డానికి కుతూహలంతో లోపలకు వచ్చింది. ఆ సమయంలో శేషమ్మ రవీంద్రనాథ్‌తో మాట్లాడుతోంది. నర్సయ్య కూడా అక్కడే వున్నాడు. ఆమెకు ఇల్లు అమ్మకానికి పెట్టారని అర్థమైంది.

తర్వాత తోడికోడలు శుభలక్ష్మి దగ్గరికి వెళ్ళింది. "అక్కా! మన పాతిల్లు అమ్మకానికి పెట్టింది అత్తయ్య" చెప్పింది.

"ఎవరు చెప్పారు నీకు?" అడిగింది శుభలక్ష్మి.

"ఎవరో చెప్పడం కాదు. నేను అంతా విన్నాను" అంటూ తెనాలి నుంచి ఒక పెద్దమనిషి వచ్చాడనీ, నర్సయ్య ద్వారా బేరం జరుగుతోందనీ తను చూసింది, విన్నదీ అంతా వివరంగా చెప్పింది.

"ఆ డబ్బుతో పెద్ద మనవరాలి పెళ్ళి చేస్తుందట. ఆ పెద్దమనిషితో అంది. అమ్ముకునే అవసరం లేదండీ మాకు, కాకపోతే మా పెద్దోడి కూతురి పెళ్ళికి డబ్బు అవసరమైంది. అందుకే అమ్మాలనుకుంటున్నాం అంది" చెప్పింది రేణుక.

"అమ్మితే ఎంత వస్తుందనుకుంటున్నారు?"

"ఇప్పుడు ఇక్కడ సెంటు రెండులక్షలుంది. ఇరవై సెంట్ల ఇల్లు. నలభై లక్షలు వస్తుంది"

"అంతా మనవరాలి పెళ్ళికే ఇస్తుందా? అందులో మనకీ భాగం రావాలి గదా? మనకీ ఆడపిల్లలున్నారు. వాళ్ళకి పెళ్ళిళ్ళు

చెయ్యొద్దా? "

"అట్లా ఎందుకు ఒప్పుకుంటాం? ఇంట్లో మనకీ భాగం వుంది. తాతల నాటి ఇల్లు. ఎవరో ఒకరు సంపాదించిందీ కాదు, స్వార్జితం కాదు"

"డబ్బున్నప్పుడు కన్నూమిన్నూ కనపడ కుండా ఖర్చుపెట్టుకున్నారు. దుబాయ్‌లో దివాలా ఎత్తి వచ్చారు. అందుకు మనకేం బాధ్యత? గంతకు తగ్గ బొంతని, ఏదో చిన్న సంబంధం చూసి పిల్లపెళ్ళి చేయా లిగానీ డాక్టర్లు, ఇంజనీర్లు కావాలంటే ఎట్టా? "

"ఎవరి ఖర్మ వాళ్ళు అనుభవిస్తారు"

తోడి కోడళ్ళు ఇద్దరూ మాట్లాడుకుంటు న్నారు. ఇంతలో మన్మథరావు ఇంట్లోకి వచ్చాడు. శుభలక్ష్మి ఇల్లు అమ్ముతున్న సంగతి చెప్పింది. అతను ఆశ్చర్యపో యాడు. తల్లిమీద, అన్నమీద కోపం వచ్చింది. 'ఇల్లు అమ్మాలనుకుంటుంటే తనతో ఒకమాట అనవచ్చుగా? అంతా వాళ్ళిష్టమేనా? ' అనుకున్నాడు.

"ఏవయ్యా! నీకేమైనా చెప్పిందా మీ అమ్మ? " అడిగింది శుభలక్ష్మి.

"నాతో చెప్పలేదు" అన్నాడు మన్మథ రావు.

"పోనీ మీ తమ్ముడితోనైనా చెప్పిందా? "

"ఏమో? "

రేణుక లక్ష్మణరావుని వెంటనే రమ్మని ఫోన్ చేసింది. అతను హడావుడిగా వచ్చాడు. విషయం తెలుసుకున్నాడు.

"అమ్మ! నాతో కూడా అనలేదు అన్నాయ్!" అన్నాడు లక్ష్మణరావు.

"మీరిట్టా నోర్మూసుకుని వూరుకుంటే మీ అమ్మ డబ్బంతా పెద్దాయన చేతిలో పోస్తుంది. ఆయన కూతురు పెళ్ళిచేసి చేతులు దులుపుకుంటాడు"

"మనకీ ఆడపిల్లలున్నారు. ఇంట్లో మన భాగం డబ్బు ఇవ్వాలని చెప్పండి. అమ్మ యినా అడగందే ఇస్తుందా? " తోడి కోడళ్ళు మొగుళ్ళని ఎక్కేశారు.

అన్నదమ్ములు ఆలోచనలో పడ్డారు. పురుషోత్తం తన భాగం పొలం, చెరొక ఎకరం రాసిచ్చాడు. ఇప్పుడు ఇంట్లో భాగం అడిగితే, ఆ పొలం తిరిగి ఇవ్వమని అడు గుతాడేమో? అని సందేహంలో పడ్డారు. ఒకవేళ పొలం తిరిగి ఇవ్వమని అడిగితే, ఉమ్మడి ఖర్చుతో లక్షలు ఇస్తేగానీ ఆయన ఇంజనీరింగ్ పూర్తవలేదు అని జవాబు చెప్పాలని నిర్ణయించుకున్నారు.

"ఇప్పుడే వెళ్ళి మీ అమ్మను అడగండి" అన్నారు ఇద్దరూ.

"అన్నాయ్ ఇప్పుడు వూరెళ్ళాడు. తిరిగి గొచ్చాక వెళ్ళి అడుగుదాంలే" అన్నాడు మన్మథరావు.

శుభలక్ష్మి మొగుడి మీద విరుచుకుప డింది.

"నీకసలు మెడమీద తలకాయలేదు. మీరెందుకు మీ అన్నను అడుగుతారు? మీ అమ్మను అడగండి. ఆవిడే పెద్దకొడు కుతో చెప్తుంది. ఆయన వూర్నించి వచ్చే దాకా ఆగడం ఎందుకు? "

"వదిన చెప్పింది నిజమే అన్నాయ్! అమ్మనే అడుగుదాం" అన్నాడు లక్ష్మణ రావు.

ఇద్దరూ కలిసి శేషమ్మ దగ్గరికి వెళ్ళారు.

"అమ్మా! ఇల్లు అమ్ముదామనుకుంటు న్నారా? " అడిగారు.

"అప్పుడే మీకు ముట్టించిందా? చిన్నది చెప్పిందన్న మాట! నేను అనుకున్నాలే" అంది శేషమ్మ.

"ముట్టించడం ఏంటే? అదిక్కడ వున్న ప్పుడే మాటలు జరుగుతున్నయంట గదా? అంత రహస్యం ఎందుకు? " కోపంగా అన్నాడు లక్ష్మణరావు. తన భార్యను అన్నందుకు అతనికి కోపం వచ్చింది.

"రహస్యం ఏందిరా? ఇల్లమ్ముదామను కుంటున్నది నిజమేరా!"

"మాతో ఒకమాట అనొచ్చుగా?"

"అనటానికేం వుంది. మాటవరసకి నర్స య్యతో అన్నాను. పెద్దోడి కూతురు పెళ్ళికి డబ్బు కావాలని. వాడు అనుకోకుండా బేరం తెచ్చాడు" అంది శేషమ్మ.

"డబ్బంతా అన్నాయ్ కూతురికే ఇస్తారా? మాకూ ఆడపిల్లలు వున్నారు. వాళ్ళకి పెళ్ళిళ్ళు పేరంటాలు చెయ్యాలి"

"ఇంట్లో మాకు మాత్రం భాగం లేదా? తాతలనాటి ఇల్లు. ఎవరి స్వార్జితం కాదు. అందరికీ హక్కుంది"

కొడుకుల మాటలు విని షాక్ తిన్నట్ట యింది శేషమ్మ. ఇప్పటివరకు కొడుకులు ఇంత పరుషంగా మాట్లాడింది లేదు. డబ్బు దగ్గరికి వచ్చేసరికి నోటి కొచ్చినట్టు వాగుతున్నారు. పెద్దోడు తనకు వచ్చిన రెండెకరాలు పొలం వద్దన్నాడు. ఇద్దరు తమ్ముళ్ళకు చెరొక ఎకరం రాసిచ్చాడు. దుబాయ్ నుంచి వచ్చినప్పుడల్లా ఎన్నో వస్తువులు తెచ్చి బహుమతులుగా ఇచ్చే వాడు. తమ్ముళ్ళ పిల్లల్ని కారులో తిప్పే వాడు. డబ్బు మంచి నీళ్ళలా ఖర్చుపెట్టే వాడు వున్నన్నిరోజులు. అవన్నీ మర్చిపో యారు వెధవలు. వాడిప్పుడు బతికి చెడి వచ్చాడనీ, డబ్బులేని వాడయ్యాడనీ చిన్నచూపు చూస్తున్నారు. విశ్వాసం లేని మనుషులు. పెళ్ళాలు ఎక్కేసి వుంటారు. వీళ్ళు అడగడానికి వచ్చారు. శేషమ్మ మనసు క్షోభిస్తోంది.

"మీకు భాగం లేదని ఎవరన్నారు? ఉంటే వుంది. అయితే మాత్రం అన్నయ్య పరిస్థితి ఏమిటని ఆలోచిస్తున్నారా? వ్యాపారం దెబ్బతిని చేతిలో డబ్బులేకుండా దిక్కుతోచకుండా వున్నాడు. పిల్ల పెళ్ళిచేసి పంపితే, కొడుకు ఎట్లాగో బతుకుతాడు. ఈ సమయంలో అన్నదమ్ములు మీరు ఏదైనా సహాయం చేయాలి గానీ, భాగాల కోసం పోట్లాడ్డానికి వస్తారా?" అరుస్తూ గట్టిగా అంది శేషమ్మ. కోపంతో ఆమె ముఖం ఎర్రబారింది.

## ఆర్కే లక్ష్మణ్ చతురోక్తులు



**ఇటీవల మనల్ని వీడి వెళ్లిన కార్టూనిస్టు ఆర్.కె. లక్ష్మణ్ ప్రపంచం గర్వించదగ్గ సుప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారుడు. వివిధ సందర్భాలలో ఆయన పేల్చిన చతురోక్తుల బాణాలు మీకోసం..**

### *ఎందుకంత ఇష్టం?*

ఒకసారి ఓ ఇంటర్వ్యూలో ఆర్.కె. లక్ష్మ ణ్‌ను 'మీకిష్టమైన రాజకీయ నాయకుడెవరు?' అని అడిగారు. దానికాయన స్పందిస్తూ 'మొరార్జీ అంటే నాకిష్టం. ఎందుకంటే ఒక కార్టూనిస్టుకు కావాల్సిన ముడిసరకును ఆయన చాలా సులువుగా అందిస్తాడు. ఆయన మహా రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు - ప్రజలు మద్యం తాగకూడదు, చుట్ట కాల్చకూడదు. పెందరాళే పడుకోవాలి-లాంటి హాస్యభరితమైన మాటలెన్నో చెప్పాడు. పైపెచ్చు రాష్ట్రంలో మ ద్యంపై నిషేధం విధించాడు. ఆయనకు ఒక్క మద్యమేమిటి, మంచినీళ్లన్నా పడదు. ఎందు కంటే ఆయనకు తనేం తాగాలనేదాని గురించి ఓ స్పష్టమైన వైఖరి ఉంది' అని అన్నారు.

మొరార్జీ దేశాయ్ స్వమూత్రపానం గురించి బహుశా తెలియని వారెవరూ ఉండరు. అందు వల్లనే ఆర్.కె. లక్ష్మణ్ అలా హాస్యంగా అన్నారు.

"ఉన్నప్పుడు వున్నట్టుండాలి! లేనప్పుడు లేనట్టుండాలి! ఇప్పుడు ఏదో పెద్ద సంబంధం చూసి పిల్ల పెళ్ళి చేయాలా? ఇంజనీర్లు, ఆఫీసర్లు కావాలంటే ఎట్లా? ఏదైనా చిన్నసంబంధం చూసుకోవాలి. ఇల్లమ్మిన డబ్బంతా ఒక్క పెళ్ళికే ఖర్చుపె డతారా?"

"అమ్మా! నువ్వేమైనా అనుకో! ఇల్లమ్మిన డబ్బులో మాకూ భాగం ఇవ్వాల్సిందే! మాకు డబ్బు అవసరం వుండదా? ముందు ముందు పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యమా?"

తల్లిని నిలదీశారు అన్నదమ్ములు.

"భాగం భాగం అంటున్నారేంట్రా త్రాష్టుల్లారా? పెద్దోడి భాగానికొచ్చిన పొలం మీకు రాసివ్వలేదా? ముప్పై ఏళ్ళనుంచి పొలం మీద వచ్చే పంట తినడం లేదా? అప్పుడు మీరెందుకు ఆ పొలం వద్దనలేదు. అప్పనంగా వస్తోందని సంబరపడిపోతూ రాయించుకున్నారే. అదంతా మర్చిపోయారంటరా? విశ్వాసం లేని మనుషులురా మీరు? అన్న మీద ఏ మాత్రం అభిమానం లేదు మీకు. పెళ్ళాల మాటలు విని నా మీదకు పోట్లాడానికి వచ్చారా? " అంటూ శేషమ్మ కొడుకుల మీద విరుచుకు పడింది.

## కొత్తగాలి...

**వికృతమైన గొంగళిపురుగు**
**సీతాకోక చిలుక కావడం**
**- ప్రకృతి**
**అందమైన మనిషి**
**దానవుడుగా మారడం - వికృతి**

– కె. నాగేశ్వరరావు, విజయవాడ

"ఆ పొలం మేం ఇవ్వమని అడిగామా? ఆయనంతట ఆయనే ఇచ్చాడు. ఊరికినే ఇచ్చాడనుకుంటున్నావా? మేమంటే టెన్త్ క్లాస్‌తో చదువు మానేశాం. అదీ వూళ్ళోనే చదువుకున్నాం, ఏ మాత్రం ఖర్చులేకుండా! అన్నాయ్ లక్షలు ఖర్చుపెట్టి ఇంజనీర్ అయ్యాడు. దాంతోనేగా కోట్లు సంపాదించాడు. వ్యాపారంలో పోగొట్టుకుంటే మేమేం చేస్తాం? ఎవరి ఖర్మ వాళ్ళది"

"ఉమ్మడి ఖర్చుతో చదువుకున్నాడు కాబట్టే, పొలం వదులుకున్నాడు. అర్థమైందా? ఇల్లమ్మిన డబ్బులో భాగం ఇవ్వకపోతే మేం మాత్రం సంతకాలు పెట్టం. తర్వాత మీ ఇష్టం" మన్మథరావు, లక్ష్మణరావు తల్లికి వార్నింగ్ ఇచ్చివెళ్ళారు.

శేషమ్మకి ఎక్కడిలేని నీరసం ముంచుకొచ్చి మంచంమీద అడ్డంగా పడిపోయింది. కళ్ళు తిరుగుతున్నట్టయింది. వంట్లో శక్తి హరించుకుపోయినట్టు, రక్తం నీళ్ళయిపోయినట్టు అనిపించింది.

కొడుకుల ప్రవర్తన జీర్ణం కావడం లేదు. తన కొడుకులు అందరిలాంటి వాళ్ళు కాదనీ, రామలక్ష్మణుల్లా అన్యోన్యంగా వుంటారనీ భ్రమపడింది. ఊళ్ళో కొన్ని కుటుంబాల్లో అన్నదమ్ములు ఆస్తుల కోసం కొట్లాడుకోవడం, కోర్టులకెక్కడం విని తను ఎంతో అదృష్టవంతురాలు అనుకుంది. కానీ ఆస్తుల విషయంలో తన కొడుకులు అందరిలాంటి వాళ్ళేననీ, వాళ్ళవీ అల్పబుద్ధులేననీ ఇప్పుడు తెలిసొచ్చింది.

ఇన్నాళ్ళూ ఆమెకు ఇల్లు అమ్మి పెద్దమనవరాలి పెళ్ళికి ఆదుకోగలననే ధైర్యంతో వుండేది. ఇప్పుడా ధైర్యం, నమ్మకం సడలిపోతున్నాయి.

తెల్లవారకుండానే చలపతి క్యాన్ యిచ్చి శేషమ్మ ఇంటికి పాలకోసం పంపిస్తాడు. ఎన్నో ఏళ్ళనుంచి శేషమ్మ దగ్గరే పాలు కొంటాడు చలపతి. అతను తెనాలిలో హోటల్ నడుపుతాడు. శేషమ్మ పాలలో నీళ్ళు కలపదు. నెలకొకసారి డబ్బులు యిచ్చినా తీసుకుంటుంది. అదీ అతని వెసులుబాట.

చలపతి పంపిన కుర్రాడు శేషమ్మ ఇంటి దగ్గరికి వచ్చాడు గానీ ప్రహరీ గోడ తలుపు తెరిచిలేదు. తలుపు కొట్టాడుగానీ ఎంతకీ తలుపు తెరుచుకోలేదు. వాడు పోయి చలపతికి చెప్పాడు. అతనికి ఏదో అనుమానం వచ్చింది. శేషమ్మకి ఎనభై ఏళ్ళు దాటాయి. ఏదైనా అనారోగ్యం కలిగిందేమోనని తానే స్వయంగా ఇంటికి వచ్చాడు. ఎంత బాదినా తలుపులు తెరుచుకోలేదు. శేషమ్మకి ఏదో అయిందని గ్రహించి మన్మథరావు ఇంటికి వెళ్ళి

చెప్పాడు. అతను తమ్ముడు లక్ష్మణరావుకి ఫోన్ చేసి రమ్మన్నాడు. ఇద్దరూ ఇంటికి వెళ్ళి గోడ దూకి లోపలకు వెళ్ళారు. వరండాలోనే పడుకుని వుంది శేషమ్మ. తలుపులు ఎంత బాదినా లేవకపోవడానికి కారణం ఆమె స్పృహలో లేదు.

అన్నదమ్ములిద్దరికీ గిల్టీఫీలింగ్ కలిగింది. ఇల్లు అమ్మడం గురించి తల్లితో ఘర్షణ పడినందున ఏదైనా అఘాయిత్యం చేసుకుందేమోనని భయం కలిగింది. ఆటోలో తెనాలి తీసుకెళ్ళి నర్సింగ్‌హోమ్‌లో చేర్చారు.

"భయపడాల్సింది ఏం లేదులే. బీపీ ఎక్కువైంది. మందులు వాడుతూ వుండాలి. బీపీ కంట్రోల్‌కి రెండు రోజులు అబ్జర్వేషన్లో వుండనీయండి" అన్నాడు డాక్టరు.

అన్నదమ్ములిద్దరూ తేలిగ్గా వూపిరి పీల్చుకున్నారు.

ఉదయం పదింటికి పురుషోత్తంకి ఫోన్ చేశారు. తల్లిని తెనాలిలో మానస నర్సింగ్ హోమ్‌లో చేర్పించామనీ, బీపీ ఎక్కువై తెలివి తప్పిపడిపోయిందని డాక్టర్ చెప్పాడని చెప్పారు. అప్పుడు పురుషోత్తం నాగార్జునసాగర్ నుంచి తిరుగుప్రయాణంలో వున్నాడు. అతను ఆందోళన చెందాడు. 'ఉక్కు ముక్కలా తిరుగుతూ వుండే తల్లికి అనారోగ్యం కలగడం ఏమిటి? సడన్‌గా బీపీ ఎందుకు రెయిజై వుంటుంది? ఆమెకు వర్రీ అవ్వాల్సిన విషయాలేం వున్నాయి?' అనుకున్నాడు. తల్లి తన కూతురు పెళ్ళి గురించి ఆందోళన చెందుతూ వున్న విషయం అతను వూహించలేదు.

★ ★ ★

శేషమ్మను ఇంటికి తీసుకొచ్చారు. మందులు వాడుతూ మామూలుగానే తిరగసాగింది.

తల్లి ఏమీ చెప్పకపోయినా నర్సయ్య ద్వారా అన్ని విషయాలు పురుషోత్తంకి తెలిశాయి.

"నీకు బుద్ధిలేదురా! అమ్మ ఇల్లు అమ్ము తానని అంటే మాత్రం నాకు తెలియకుండా బేరం తీసుకురావడం ఏమిటి? దీనివల్ల తమ్ముళ్ళతో లేనిపోని ఘర్షణ పడింది. అందుకే అమ్మకి బీపీ పెరిగింది. ఇప్పుడు నాకు అంతా అర్థమైంది" అన్నాడు పురుషోత్తం నర్సయ్యని చీవాట్లు పెడుతూ.

"నీతో మాట మాత్రంగా అనలేదని నాకేం తెలుసురా! మీరిద్దరూ మాట్లాడుకొనే ఇల్లు అమ్మడానికి నిర్ణయించుకున్నారని అనుకున్నాను" అన్నాడు నర్సయ్య.

"సర్లే! ముందు ఆ రవీంద్రనాథ్‌కి ఫోన్ చేసి చెప్పు ఇల్లు అమ్మే ప్రపోజల్ ఏమీలేదని" అన్నాడు పురుషోత్తం చిరాకుపడుతూ.

"అదేంటి? అయితే ఇల్లు అమ్మరా?"

"ఇల్లు అమ్మే ప్రసక్తిలేదు. మా అమ్మ, నేను వున్నంత కాలం ఇల్లు అమ్మం" గట్టిగా చెప్పాడు పురుషోత్తం.

"నాకంతా అయోమయంగా వుంది. మీ అమ్మకేమో నీ కూతురు పెళ్ళిచేయాలని దిగులు. నీకేమో చీమకుట్టినట్టు లేదు"

"నా కూతురు పెళ్ళికి ఈ ఇంటికి లింకు పెట్టకు"

"మరెట్టారా! నువ్వేమో ఇబ్బందుల్లో వున్నావు. పిల్లపెళ్ళి ఎట్లా చేస్తావని మీ అమ్మ దిగులుపడుతోంది"

"నా తిప్పలు ఏవోపడతాలేరా! అమ్మ అనవసరంగా వర్రీ పడుతోంది" అన్నాడు పురుషోత్తం.

నర్సయ్యకి చీవాట్లు పెట్టినట్టు తల్లిని కూడా మందలించాడు పురుషోత్తం.

"అమ్మా! నువ్వు లేనిపోని అనుమానాలు మనసులో పెట్టుకోకు. నా వ్యాపారం దెబ్బతిని తిరిగి వచ్చినంత మాత్రన పిల్ల పెళ్ళిచేయలేనని ఎందుకు

అనుకుంటావు? దాని పెళ్ళికి ఇల్లు అమ్మాల్సిన అవసరం లేదు. పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకు."

తల్లితో ఇంటి గురించి ఘర్షణ పడిన సంగతి తమ్ముళ్ళని ఏమీ అడగలేదు పురుషోత్తం.

శేషమ్మ మాత్రం పురుషోత్తం ఇంట్లో లేనప్పుడు బాబాయిలు ఎలా మారిపోయిందీ వివరంగా చెప్పింది చైతన్యకు. తన తండ్రి ఆర్థికంగా నష్టపోయి దుబాయ్ నుంచి తిరిగి వచ్చేశాడని సొంత బాబాయిలు కూడా చిన్నచూపు చూస్తున్నారని అర్థమైంది వాడికి.

బేల్ దారీ మేస్త్రీ సీతారామయ్యని ఇంటికి పిలిపించాడు పురుషోత్తం. చిలుమూరులో ఎవరు ఇల్లు కట్టుకోవాలన్నా అతన్నే పిలిచి పనులు అప్పగిస్తారు. నమ్మకంగా అనుకున్న సమయానికి ఇల్లు కట్టించి ఇస్తాడనీ, మోసం చెయ్యని మనిషనీ పేరుంది. సీతారామయ్య ఇల్లంతా పరిశీలన చూశాడు.

"దూలాలు చేవ కలిగిన టేకు. గట్టిగానే వున్నాయి. సున్నం రాల్చి సిమెంట్ చేస్తే గోడలు స్ట్రాంగ్‌గానే వుంటాయి. పెంకులు కొత్తవి పేరిస్తే సరిపోతుంది. పెయింట్ లేయిస్తే ఇక కొత్త ఇల్లు మాదిరిగానే వుంటుంది" అన్నాడు సీతారామయ్య.

"మంచిరోజు చూసి పని మొదలు పెట్టండి" అన్నాడు పురుషోత్తం.

"ఎల్లుండే మంచిరోజు. కూలీలు కూడా రెడీగా వున్నారు. వాళ్లకీ ఇప్పుడు పనులేమీ లేవు" అన్నాడు సీతారామయ్య.

"మొత్తం ఎన్నిరోజులు పడుతుంది?"

"ముందు గోడలకు సున్నం రాలగొట్టాలి. ఆ స్థానంలో సిమెంట్ పుయ్యాలి. తర్వాత పెంకులు తీసేసి కొత్తవి పేర్పించాలి. పదిహేను రోజులు పడుతుంది"

"సరే! సిమెంట్, పెయింట్, పెంకులు ఎంతకావాలో రాసిస్తే రేపే తెనాలి నుంచి తెప్పిస్తాను. ఎల్లుండి పని మొదలు పెట్టండి" చెప్పాడు పురుషోత్తం.

సీతారామయ్యకి అడ్వాన్సు ఇచ్చాడు. అతను సంతోషించి వెళ్ళిపోయాడు.

రెండు రోజులు తర్వాత ఇంటికి రిపేర్లు ప్రారంభమయ్యాయి. ఊళ్ళోవాళ్ళు పురుషోత్తం కూతురికి పెళ్ళి చేయబోతున్నాడనీ, అందుకే రిపేర్లు చేయిస్తున్నాడనీ వూహించుకున్నారు. మన్మథరావు, లక్ష్మణరావులకు కూడా తెలిసింది. అంతా ఆశ్చర్యపోయారు. ఇల్లు అమ్ముతామని ఇప్పుడు రిపేర్లు మొదలు పెట్టడం ఏమిటీ వాళ్లకి అర్థం కాలేదు.

"అవతల పిల్ల పెళ్లి పెట్టుకుని ఇంటిని బాగు చేయించడం ఎందుకురా? నేను పోయాక ఎవరుంటారు దీంట్లో?" అని గొణిగింది శేషమ్మ.

"అమ్మా! మన ఇల్లంత పెద్దది ఈ వూళ్లోనే లేదు. తుఫాన్లు వచ్చినప్పుడు పూరిళ్లలో వుండే వాళ్లంతా మన ఇంట్లోనే చేరేవాళ్ళు బైట తుఫాన్‌తో వూరంతా గజగజ వణుకుతూ వుంటే మనింట్లో పండగ జరుపుకుంటున్నట్టు వుండేది. ఆడాళ్ళంతా కూరగాయలు కోస్తూ, బియ్యం ఏరుతూ, పొయ్యి దగ్గర కూర్చుని వంటలు వండుతూ సంతోషంగా గడిపేవాళ్ళు. 'తుఫాన్ ఎన్ని రోజులుంటే ఏంటి? మునుసుబుగారిల్లు వుండగా!' అని భరోసాతో ఉండేవాళ్లు. ఇప్పుడు చాలా మంది పక్కా ఇళ్ళు కట్టుకున్నా, ఇంకా పూరిళ్లువున్నాయి. మనం ఇల్లు ఎవరికో అమ్మేస్తే పడగొట్టి బిల్డింగులు కడతారు. మన పాత జ్ఞాపకాలు చెరిగిపోతాయి. నువ్వు, నేను వున్నంత కాలం ఇల్లు అమ్మేది లేదమ్మా!" చెప్పాడు పురుషోత్తం.

"బాగుందిరా! మా తాతలు నేతులు తాగారు. మా మూతులు వాసన చూడండి అన్నట్టు చెప్తున్నావు. నీ దగ్గర డబ్బులేదు. ఉన్న కాస్త డబ్బు వూళ్లు తిర

యలు చేద్దాం. ఇక్కడ వూళ్లో మనకు బలగం ఉంది, అన్నివిధాలా సహాయం వుంటుంది. అంత దూరం శవాన్ని తీసుకెళ్లటం ప్రయాస" అన్నాడు.

పిల్లలు కూడా "అంత దూరం తీసెకెళ్లడం ఎందుకులే డాడీ! తాతయ్యా వాళ్ల వూళ్లో చేద్దాంలే!" అన్నారు. అప్పుడిక తను 'సరే' అన్నాడు.

చిలుమూరి నుంచి తల్లి, తమ్ముళ్లు, మరదళ్లు వచ్చారు. పెద్దకర్మ ఇక్కడే చేశాడు.

అప్పుడు అన్నపూర్ణ దగ్గర వున్న బంగారం దాదాపు ఏభై తులాలు మామగారికి ఇచ్చాడు. "మీ దగ్గరే వుంచండి! గీతిక పెళ్లి అప్పుడు తీసుకుంటాను" అన్నాడు.

పల్నాటి రామయ్య దగ్గర అన్నపూర్ణ తాలూకు బంగారం అలా వుండిపోయింది.

ఇంటికి పెయింట్ వేయిస్తుంటే నర్సయ్య వచ్చాడు. "ఏంటోరా నీ ధైర్యం? ఆడపిల్ల పెళ్లి బాధ్యత నెత్తిన పెట్టుకుని డబ్బు తగలేస్తున్నావు ఇంటికి. ఇల్లు బాగుచేయిస్తే రేటెక్కువ వస్తుందనుకుంటున్నావేమో? అదంతా వట్టిమాట! ఇల్లు ఎవడు కొన్నా పడేసి కొత్త బిల్డింగు కట్టుకుంటాడు" అన్నాడు.

"ఇల్లు అమ్మడం లేదంటే నీ గొడవేంట్రా? " విసుక్కున్నాడు పురుషోత్తం.

"మరి పెళ్లికెక్కడ డబ్బు తెస్తావు? "

"మా ఆవిడ బంగారం మా మావ దగ్గర ఉందిరా! గీతిక దగ్గర కూడా కొంత బంగారం వుంది. ఏదో అడ్జెస్ట్ చేస్తాలే"

"మీ మామ పోయినట్టున్నాడుగా? "

"మామ పోతే ఏం? మా బామ్మర్ది వున్నాడుగా? "

"ఎందుకైనా మంచిది వెళ్ళి బంగారం తెచ్చుకో" అని సలహా ఇచ్చాడు నర్సయ్య.

"అవసరమైనప్పుడు తెస్తాలే ఎక్కడికి పోతుంది? " అన్నాడు పురుషోత్తం.

పైకి అలా అన్నాడు గానీ నర్సయ్య 'ఎందుకైనా మంచిది..' అనగానే సందేహం మొదలైంది మనసులో. బాలకృష్ణ దగ్గరున్న బంగారం వెంటనే తెచ్చుకోవాలి అనుకున్నాడు. అసలే రోజులు తనకు అనుకూలంగా లేవు. కాలం కలిసి రాకపోతే తాడే పామై కరుస్తుందంటారు.

అన్నయ్య ఇల్లు బాగు చేయిస్తున్నాడని తెలిసినా మన్మథరావు, లక్ష్మణరావు అటు వైపు తొంగి చూడలేదు. వారం రోజులు బింకంగా వున్నారు. ఫోను కూడా చెయ్యలేదు. పురుషోత్తం ఏమైనా ఫోన్ చేస్తాడేమో? తల్లి కబురు పంపుతుందేమో అని ఎదురు చూశారు. వాళ్లనుకున్నట్టు జరగలేదు.

ఒకరోజు పొద్దున్నే వచ్చాడు మన్మథరావు. అతని వెంట ఒక కుర్రాడు వున్నాడు. పొడుగ్గా సినిమాల్లో రమణారెడ్డిలా వున్నాడు. పాతికేళ్లపైనే వుంటాయి.

"పొలంలో కోతలు అన్నయ్యా! అందుకే ఇటువైపు రాలేదు" అని వస్తూనే సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

పురుషోత్తం నవ్వి వూరుకున్నాడు.

"మా బామ్మర్ది వెంకట శివుడు" అని పరిచయం చేశాడు.

వెంకట శివుడు పురుషోత్తంని విష్ చేశాడు.

"ఏం చేస్తున్నావు? " అడిగాడు పురుషోత్తం.

"గుంటూరు కలెక్టర్ ఆఫీసులో ఉద్యోగం వస్తుంది" అన్నాడు వెంకట శివుడు.

"ఉద్యోగం వస్తుందా? "

"అన్నయ్యా! వీళ్ల నాన్న కలెక్టర్ ఆఫీసులో పనిచేస్తూ చనిపోయాడుగా, ఆ ఉద్యోగం వీడికి వస్తుంది" మన్మథరావు చెప్పాడు.

తర్వాత లోపలకు వెళ్లి, తల్లిని పలకరించాడు.

గడానికి, ఇంటికి రిపేర్లు చేయిస్తూ ఖర్చు పెడుతున్నావు. పిల్ల పెళ్లి గురించి ఏమైనా ఆలోచిస్తున్నావా?" అడిగింది శేషమ్మ కొడుకుని మందలిస్తూ.

"పిల్ల పెళ్లి గురించి దిగులు పడకే. వాళ్ల మేనమామ దగ్గర బంగారం ఉంది" అన్నాడు పురుషోత్తం.

ఇక శేషమ్మ మాట్లాడలేదు. 'కొడుకేం తెలివి తక్కువ వాడు కాదు. వాడికి మాత్రం పిల్ల పెళ్లి చేయాల్సిన బాధ్యత లేదా? తనెందుకు దిగులు పడాలి? ఏదో ఏర్పాటు చేసే వుంటాడు' అనుకుని ధైర్యం తెచ్చుకుంది.

పురుషోత్తంకి గతం గుర్తొచ్చింది. ఒక రోజు రాత్రి అన్నపూర్ణ వూపిరి అందక ఆయాస పడింది. అప్పుడు వాళ్లు దుబాయ్‌లో ఉన్నారు. హాస్పిటల్‌కి తీసుకెళ్లాడు. న్యూమోనియా అని తేల్చారు డాక్టర్లు. 'ఇక్కడ చాలా డబ్బు ఖర్చవుతుంది హైదారాబాద్ తీసుకెళ్లు. అక్కడ ట్రీట్‌మెంట్ చీప్, ఇప్పుడక్కడ లేటెస్ట్ ఎక్యూప్‌మెంట్‌తో మెడికల్ హబ్‌గా మారింది హైద్రాబాద్. మీ బంధువులు కూడా తోడు వుంటారు' అని సలహా ఇచ్చాడు అతని కంపెనీ-పార్టనర్ రాజగోపాల్.

నిజమే అనిపించింది. తల్లి జబ్బుపడి హాస్పిటల్లో వుండటంతో పిల్లలిద్దరూ దిగులుగా కనిపించారు. అన్నపూర్ణ పుట్టింటి వాళ్లు కూడా హైదరాబాద్‌కి దగ్గర్లోనే నేరేడుకొండ అనే గ్రామంలో వుంటున్నారు.

పురుషోత్తం అన్నపూర్ణను హైదరాబాద్ తీసుకొచ్చి హాస్పిటల్‌లో చేర్పించాడు. అప్పటికే న్యూమోనియా బాగా ముదిరింది. తొలి దశలో ఆయాసంగా ఉన్నా అన్నపూర్ణ ఆ సంగతి భర్తకి చెప్పలేదు. నిర్లక్ష్యం చేసింది, అదే తగ్గుతుంది అనుకుంది. నేరేడు కొండలో అన్నపూర్ణ తండ్రి పల్నాటిరామయ్య పొలాలు కొని స్థిరపడ్డాడు. అన్నపూర్ణ ఒక్కతే కూతురు. బాలకృష్ణ ఒక్కడే కొడుకు. అన్నపూర్ణ హాస్పిటల్లో ఉన్నన్ని రోజులూ బాగా సాయపడ్డారు. అయినా లాభం లేకపోయింది. పదిరోజుల తర్వాత అన్నపూర్ణ చనిపోయింది.

హాస్పిటల్ నుంచి అంబులెన్స్‌లో అన్నపూర్ణ శవాన్ని తమ గ్రామం చిలుమూరు తీసుకెళ్దామని అనుకున్నాడు పురుషోత్తం. అయితే మామగారు వద్దన్నాడు.

"ఆ వూర్లో నువ్వు పాతికేళ్ల నుంచి వుండడం లేదు. వెళ్లి ఎక్కడ వుంటారు? మీ అన్నదమ్ముల్ని ఆశ్రయించాలి. అదంతా ఎందుకు? మా వూళ్లో అంత్యక్రి

## గీయడానికి కష్టం!

'ఎవరి కార్టూనైనా గీయడంలో మీరు ఇబ్బంది పడ్డ సందర్భముందా?' సన్నిహితులు ఒకసారి ఆర్. కె. లక్ష్మణ్‌ను అడిగారు. 'అలాంటి విషమపరీక్షను రాజీవ్‌గాంధీ నాకు ఒడ్డారు. అప్పట్లో ఆయన యువకుడు. ఆయనది పొడవుగా, అందంగా ఉండే శరీరాకృతి.



ఓ వ్యంగ్య చిత్రకారుడిగా ఆయన భౌతిక రూపంలో ఏదో ఒక అవయవాన్ని వక్రీకరించో, అతిశయం చేసో కార్టూను వేద్దామన్నా సాధ్యపడట్లేదు. పైగా ఆయనవి చాలా ఉన్నతమైన భావాలు. ఆయన నన్ను ఆందోళనకు గురిచేశారు.

చివరకు అతి ప్రయాసతో అతని కార్టూన్ వేయగలిగాను. ఆయన మొహాన్ని మరింత గుండ్రంగా వేశా. పొడవైన ముక్కును కొంచెం పొట్టి చేసి, పైవైపు కాస్త వంపు ఉండేలా గీశాను. కనుబొమలను మరింత దట్టంగా వేశాను. నెత్తిమీద ఒత్తుగా ఉన్న వెంట్రుకలను పూర్తి పలుచగా వేశాను. అలా 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో అతని కార్టూన్‌ను వేస్తూ వెళ్లాను. కొన్నాళ్లకు రాజీవ్‌గాంధీ తన సహజసిద్ధమైన అందాన్ని పోగొట్టుకుని నా కార్టూన్‌లా మారక తప్పలేదు' అని మిత్రులను నవ్వించారు ఆర్. కె. లక్ష్మణ్.

"అమ్మా! ఎట్లావుందే వంట్లో? "

"బాగానే వున్నారా!" అంది శేషమ్మ ముక్తసరిగా.

లోగడ మన్మథరావు రాగానే కుశల ప్రశ్నలు వేసేది. పిల్లల గురించి అడిగేది. పంట ఎలా వుంది? పురుగుల మందు వేశావా? దిగుబడి బాగుంటుందా? అని ఎంక్వైరీ చేసేది. ఇప్పుడామెకు కొడుకుల మీద కోపంగా ఉంది. ఆ రోజు ఇల్లు అమ్మితే తన భాగం ఇవ్వాలని పోట్లాడ్డం ఆమె మర్చిపోలేక పోతోంది.

"మా బామ్మర్ది వెంకట శివుడు" అని తల్లికి చూపించాడు.

"మీ నాన్న ఉద్యోగం వస్తుందన్నారుగా నీకు, వచ్చిందా? ". అని అడిగింది.

"ఇంకా లేదు అత్తయ్యా! వస్తుంది" చెప్పాడు వెంకట శివుడు.

చైతన్య, గీతిక టీవీ చూస్తున్నారు.

"మా అన్నయ్య పిల్లలు" అని బామ్మర్దికి చెప్పాడు మన్మథరావు.

వెంకట శివుడు గీతికను కళ్లార్పకుండా చూశాడు. వాళ్లు "హాయ్" అని వూరుకున్నారు.

శేషమ్మ ఇద్దరికీ కాఫీ ఇచ్చింది. కాసేపుండి ఇద్దరూ వెళ్లిపోయారు.

సాయంకాలం మన్మథరావు తమ్ముడిని వెంటబెట్టుకుని మళ్లీ వచ్చాడు.

"అన్నయ్యా! గీతికకు పెళ్లి సంబంధం ఏమైనా కుదిరిందా? " అని లక్ష్మణరావు అడిగాడు.

"లేదు! ఎందుకు అట్లా అడిగావు? " అన్నాడు పురుషోత్తం.

"ఇల్లు బాగు చేయిస్తుంటేను ఊళ్లో అందరూ అనుకుంటున్నారు. మమ్మల్ని అడుగుతున్నారు" చెప్పాడు లక్ష్మణరావు.

"అదేం లేదురా! ఏదైనా కుదిరితే మీకు చెప్పకుండా ఉంటానా? " అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ మౌనం వహించారు.

"ఇల్లు బాగా పాతదైపోయింది. సున్నం కొట్టించి కూడా ఎన్నో ఏళ్లయింది. లోపల ముక్కవాసనేస్తోంది. పిల్లలు ఇబ్బంది పడుతున్నారు. వైరింగ్ పాతబడింది. మనిషికైనా జబ్బుచేస్తే వైద్యం చేయిస్తేనే గదా మామూలుగా ఉండేది. ఇల్లుగూడా అంతే. రిపేర్లు చేయించకపోతే పాడైపోతుంది. ఎప్పుడో కూలుతుంది. అమ్మ ఉన్నంత కాలం బాగుండాలి ఇల్లు. రేపు మీ పిల్లల పెళ్లిళ్లయినా ఈ ఇంట్లోనే గదా చెయ్యాలి. మీరు కట్టుకున్నవి చిన్నవి. చుట్టాలొస్తే ఇరుకు" చెప్పాడు పురుషోత్తం.

ఇక ఇల్లు అమ్మేది లేదు. చేతికి డబ్బొచ్చేది లేదని డిసైడ్ అయ్యారు తమ్ముళ్లు. అప్పుడు ఆశపడ్డారు, లక్షలొచ్చి పడతాయని. ఇప్పుడు అదేమీ లేదని తేలేసరికి నిరాశపడ్డారు. అయినా ఇప్పుడు వాళ్లొచ్చిన పని వేరు.

"చిన్నన్నయ్య బామ్మర్దికి గీతికనిస్తే బాగుంటుంది అన్నయ్యా!" అన్నాడు లక్ష్మణరావు నెమ్మదిగా.

"పొద్దునొచ్చిన వాడికా? "

"ఆc..! వాడికే"

"వాడికి ఉద్యోగం ఏంలేదుగా!"

"ఉద్యోగం తప్పక వస్తుందన్నయ్యా!"

"ముందు రానీయ్! తర్వాత చూద్దాం"

"ఇప్పుడైతే చీప్‌లో పోతుంది"

**కొత్తగాలి...**

**డబ్బు**
**రావడం కష్టం పోవటం తేలిక**
**జబ్బు**
**రావడం తేలిక పోవడం కష్టం**

– కె. నాగేశ్వరరావు,
విజయవాడ



"చీప్‌లో పోవడం ఏంట్రా? "

"ఇప్పుడైతే ఐదు లక్షలు క్యాష్ ఇచ్చి పెళ్లి చేస్తే సరిపోతుంది. ఉద్యోగం వచ్చాక వాళ్లు కొండెక్కి కూర్చుంటారు. పది లక్షలు అడుగుతారు"

"గుంటూర్లో వాళ్లకి ఏం ఉందిరా? "

"పాత గుంటూర్లో ఇల్లుంది"

"వంద గజాల్లో పాత ఇల్లేగా! నాకు తెలుసు. అందులో మా అమ్మాయి ఒక్క రోజు కూడా ఉండలేదు"

అన్నదమ్ములిద్దరూ షాక్ తిన్నారు.

"మీ బామ్మర్ది తర్వాత ఇద్దరు ఆడపిల్ల లున్నారు. వాళ్లకి పెళ్లిళ్లు చేయాలి. వీడికి కట్నం వస్తే ఆ డబ్బుతో వాళ్ల పెళ్లిళ్లు చేయాలని చూస్తోంది మీ అత్త"

అన్నదమ్ములు ఏం మాట్లాడలేదు.

"గీతిక పెళ్లి చీప్‌గా అయిపోవాలని నేనేం అనుకోవడం లేదు. మేనమామ దగ్గర ఏభై తులాల బంగారం ఉంది. గీతిక దగ్గర ఇంకా కొంత బంగారం ఉంది. అదీగాక గీతిక చదువుకుంది. కొన్నాళ్లు ఉద్యోగం చేయాలనుకుంటోంది. తగినవాడు దొరికినప్పుడు పెళ్లి చేసుకుం టుంది. ఇప్పట్లో దాని పెళ్లికి హడావుడీ ఏంలేదు. దాని పెళ్లి చేయాలని అమ్మ వర్రీ పడుతోంది గానీ అంత అవసరం లేదు" చెప్పాడు పురుషోత్తం.

మన్మథరావు అనుకున్నదంతా తల్లకిం దులైంది. 'బామ్మర్దికి పిల్లనివ్వమని చెబితే ఎగిరి గంతేస్తాడు అన్నయ్య' అనుకున్నారు అన్నదమ్ములిద్దరూ.

'ఆయన దగ్గర ఎటూ పెళ్లి చేయడానికి డబ్బు లేదంటాడు. ఇల్లు తాకట్టు పెట్టించి ఫైనాన్స్‌లోనో, బ్యాంకులోనో అప్పు ఇప్పిం చాలనుకున్నారు. ఆ అప్పు ఎటూ తీర్చ లేడు. ఇక ఇల్లు అమ్మడమే శరణ్యం. ఇల్లు అమ్మినప్పుడు తమ వాటాలకు డబ్బు వస్తుంది..' ఇన్ని అనుకున్నారు వారు. పురుషోత్తం దగ్గర వాళ్ల పప్పులు ఉడకలేదు. పైగా పురుగుని తీసిపారేసినట్టు మాట్లాడాడు. వాళ్లింట్లో తన కూతురు ఒక్కరోజు గూడా ఉండలేదన్నాడు.

"మీరు ఈ పల్లెటూళ్లో కూపస్థమండూ కాల్లా ఉండిపోయారు. లోకం ఎట్లా మారి పోయిందో మీకు అర్థం కావడం లేదు. కనీసం పేపరు చదువుతున్నారా? టీవీలో న్యూస్ అయినా చూస్తున్నారా? " అడిగాడు



పురుషోత్తమం.

ముఖాలు గంటు పెట్టుకుని కూర్చున్నారు ఇద్దరూ.

"బైక్ ల మీద తిరుగుతున్నారు. ఇంట్లోకి టీవీవస్తే గొప్పని మురిసి పోతున్నారు. బైట మనుషులు ఎట్లా మారుతున్నారు? ముఖ్యంగా ఆడపిల్లల్లో ఎంత మార్పు వచ్చిందీ? మీకు అర్థం కావడం లేదు. ఇప్పుడు ఆడపిల్లలు బాగా చదువుకుంటు న్నారు. పురుషులతో పోటీపడుతున్నారు. సైన్యంలో చేరుతున్నారు. విమానాలు నడుపుతూ ఆకాశంలో ఎగురుతున్నారు. అన్నిరకాల ఉద్యోగాలు చేస్తున్నారు. గవ ర్నమెంట్ ఉద్యోగాల్లో రిజర్వేషన్లు సాధిం చారు. చట్టసభల్లో రిజర్వేషన్ కోసం పోట్లాడుతున్నారు"

"ఎన్నిచేసినా ఆడాళ్లు పెళ్లిళ్లు చేసుకోవా ల్సిందేగా అన్నయ్యా?" అన్నాడు మన్మథ రావు వ్యంగ్యంగా.

"చేసుకోవాల్సిందే. అయితే ఎవడో ఒకడ్ని కాదు. తల్లిదండ్రులు చెప్పారని ఇష్టంలేని వాడిని చేసుకోవడం లేదు. తమ తోపాటు చదువు సంస్కారం ఉన్నవాడయి తేనే తలూపుతున్నారు. కట్నాలు ఇవ్వడం తగ్గిపోయింది. మనుషులు, కులాలు, మతాలు, ఆస్తి, అంతస్తులు అంటూ గిరిగీ సుకుని కూర్చున్నారు. మరొకవైపు జాత కాల పిచ్చి. ఆడపిల్లలు వద్దని స్కానింగ్‌లో తేలగానే అబార్షన్లు చేయించుకున్నారు లోగడ. ఇప్పుడు అది సమాజానికి, ముఖ్యంగా మగపిల్లలకి శాపం అయింది. ఆడపిల్లలు తగ్గిపోయారు. ఎక్కడ చూసినా పెళ్లికాని మగపిల్లలే కనిపిస్తు న్నారు"

పురుషోత్తం మాటలతో అన్నదమ్ములిద్ద రికీ తలలు వాచిపోయాయి. మాట్లాడ

కుండా వెళ్లిపోయారు.

★ ★ ★

పురుషోత్తంకి బాగాలేదు. సెల్ ఆఫ్ చేసి పడుకున్నాడు. రాత్రి పదింటికి నర్సయ్య వచ్చాడు హడావుడిగా.

"నీ సెల్‌కి లైన్ కలవలేదు ఎన్నిసార్లు ట్రై చేసినా!" అన్నాడు నర్సయ్య.

అతని ముఖంలో ఆందోళన కనిపిస్తోంది. ఎందుకో వర్రీ అయిపోతున్నాడు. ఇంత రాత్రి వచ్చాడంటే ఏదో సమస్య వచ్చి ఉంటుందని ఊహించాడు.

"ఏంట్రా ఇంత రాత్రివేళ వచ్చావు? ఏం జరిగింది? " అడిగాడు పురుషోత్తం.

**కొత్తగాలి...**

**లోచనాలు**
**మూసుకుంటే**
**ఆలోచనలు**
**ముసురుకుంటాయి!**

– బి.ఎ.ఎస్. ప్రసాద్,
చాగల్లు, ప.గో. జిల్లా

"మనం అర్జెంట్‌గా హైదరాబాద్ వెళ్లాలి" నర్సయ్య కంఠం వణుకుతోంది.

"ఎందుకు? "

"మా అన్నయ్య కూతురి సమస్య. మా అన్నయ్య కొండయ్య తెలుసుగా? "

"ఎందుకు తెలీదూ? హైదరాబాద్ సెక్రటేరియట్లో పనిచేస్తున్నాడు"

"అన్నయ్య కూతురు సరితని వంశీకి ఇచ్చి పెళ్లిచేశారు, రెండేళ్లయింది. వంశీ నాన్న శివయ్య గుంటూర్లో పనిచేస్తున్నాడు స్టేట్‌బ్యాంకులో"

"ఇప్పుడేమైంది? "

"నువ్వు అంటుంటావే మనిషి సంగతి సమయం వచ్చినప్పుడు బైట పడుతుందని! అదే అయింది"

"సరిగా చెప్పు"

"పెళ్లప్పుడు వంశీకి జాబ్‌లేదు. వాడు బీటెక్ పాసయ్యాడు. అన్నయ్య క్లాస్‌మేట్ ద్వారా ఆ సంబంధం వచ్చింది. బీటెక్ క్వాలిఫికేషన్ ఉంది. ఏదొక జాబ్ వస్తుందిలే అనుకున్నారు. జాబ్ వచ్చే వరకు వంశీ అన్నయ్య ఇంట్లోనే ఉంటానన్నాడు. కంప్యూటర్ కోర్సులు చేస్తే సాఫ్ట్‌వేర్ కంపెనీలలో జాబ్ గ్యారంటీ అన్నారు. అన్నయ్యకు సరిత ఒక్కతే కూతురు కావడంతో సరే అన్నారు. ఐదు లక్షలు కట్నం ఇచ్చి పెళ్లిచేశారు. వంశీ సంవత్సరం పాటు అన్నయ్యవాళ్ల ఇంట్లోనే ఉండి కోర్సులు చేశాడు. జాబ్ వచ్చింది. వంశీ తల్లి బుద్ధి మారిపోయింది. అనవసరంగా తన కొడుక్కి తక్కువ కట్నం తీసుకుని పెళ్లిచేశామని గొణగడం మొదలుపెట్టింది. ఇప్పుడైతే ఏభై లక్షలు కట్నం వస్తుంది. అమెరికా వెళ్లి కోట్లు సంపాదిస్తాడు అని కోడల్ని హింసించటం మొదలుపెట్టింది. వంశీకి తల్లిమాటలు బుర్రకు బాగా ఎక్కాయి. మొన్నరాత్రి సరితను ఇంట్లో నుంచి వెళ్లగొట్టాడు. సరిత ఏడుస్తూ అన్నయ్య ఇంటికి వచ్చిందట. అన్నయ్యకి కోపం వచ్చి పోలీస్‌స్టేషన్లో కంప్లయింట్ ఇచ్చాడు. పోలీసులు ఇంటికి వెళ్లేసరికి తాళం వేసి గుంటూరు వెళ్లిపోయాడట. తనకోసం పోలీసులు తిరుగుతున్నారనేసరికి వంశీ భయపడి అక్కడే ఉండిపోయాడు. వాళ్ల నాన్న అన్నయ్యకి ఫోన్ చేసి రేపు పోలీస్‌స్టేషన్‌కి వస్తే రాజీ పడదామన్నాడట. అన్నయ్య నన్ను అర్జెంట్‌గా రమ్మన్నాడు. నువ్వు తోడుంటే నాకు ధైర్యం"

నర్సయ్య చెప్పిందంతా విని నిట్టూర్చాడు పురుషోత్తం.

"బాగుందిరా! డబ్బు దగ్గరికి వచ్చే సరికి మనుషుల నిజస్వరూపాలు బైట పడుతు

న్నాయి. అందుకే ఒక మహానుభావుడు అన్నాడు స్వర్గాన్ని దేవుడు పాలిస్తుంటే, భూమిని బంగారం పాలిస్తోందట" అన్నాడు.

"అట్లాగే ఉంది. ఉద్యోగం లేనప్పుడు కొడుక్కి వస్తే చాలనుకున్నారు. మామగారింట్లో సంవత్సరం పాటు తేరగా తిని కంప్యూటర్ కోర్సులకు ఫీజులు కూడా ఆయనతో కట్టించాడు. ఉద్యోగంలో చేరాక ఆశ పెరిగింది. వాడికి ఏభై లక్షలు కట్నం ఇచ్చారు.. వీడికి కోటి ఇచ్చారు.. అనే మాటలు వినేసరికి వాళ్లకి గంగవెర్రులెత్తాయి. అన్నయ్య దగ్గర ఇంకా డబ్బు గుంజాలని ప్లాన్. ఒక్కతే కూతురు. ఎందుకివ్వరని. ధీమా? వెళ్లగొడితే వచ్చి బతిమాలి ఎంతోకొంత ముట్టజెప్తారని అనుకున్నారు. అన్నయ్య పోలీస్‌స్టేషన్లో కంప్లయింట్ ఇచ్చేసరికి కంగుతిన్నారు" చెప్పాడు నర్సయ్య.

"కొండయ్య మంచిపని చేశాడ్లే" అన్నాడు పురుషోత్తం.

"ఇప్పుడు మనకు బస్సులు, రైళ్లు దొరకవు. కారు తెప్పిద్దాం. తెల్లారేసరికి వెళ్లొచ్చు" అన్నాడు.

పురుషోత్తం తెనాలిలో ట్రావెల్స్‌కి ఫోన్ చేశాడు. గంట తర్వాత ఇంటి ముందు కారు ఆగింది. ఇద్దరూ హైదరాబాద్ చేరుకునేసరికి ఉదయం ఎనిమిదైంది. స్నానాలు చేసి ఫ్రెష్ అయ్యారు.

నర్సయ్య చెప్పిందే అక్కడ కొండయ్య చెప్పాడు. కొండయ్య భార్య పార్వతి అల్లుడ్ని తిట్టి శాపనార్థాలు పెడుతోంది. సరిత ఏడుస్తోంది.

పురుషోత్తం సరితను ఓదార్చాడు. "అమ్మాయ్! అసలు విషయం చెప్పు? మీ ఆయన ఎటువంటి వాడు? అతనితో పేచీ ఏంటి? " అని అడిగాడు.

"అంకుల్! వంశీ మంచోడు. నన్ను బాగా చూసుకుంటాడు. అతనితో పేచీ ఏమీలేదు. పేచీ అంతా మా అత్తమామలతోనే. ఇప్పుడు పెళ్లిళ్లవుతున్న చుట్టాల కట్నాలతో పోల్చుకుంటున్నారు. వచ్చినప్పడల్లా వంశీకి నూరిపోస్తున్నారు. రోజూ ఫోన్‌లో వంశీని సతాయిస్తున్నారు. అతనికి తల్లిదండ్రుల మాటలు తలకెక్కాయి. 'మీ నాన్న దగ్గరకెళ్లి ఇంకొక ఐదు లక్షలు తీసుకురా! లేకపోతే మావాళ్లు నీకు విడాకులు ఇప్పించి ఇంకొక పెళ్లి చేస్తారు' అని నన్ను సతాయిస్తున్నాడు. నేను అందుకు ఒప్పుకోవడం లేదు. నన్ను వెళ్లగొడితే కానీ వాళ్లు డబ్బివ్వరు అని కొడుక్కి చెప్పినట్లున్నారు. దాంతో వంశీ నన్ను డబ్బు తెచ్చి గుమ్మం తొక్కు అని వెళ్లగొట్టాడు" చెప్పింది సరిత.

"కొండయ్యగారూ! నాకు అంతా అర్థమైంది. మీరు గమ్మునుండండి! వాళ్ల సంగతి నేను చూస్తాను" అన్నాడు పురుషోత్తం.

పదకొండింటికి పోలీస్‌స్టేషన్ నుంచి కొండయ్యకి ఫోన్‌కాల్ వచ్చింది 'గుంటూరు నుంచి శివయ్యవాళ్లు వచ్చారు. మీరూ రండి!' అని.

కొండయ్య ఉండేది కూకట్‌పల్లిలో. అక్కడి పోలీస్‌స్టేషన్‌కి చేరుకున్నారంతా.

శివయ్యతోపాటు ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వాళ్లు గుంటూర్లో లాయర్లు అని చెప్పాడు. శివయ్య భార్య మొహం గంటు పెట్టుకుని కూర్చుంది. ఇనస్పెక్టర్ 'మీరు మాట్లాడుకోండి' అని లోపలకు వెళ్లిపోయాడు. వంశీ ఎక్కడా లేడు. వస్తే అరెస్ట్ చేస్తారని ఇంట్లో ఉండిపోయి ఉంటాడు.

పోలీస్‌స్టేషన్‌కి ముందు సిమెంట్ బెంచీల మీద అంతా కూర్చున్నారు. పరిచయాలయ్యాక పురుషోత్తం నేరుగా విషయంలోకి దిగిపోయాడు.

"రెండేళ్లు కాపురం చేశాక మా అమ్మాయిని ఇంట్లో నుంచి వెళ్లగొట్టడం దుర్మార్గం. కడుపుతో ఉన్న కొత్తకోడలిని

బయటికి నెట్టడం మరీ ఘోరం! నాలుగు వేళ్ళు నోట్లోకి పోతే చాల్లే, కడుపు నిండితే అదే పదివేలు అనుకునే రోజుల్నుంచి ఇంతగా ఎదిగాం. ఇల్లు కట్టుకుని కార్లు కొనుక్కొని బ్యాంకుల్లో డబ్బు నిల్వ చేసు కుంటూ సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాం. డబ్బు ఎంత కావాలి మనిషికి? అంతు లేదు! ఎన్ని నదులు కలిసినా నిండని సముద్రుడిలా అయిపోయారు మను షులు. అంతులేని ధనదాహం పీడిస్తోంది. మానవత్వం మర్చిపోతున్నారు. మనం చిన్నతనంలో ఎట్లా ఉన్నాం? ఇప్పుడు ఎట్లా ఉంటున్నాం? గుర్తుకు తెచ్చుకోవాలి. పాత రోజులు మర్చిపోయి ధనగర్వంతో విర్రవీగడం నాశనానికి దారితీస్తుంది"

సరిత మామ శివయ్య, ఆయన వెంట వచ్చిన లాయర్లు వింటూ ఉండిపోయారు.

"శివయ్యగారూ! పెళ్లిలో మీకు కొండయ్య ఐదు లక్షలు ఇచ్చింది నిజం కాదా? " ప్రశ్నించాడు పురుషోత్తం.

"ఇచ్చారండి! ఇవ్వలేదని ఎప్పుడూ అన లేదు" చెప్పాడు శివయ్య.

"మళ్లీ పెళ్లి ఖర్చులోక ఐదు లక్షలయి ఉంటాయి గదా? "

తలూపాడు శివయ్య.

"రెండేళ్లకే మళ్లీ ఐదు లక్షలు తెమ్మని డిమాండ్ చేస్తే ఎక్కడ్నుంచి తెస్తాడు? ఒకవేళ తెచ్చి ఇచ్చాడనుకోండి! అంతటితో మీకు తృప్తి కలుగుతుందా? మీరు ఇంకా తెమ్మని అనరని గ్యారంటీ ఏంటి? "

శివయ్య నేలచూపులు చూస్తున్నాడు.

"అయిందేదో అయిపోయిందండీ!" ఒక లాయర్ అన్నాడు.

"అయిపోయినదాన్ని బట్టే మనం గుణ పాఠం నేర్చుకోవాలి గదండీ!"

"ఔనండి! కరెక్ట్‌గా చెప్పారు"

"అందుచేత కొండయ్యగారు పెట్టిన పోలీస్‌కేసు విత్‌డ్రా చేసుకోవాలంటే నేనొక రాజీ ఫార్ములా ఆలోచించాను"

"రాజీ పడడానికే మేం గుంటూరు నుంచి వచ్చాం! చెప్పండి!"

"అమ్మాయిని హింసించి ఇంట్లో నుంచి వెళ్లగొట్టాక ఇక ఆమె కాపురం చెయ్యడం కల్ల. ఆమె మనసు విరిగిపోయి ఉంటుంది. ఎంతో క్షోభ అనుభవించింది. అద్దం పగిలితే అతుక్కోదు. హృదయం కూడా అంతే! అందువలన సరితకు నష్టప రిహారం చెల్లించడమే మిగిలింది. సరిత విడాకులు ఇవ్వడానికి రెడీగా ఉంది. కొండయ్యగారు పెళ్లికి ఖర్చుపెట్టిన పది లక్షలకు మరొక పదిలక్షలు నష్టపరిహా రంగా ఇవ్వండి. మొత్తం ఇరవై లక్షలు. అమ్మాయి గర్భవతి. పుట్టిన బిడ్డను పెంచి పెద్దజేయాలి. ఆ బిడ్డకు మరొక పది లక్షలు ఇచ్చేయండి. సరిపోతుంది"

శివయ్య నెత్తిన పిడుగు పడినట్టు బిత్త రపోయాడు.

ఇద్దరు లాయర్లకి మెదడు పనిచెయ్య లేదు. అసలే చెట్టుకింద ప్లీడర్లయి ఉంటారు. లేకపోతే శివయ్య వెంట గుంటూరు నుంచి ఇక్కడికి వస్తారా? శివయ్య పెళ్లాం గౌరి అయోమయంగా చూస్తోంది.

వాళ్లు గుంటూరులో అనుకున్న రాజీ ఏమీ ఇక్కడ ఆచరణలోకి రాకపోవడం దిగ్భ్రాంతి కలిగించింది. పిల్లనిచ్చుకున్న వాళ్లు కాళ్లావేళ్లాపడి బతిమిలాడడం ఎంతో కొంత అదనపు కట్నంగా డబ్బు ముట్టజె ప్పడం జరిగిన చరిత్ర. ఆ చరిత్రకు విరు ద్ధంగా ఉంది ఇక్కడ పురుషోత్తం చెప్పిన రాజీ ఫార్ములా.

ఎవరికీ నోరుపెగలడం లేదు.

"ఎందుకు తటపటాయిస్తున్నారు శివ య్యగారూ! మీరు డబ్బు ఇచ్చిన మరు క్షణం సరిత విడాకులకు ఒప్పుకుంటున్నట్టు డాక్యుమెంట్ల మీద సంతకం చేస్తుంది. మీ కొడుక్కి దర్జాగా మళ్లీ పెళ్లి చేయవచ్చు. హైదరాబాద్ స్వర్గంలో సాఫ్ట్‌వేర్ ఇంజనీ

ర్గా ఉన్న మీ వాడికి కోటి కట్నం ఇచ్చి పిల్లనిచ్చేవారు క్యూలో నిలబడతారు. ఆ కోటిలో ఆఫ్టాల్ ముప్పై లక్షలు సరిత మొహాన కొట్టండి! దట్సాల్!" చెప్పాడు పురుషోత్తం.

డిఫెన్స్‌లో పడిపోయాడు శివయ్య. అతని ముఖం కళ తప్పింది.

"మేం విడాకులు అడగలేదు కదండీ!" అన్నాడు హీనస్వరంతో.

"మీ పుట్టింటికెళ్లి డబ్బు పట్టుకురా! అంటే ఏమిటండీ శివయ్యగారూ! మీకు తెలియకపోతే మీ భార్యని అడగండి చెప్తుంది. మావాడికి ఇప్పుడు పెళ్లిచేస్తే కోటి కట్నం ఇస్తారు అని ఎన్నిసార్లు అన్నదో అడగండి. విడాకులు ఇవ్వమని ప్రత్యేకంగా అడగాలా సార్?" అన్నాడు పురుషోత్తం.

"మా ఆవిడ అన్నదేమోలెండి! తప్పయి పోయింది! మాకు కోడలికి విడాకులు ఇచ్చే ఆలోచన లేదు. ఇకముందు అమ్మాయిని బాగా చూసుకుంటాం! పంపండి" అన్నాడు శివయ్య.

"సరే! ఆ సంగతి కాగితం మీద రాసివ్వండి. మీరు, మీ భార్య, మీ కొడుకు సంతకాలు చేసివ్వండి. ఇకముందు సరితకు ఏం జరిగినా మీ అందరిదీ బాధ్యత. జైలుకెళ్లడం ఖాయం" చెప్పాడు పురుషోత్తం.

గుంటూరు లాయర్లు పురుషోత్తం చెప్పిన విధంగా డాక్యుమెంట్ తయారుచేశారు. శివయ్య కొడుకుని ఫోన్ చేసి పిలిపించాడు. అందరూ సంతకాలు చేసి ఇచ్చారు. కొండయ్య తను ఇచ్చిన కంప్లయింట్ విత్‌డ్రా చేసుకున్నాడు. శివయ్యకు, వంశీకి తీవ్రంగా వార్నింగ్ ఇచ్చాడు ఇన్‌స్పెక్టర్.

అప్పటికి లంచ్ టైమ్ అయింది.

"బావగారు! మీరంతా మా ఇంటికి భోజనానికి రావాలి" అన్నాడు కొండయ్య, శివయ్యతో.

కొండయ్య ఆనందంగా వున్నాడు. కూతురు కాపురం ఇంత తొందరలో కుదుట పడుతుందని వూహించలేదు. పురుషోత్తం సమయస్ఫూర్తితో వియ్యంకుడ్ని బెదరగొట్టడం సంతోషపరిచింది. నర్సయ్య కూడా సమస్యను పురుషోత్తం ఇలా పరిష్కరిస్తాడని అనుకోలేదు. పురుషోత్తం విడిచిన బాణం గురి తప్పలేదు.

అంతా కొండయ్య ఇంటికి చేరుకున్నారు. గౌరి వియ్యపురాలితోను, కోడలితోను ఆప్యాయంగా మాట్లాడింది. ముగ్గురు ఆడవాళ్ళు వంట పనిలో నిమగ్నమైపోయారు.




"నర్సయ్యా! ఎటూ హైదరాబాద్ వచ్చాం కదా! మా అత్తగారి వూరు వెళ్దాం, కొంచెం పనుంది" అన్నాడు పురుషోత్తం.

"మీ అత్తగారు లేరనుకుంటాగా?"

"అత్త లేకపోయినా అత్తారింటికి అంటాం కదా?"

"ఎంత దూరం?"

"ఇక్కడికి ఏభై కిలోమీటర్లుంటుంది. నేరేడుకొండ అని పల్లెటూరు. అరవై ఏళ్ళ క్రితం మా మావగారి నాన్న ఇక్కడ పొలం కొని స్థిరపడ్డారు. పల్నాడు నుంచి వచ్చారని వాళ్ళింటి పేరు పల్నాడుగా స్థిరపడింది. నేరేడుకొండని పల్నాడోళ్ళవూరు అని కూడా ఆ చుట్టు పక్కల వూళ్ళవాళ్ళు

పిలుస్తుంటారు" చెప్పాడు పురుషోత్తం.

కారు నేరేడుకొండ వెళ్ళే సరికి సాయం కాలం నాలుగు దాటింది.

నేరేడుకొండ చిన్నవూరు అయినా పరిశు భ్రంగా వున్నాయి పరిసరాలు. ఊరంతా తారు రోడ్లున్నాయి. హైస్కూల్, కమ్యూ నిటీ హాల్ వున్నాయి. వాటర్ ట్యాంక్ వుంది. ప్రతి ఇంటికీ వాటర్ లైన్ కనెక్షన్ వుంది. రచ్చబండ దగ్గర పంచాయతీకి రెండంతస్తుల బిల్డింగ్ వుంది. వరిచేలు పంటతో పచ్చగా వున్నాయి.

రెండంతస్తుల మేడ ముందు కారు ఆగింది. పాలేరు వచ్చి గేటు తీశాడు. బాలకృష్ణ కారు దగ్గరికి వచ్చి "ఇంతాలిస్యం అయిందేం బావా? " అని పలకరించాడు.

"సిటీలో ట్రాఫిక్ దాటుకొచ్చేటప్పటికి ఈ టైమ్ అయింది" అన్నాడు పురుషోత్తం.

"ఈయన నర్సయ్య. చిన్నప్పటి స్నేహి తుడు. స్కూల్లో నా క్లాస్‌మేట్" అని పరి చయం చేశాడు బామ్మర్దికి.

బాలకృష్ణ నర్సయ్యకి కరచాలనం చేశాడు.

అందరూ లోపలకు వెళ్ళారు. బాత్‌రూ మ్‌లో ఫ్రెష్ అయ్యాక హాల్లో కూర్చు న్నారు.

"బాగున్నారా అన్నయ్యా!" అంటూ వచ్చింది.. బాలకృష్ణ భార్య.

ఆమె ట్రేలో స్వీట్స్, కారా ప్లేట్లు పెట్టు కుని వచ్చి టీపాయ్ మీద వుంచింది.

"ఇప్పుడెందుకమ్మా? " అన్నాడు పురు షోత్తం.

"తీసుకోండి అన్నయ్యా! భోజనానికి ఆలస్యం వుందిగా!" అంది.

"భోజనాలు అవీ పెట్టుకోకు! అర్జెంట్ పనిమీద వచ్చాం. వెంటనే వెళ్ళిపోవాలి"

"భలేవారన్నయ్యా! రాక రాక వచ్చారు. భోజనం చెయ్యకుండా వెళ్తారా? " అంది.

"బావ అట్లాగే అంటాడులేవే! నువ్వు ఏర్పాట్లు చెయ్యి" అన్నాడు బాలకృష్ణ, భార్యతో.

ఆమె ఇంట్లోకి వెళ్ళింది.

"గీతిక పెళ్ళి చేయాలనుకుంటున్నారా! ఈ యేడు" అన్నాడు పురుషోత్తం, బామ్మ ర్దితో.

"సంబంధం కుదిరిందా? "

"చూస్తున్నాం!"

"ఇక దుబాయ్ వెళ్ళే పని లేదుగా? "

"లేదు. పర్మినెంట్‌గా వచ్చేసినట్టే"

కొంచెం సేపు బాలకృష్ణ తన పిల్లల గురించి ఏదో చెప్పాడు.

"మీ అక్కయ్య బంగారం గురించి వచ్చా నురా! గీతిక పెళ్ళికని ఇక్కడే వుంచాను గదా!" అని అసలు విషయం ప్రస్తావిం చాడు పురుషోత్తం.

బాలకృష్ణ ముఖంలో మార్పు కనిపిం చింది. అప్పటి వరకు ప్రసన్నంగా వున్న వాడు అసహనంతో అటూఇటూ కది లాడు.

"ఆ బంగారం బ్యాంక్‌లో వుంది బావా!" నెమ్మదిగా అన్నాడు బాలకృష్ణ.

పురుషోత్తం సీరియస్‌గా అడిగాడు..

"బ్యాంక్‌లో వుండడం ఏమిటి? "

"అంతా మా నాన్నవల్ల జరిగింది. ఊళ్ళో ఎవరో ఎక్కిస్తే సమితి ప్రెసిడెం ట్‌గా ఎన్నికలలో నిలబడ్డాడు. ఖర్చులకని బ్యాంక్‌లో బంగారం తాకట్టుపెట్టి తెచ్చాడు. ఎలక్షన్లో గెలవలేదు. ఆ దిగులు తోనే పోయాడు. ఇంకా వూర్నిండా చిల్లర బాకీలు వున్నాయి. అంతా నాశనం చేసి పోయాడు. ఇప్పుడేం చేయాలో అర్థం కావడం లేదు"

బాలకృష్ణ మాటల్లో ఏమంత నిజాయితీ లేదని నర్సయ్యకి కూడా తెలిసిపోయింది. అప్పుల్లో కూరుకుపోయిన వారి ఇల్లులా లేదు అది. మేడ చుట్టూ కాంపౌండ్ వాల్. లోపల రెండు ట్రాక్టర్లు, సరికొత్త కారు వున్నాయి. బాలకృష్ణ ఖరీదైన ఖద్దరు బట్టల్లో వేళ్ళకి ఉంగరాలు, ముంజేతికి

బ్రాస్‌లెట్, మెడలో చైన్‌తో దర్జాగా వున్నాడు. ఇంట్లో ఖరీదైన వస్తువులతో ఐశ్వర్యం తాండవిస్తోంది. బాలకృష్ణ భార్యకు కూడా వంటిమీద బాగానే వున్నాయి నగలు.

"మా బంగారం బ్యాంక్‌లో తాకట్టుపెట్టడం ఏమిటి? " తీవ్రంగా అన్నాడు పురుషోత్తం.

"బావా! నన్నడిగితే నేనేం చెప్పను? మా నాన్న గొప్పలకు పోయి ఎలక్షన్లో నిల్చుని డబ్బంతా ఖర్చుపెట్టాడు"

"మీ నాన్న ఏం చేస్తే నాకేం సంబంధం? పిల్ల పెళ్ళికి అక్కరకొస్తుందని మీ దగ్గరే వుంచి వెళ్ళాను. ఇక్కడ్నుంచి దుబాయ్‌కి బంగారం తీసుకెళ్ళడం ఎందుకని మీ దగ్గర పెట్టాను. తాత గదా? ఆ మాత్రం బాధ్యత లేదా? మనవరాలికి ఇవ్వాల్సిన బంగారం ఎట్లా తాకట్టు పెట్టాడు"

"నీకు తెలీదా బావా? ఆయన ఏదనుకుంటే అదే! ఎవరి మాటా వినడు. నేను అక్కడికీ వద్దని అంటూనే వున్నాను. వింటేగదా!"

పురుషోత్తం తలపట్టుకుని కూర్చున్నాడు.

"అయితే ఇప్పుడేమంటావు? " బామ్మర్దిని ప్రశ్నించాడు పురుషోత్తం.

బాలకృష్ణ ముఖం గంటు పెట్టుకుని కూర్చున్నాడు.

"నేనేం చేయాలో అర్థం కావడం లేదు" అన్నాడు.

"ఏం చెయ్యాలేంటి? బ్యాంక్‌లో నుంచి బంగారం విడిపించాలి" అన్నాడు పురుషోత్తం.

"పదిలక్షలు తెచ్చాడు. ఇక దానికి వడ్డీ ఎంతయిందో? అంత డబ్బు నాదగ్గర ఎక్కడుంది బావా? "

"ఒక పనిచెయ్యి నీ పొలం తాకట్టుపెట్టి

## అమెజాన్ - ఆన్‌లైన్ రీటైల్ స్టోర్

చతుర సమాచారం

ఇండియాలో అమెజాన్ సంస్థ కార్యకలాపాలు ఆరంభించాక ఆన్‌లైన్ కొనుగోళ్ళు అధికమయ్యాయి. అమెరికాకి చెందిన ఈ అమెజాన్ గురించి కొన్ని విషయాలు

★ అమెజాన్ ఎంబ్లమ్ స్పెల్లింగ్‌లో ఏ నుంచి జడ్ దాకా బాణం గుర్తు ఉంటుంది. ఏ టు జడ్ అన్ని కొనచ్చన్న దానికి సూచనగా దీన్ని రూపొందించారు.

★ 2012లో అమెజాన్ లాభాలు 610కోట్ల డాలర్లు!

★ ప్రపంచంలోని మొదటి 2000 డొమైన్స్‌లో దీనిది ఐదవ స్థానం.

★ అమెజాన్ స్థాపకుడు జెఫ్‌బెజూస్ తన కారు గారేజ్‌లో 1995లో దీన్ని ఆరంభించాడు.

★ అమెరికాలోని అమెజాన్ వేర్‌హౌస్‌ల విస్తీర్ణం 10వేల ఒలింపిక్ పూల్స్‌కి లేదా 700 మాడిసన్ స్క్వేర్ గార్డెన్స్‌కి సమానం.

★ సి.ఇ.ఓ సహా అమెజాన్ ఉద్యోగస్తులందరూ ప్రతీ రెండేళ్ళకి రెండు రోజులు కస్టమర్ సర్వీస్ డెస్క్‌లో పనిచేయాలి. కస్టమర్ల అవసరాలు తెల్సు కునేందుకే ఇలా.

★ నార్త్ అమెరికా 'ఇకామర్స్' లో అమెజాన్ శాతం 10.

★ అమెజాన్‌లోని రికమండేషన్ ఇంజిన్‌ను మాజీ ఉద్యోగి గ్రేగ్ లిండెన్ రూపొందించాడు.

★ 2009లో అమెజాన్ డాట్‌కామ్ జాఫోస్ డాట్‌కామ్ అనే ఆన్‌లైన్ షూస్ రిటైలర్ సంస్థని 102కోట్ల డాలర్లిచ్చి కొన్నది.

★ అమెజాన్‌లోని ఐదు అమ్మకాలు సగటున 189డాలర్లకి సమానం.

amazon

★ 2013లో అమెజాన్ వెబ్‌సైట్ 49 నిమిషాలు పనిచేయకపోవడంతో 5కోట్ల 70లక్షల డాలర్ల అమ్మకాల్ని కోల్పోయింది.

★ జూలై 1995లో 'ఫ్లూయిడ్ కాన్సెప్ట్స్ అండ్ క్రియేటివ్ ఎనాలజీస్' అనే పుస్తం అమెజాన్ తొలి అమ్మకం.

ఆ డబ్బుతో బంగారం వదిలించు. మీది కానీ బంగారం ఎట్లా తాకట్టు పెట్టారు? మీ పొలమో, ఇల్లో తాకట్టు పెట్టుకుని తెచ్చుకోవాల్సింది. వయసు రాగానే సరి కాదు. బుద్ధీ జ్ఞానం వుండాలి మనిషికి" గట్టిగా అన్నాడు పురుషోత్తం.

పురుషోత్తం అరుపులకు బాలకృష్ణ భార్య తలుపు పక్కన నిలబడి వింటూ వుంది. బాలకృష్ణ ఆమెను దగ్గరకు రావొద్దని సైగ చేశాడు. పురుషోత్తం ఎన్నిమాటలు అన్నా జవాబు చెప్పడం లేదు బాలకృష్ణ, మౌనం వహించాడు.

"ఏం మాట్లాడవేంరా? బంగారం ఇట్లా మా నాన్న తాకట్టు పెట్టాడు అని నాకు కనీసం ఫోన్ ఎందుకు చెయ్యలేదు? నాకు తెలిస్తే మీ నాన్నని నిలదీసే వాడిని కదా? ఇన్నాళ్ళూ చెప్పకండా ఇప్పుడు చెప్తావేంటి? మీ నాన్న దినానికి వచ్చినప్పుడైనా ఒకమాట నాతో అనలేదు నువ్వు? "

"ఏం చెయ్యను బావా? నాన్న నీతో చెప్పొద్దన్నాడు. దినం అప్పుడు అంతా హడావుడిగా వెళ్ళిపోయావు నువ్వు? "

"సరే! జరిగిపోయిందేదో జరిగింది. మీ పొలం తాకట్టుపెట్టు. మా బంగారం విడిపించి ఇవ్వు! అంతకంటే నువ్వేం చేస్తావు? "

"పొలానికి అంత డబ్బురాదు బావా! ఆ తర్వాత కూడా నేను బ్యాంకులో అప్పు, దానికి వడ్డీ ఎట్లా కట్టగలను? వ్యవసాయం కూడా అంతంత మాత్రంగా ఉంది. మాకూ ఆడపిల్ల ఉంది దానికి పెళ్లి చెయ్యాలి"

"ఇప్పుడు నా కూతురు పెళ్లి ఎట్లా చేయాలో చెప్పు? నీకు తెలుసుగా నేను దుబాయ్‌లో అంతా పోగొట్టుకుని కట్టుబట్టలతో వచ్చాను. ఇన్నాళ్లు ఇక్కడ బంగారం ఉంది. పిల్ల పెళ్లికి దిగుల్లేదులే

# చతుర ప్రవేశిక

## మార్చి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. పురుషోత్తం తల్లి? | 6. చైతన్యను ప్రేమించింది? |
| జ. | జ. |
| 2. పురుషోత్తం ఎక్కడ వ్యాపారం చేశాడు? | 7. శేషమ్మ కూతురు? |
| జ. | జ. |
| 3. నర్సయ్య సోదరుడు? | 8. 'టు' ఇంటికి తరచూ వచ్చే అతిథి? |
| జ. | జ. |
| 4. కాళిదాసు భార్య? | 9. యిన్‌పింగ్ వృత్తి? |
| జ. | జ. |
| 5. పురుషోత్తం అత్తగారి గ్రామం? | 10. 'వెలుగులో వెలది' నవలా రచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------------వయసు (    )

చిరునామా: ------------------------------------------------

------------------------పిన్‌కోడ్ :                    ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

అనుకుంటున్నాను. ఇప్పుడు అంతా తల్ల కిందులై పోయింది"

"గీతిక పెళ్లికి దిగులెందుకు బావా? మా రాంబాబుకి ఇవ్వు. నువ్వు కట్నం ఏమీ ఇవ్వొద్దు. పెళ్లి ఖర్చులు కూడా నేను భరిస్తాను" చెప్పాడు బాలకృష్ణ.

పురుషోత్తం ముఖం కోపంతో భగభగ మండుతోంది. ఆవేశంతో వెళ్లి బామ్మర్దిని చితకబాదుతాడేమో అని భయపడ్డాడు పక్కన కూర్చున్న నర్సయ్య. అతన్ని కదల నీయకుండా చేతిని పట్టుకున్నాడు వారిస్తు న్నట్టు.

"ఛీ..! నోర్ముయ్యరా వెధవా! ఇంకొక సారి ఆ మాటన్నావంటే చెప్పు తీసుకుని పళ్లు రాలగొడతాను. ఆడపిల్ల సొమ్ము తిని మీరేం బాగుపడతార్రా! విశ్వాసం లేని కుక్కల్రామీరు" అంటూ పురుషోత్తం పెడ బొబ్బలు పెట్టాడు.

సోఫాలోంచి లేచి "పదరా నర్సయ్యా! వీళ్ల మొహాలు చూసినా పాపం చుట్టుకుం టుంది" అంటూ విసురుగా బయటకు నడి చాడు.

నరసయ్య అనుసరించాడు.

బాలకృష్ణ కిక్కురుమనకుండా అట్లాగే కూర్చుండిపోయాడు.

పురుషోత్తం, నర్సయ్య కారెక్కి కూర్చు న్నారు.

"సిటీకి పద" అన్నాడు పురుషోత్తం డ్రైవ ర్‌తో.. కారు కదిలింది.

★ ★ ★

సిటీ చేరాక డిన్నర్‌కి ఒక రెస్టారెంట్ లోకి వెళ్లారు ఇద్దరూ.

"ఒరేయ్ నర్సయ్యా! నువ్వు అంతా గమ నించావు కదా? నీకేం అర్థమైంది చెప్పు? " అడిగాడు పురుషోత్తం.

"వాళ్ల నాన్నకి ఏదో పదవి మీద పిచ్చి ఉండి ఉంటుంది. సమితి ప్రెసిడెంట్ అవ్వాలనుకున్నాడు. ఇప్పుడు రాజకీయం అంటే వ్యాపారమే గదా? దానికీ పెట్టుబడి కావాలి. గెలుస్తానని నమ్మకం ఉండి ఉంటుంది. కూతురి బంగారమే కదా! అని తాకట్టు పెట్టి డబ్బు తెచ్చి ఖర్చుపెట్టాడు. ప్రెసిడెంట్ అయ్యాక సంపాదించి విడిపిం చొచ్చు అనుకున్నాడు. ఓడిపోవడంతో తల్ల కిందులయ్యాడు. ఆ దిగులుతో పోయాడు. పాపం మీ బామ్మర్ది ఇరుక్కు న్నాడు. ఇదిగాక ఇంకా అప్పులు నెత్తిన పడ్డాయేమో? " అన్నాడు నర్సయ్య.

పురుషోత్తం పకపకా నవ్వాడు. "నీ మొహం! నీకేం అర్థం కాలేదు" అన్నాడు.

నర్సయ్య తెల్లమొహం వేశాడు.

"బంగారం తాకట్టు పెట్టింది మా మామ కాదు వీడే"

"ఔనా? !"

"నేను డాక్యుమెంట్లు తెప్పిస్తే ఆ సంగతి బయట పడుతుంది. నేను నిలదీశాన నుకో. మా నాన్న తెమ్మన్నాడు. నేనే వెళ్లి బంగారం తాకట్టుపెట్టాను. డబ్బు తెచ్చి మా నాన్నకు ఇచ్చాను అని చెప్తాడు"

"అలాగా? "

"అంతేకాదు, ఆ బంగారం విడిపించి తెచ్చి మనకు ఇవ్వడం వాడికి చిటికెలో పని"

"నేనూ మొదట్లో మీ బామ్మర్ది ఏదో మాయ చేస్తున్నాడనిపించింది. కానీ తర్వాత అతను చెప్పిందంతా నిజమేనేమో అనుకున్నాను"

"వాడికి నా మీద కోపంగా ఉంది"

"నీ మీద కోపం ఎందుకు? "

"దానికి కారణం ఉంది" అని చెప్పడం మొదలుపెట్టాడు పురుషోత్తం.

"మా మామ చనిపోయినప్పుడు పిల్లల్ని తీసుకుని ఇక్కడికి వచ్చాను. అప్పుడు పది హేను రోజులు ఉన్నాం. పెద్దదినం అయ్యే వరకు ఉండాలని ప్లాన్ చేసుకుని వచ్చాను. అప్పటికే అన్నపూర్ణ చనిపో యింది గదా! దుబాయ్‌లో పిల్లలు లోన్లీనెస్ ఫీలవుతున్నారని తీసుకొచ్చాను.

నేను ఒక్కడినే వచ్చి వెళ్లినా సరిపోయేది. రాకపోకలుంటేనే గదా బంధుత్వాలు నిలిచేది అనే ఆలోచన నాది. మా బామ్మర్ది అప్పుడు అడిగాడు గీతికను, రాంబాబుకి ఇవ్వమని. 'తల్లిలేని పిల్ల మేం కడుపులో పెట్టుకుంటాం. గీతికను చూస్తుంటే మా అక్కని చూసినట్టే ఉంటుంది. మా అక్క ఇంట్లోనే తిరుగుతున్నట్టు ఉంది, ఇప్పుడు గీతిక ఇక్కడ ఉంటే' అని ఏదేదో చెప్పాడు. వాడి భార్యకు కూడా గీతిక అంటే చాలా ఇష్టం. వాళ్లు ఆశపడ్డారు కోడల్ని చేసుకోవాలని. అయితే ఆశపడడానికి కూడా అర్హత ఉండాలి కదా! రాంబాబు టెన్త్ తప్పి ఊళ్లో వ్యవసాయం చేసుకుంటున్నాడు. మరి గీతిక ఎంత చదువు చదివింది, నీకు తెలుసుగదా! ఎంత మేనమామ కొడుకు, వరసైన వాడూ అయినా ఎట్లా ఇష్టపడుతుంది? మాకు ఇష్టం లేదని చెప్పేశాం. అది వాడికి కోపం. నేను దుబాయిలో దివాలాతీసి వచ్చాను, ఆర్థికంగా దెబ్బతిని ఉన్నాను కాబట్టి, వాడు ఇట్లా నాటకం ఆడుతున్నాడు. నాకు దిక్కులేదు, గతిలేదు కదా! అని వాడికి పిల్లనిస్తానని అనుకుంటున్నాడు. వాడేదో సూపర్‌ప్లాన్ వేశానని సంబరపడుతున్నాడు. నేను ఈరోజు కాకపోయిన రేపైనా దిగివస్తానని, వాడి కొడుక్కి నా కూతుర్ని చేసుకోమని అడుగుతానని ఆశపడుతున్నాడు. చీప్ ట్రిక్స్! నా దగ్గర వాడి ఆటలు సాగవు"

"బంగారం వాడి దగ్గర ఇరుక్కుంది. వాళ్లకి ఇచ్చినట్టు నీ దగ్గర ఆధారం ఏం ఉంది? పోలీస్ కంప్లయింట్ ఇవ్వాలన్నా, కోర్టుకి వెళ్లాలన్నా ఏదైనా ఉండాలి కదా? " అన్నాడు నర్సయ్య.

"ఏ ఆధారం లేని మాట నిజమే! అయితే అంతరాత్మ అని ఒకటి ఉంటుంది. ఆడపిల్ల సొమ్ము తినగూడదని మన సంస్కృతి. కక్కుర్తి పడి తిన్నా వాళ్లకి మనసులో పీకుతూంటుంది. చేసింది అన్యాయం అని మనస్సాక్షికి తెలుసు. ఏదొక రోజున వాళ్లల్లో పశ్చాత్తాపం కలగక మానదు. అది నా నమ్మకం. వాళ్లనేదో చేయాలనీ, కోర్టుకు ఈడ్వాలనీ నాకేం లేదు. ఐ డోంట్ కేర్!"

"ఇన్నాళ్లూ బంగారం ఉందని, పిల్ల పెళ్లికి దిగులు లేదని ధీమాగా ఉన్నావు. ఇప్పుడేం చేస్తావు" అడిగాడు నర్సయ్య.

"చూద్దాం! దీపిక పెళ్లికి ఇంకా టైమ్ ఉంది. తను కొంతకాలం జాబ్ చేయాలనుకుంటోంది. త్వరలోనే హైదరాబాద్ వెళ్లిపోతాం" చెప్పాడు పురుషోత్తం.

డిన్నర్ పూర్తయ్యాక తిరుగు ప్రయాణం మొదలుపెట్టారు. తెల్లవారు జాముకు కారు చిలుమూరు చేరుకుంది.

"రేపు పగలంతా రెస్ట్ తీసుకోవాలిరా! నర్సయ్యా! బాగా అలిసిపోయాను. అసలే వంట్లో బాగాలేదు" అన్నాడు పురుషోత్తం.

"థాంక్స్ రా! మా అన్నయ్య బాగా సంతోషించాడు. వదినైతే నిన్ను ఎంత మెచ్చుకుందో? సరిత హేపీ! నేను నిన్ను వెంట పెట్టుకుని వెళ్లడం మంచిదైంది. నేను ఒక్కడ్నే వెళ్తే సీన్ మారిపోయి ఉండేది. నువ్వన్నట్టు వాళ్ల కాళ్లావేళ్లాపడి బతిమాలేవాడిని. వాళ్లు కొండెక్కి కూర్చునే వాళ్లు" చెప్పాడు నర్సయ్య.

"కీలెరిగి వాత పెట్టాలన్నారు. అసలుకు

## కొత్తగాలి...

**స్వర్గానికి**
**ఎవరు వెళతారు?**
**నేను(అహం) పోతే**
**పోతాను!**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

ఎసరు పెడితేగానీ దిగిరారు మనుషులు. మనం పిల్ల కాపురం గురించి వర్రీ అవుతున్నామని పసికట్టారనుకో, భయపెడతారు, బెదిరిస్తారు. మనం తెగించి ఉన్నామని అనుకుంటే బిత్తరపోతారు. ఒక్కోసారి డిఫెన్స్ ఆడాలి" అని నవ్వాడు పురుషోత్తం.

రెండు రోజులు తర్వాత పురుషోత్తం ఒక్కడే గుంటూరు వెళ్లాడు. కొత్తపేటలో స్మిత డయాబెటిక్ సెంటర్లో కూర్చుని ఉంటే నవనీతరావు వచ్చి పలకరించాడు.

"పురుషోత్తం..! ఎన్నాళ్టికి కనిపించావురా? " అన్నాడు పక్కనే కూర్చుని భుజం తట్టి.

"ఏరా నవనీతం బాగున్నావా? నన్ను గుర్తుపట్టావా? "

"ఎందుకు గుర్తుపట్టనూ? నీ మొహం ఏం మారలేదు. కాస్త లావయ్యావు అంతే"

"నువ్వు కూడా పెద్దగా మారలేదులే! కాకపోతే జుట్టు ఊడి బట్టతలయింది"

"పోతేపోయిందిలే వెధవ జుట్టు! ఏంట్రా సంగతులు? ఎలా ఉన్నావు? దుబాయ్‌లో సెటిలయ్యావటగా? "

"సెటిలైంది ఏం లేదు. మళ్ళీ తిరిగి వచ్చేశా!" అంటూ జరిగింది చెప్పాడు పురుషోత్తం.

"అరెరె..! మాకు జరిగినట్టే మీకూ జరిగిందన్నమాట!" అన్నాడు నవనీతం.

"మా నాన్న రిటైరైన తర్వాత ఎక్కడైనా స్కూల్లోనో, జూనియర్ కాలేజీలోనో చేరొచ్చుగదా! ఇంగ్లీషు బాగా చెప్తారని పేరుంది. ఎవడి దగ్గరో చేరడం ఎందుకు? మనమే సొంతంగా కాలేజీ పెడదాం అని మొదలుపెట్టాడు. నాలు గేళ్ళు తిరిగేసరికి అంతా లాస్. చిన్న చెల్లెలికి పెళ్ళికాలేదు అప్పుడు. ఇల్లు తాకట్టు పెట్టి పెళ్ళి చెయ్యాల్సి వచ్చింది" అని నిట్టూర్చాడు నవనీతం.

ఆదినారాయణ మాష్టారి కొడుకే నవనీతం. ఇంటర్ చదివేటప్పుడు క్లాస్‌మేట్. తర్వాతి ల్యాబ్ టెక్నీషియన్ అయ్యాడు.

"నీతోపాటు మీ ఇంట్లోవుండి చదువుకునేవాడు చూడు వీర్రాజు. మీ మేనత్త కొడుకు. ఇప్పుడు ఎక్కడ వుంటున్నాడు? ఏం చేస్తున్నాడు? " అడిగాడు పురుషోత్తం.

"వాడా! వాడొక విశ్వాస ఘాతకుడురా! తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టేరకం" మండి పడ్డాడు నవనీతం.

"ఏం జరిగిందిరా? "

"మా నాన్న, చెల్లెలి కొడుకని చేరదీసి ఇంట్లో పెట్టుకొని చదివించాడు. ఇంట్లో తింటూవున్నాడు. బుక్స్, ఫీజులు అన్నీ నాన్నే ఏర్పాటుచేశాడు. ఇంటర్ తర్వాత ఇక చదవలేదు. ఒక ఫైనాన్స్ కంపెనీలో పనికి చేరాడు. కొత్తలో వాడిని చూసి జాలి వేసేది. సైకిల్ మీద తిరుగుతూ అప్పులు ఇచ్చిన వాళ్ళ దగ్గర వసూలుకి పోయేవాడు. డైలీ ఫైనాన్స్ వసూలు, చిన్న చిన్న బిజినెస్‌లు చేసుకునే తోపుడు బళ్ళ వాళ్ళు, బడ్డీకొట్లు, బజ్జీలు వేసుకునే వాళ్ళే కష్టమర్లు! ఇంకెక్కడన్నా జాబ్ చూసుకోరాదురా? ! అంటే 'ఎక్కడున్నాయిరా జాబ్స్? ' అనేవాడు. అట్లా తిరిగి తిరిగి అదే కంపెనీలో ఆఫీసు పనికి ప్రమోషన్ ఇచ్చారు. ఆ ఫైనాన్స్ కంపెనీలో ఒక పార్టనర్ విడిపోయి కొత్తకంపెనీ పెట్టాడు. వీడిని తీసుకెళ్ళి మేనేజర్‌ని చేశాడు. ఇక వాడి దశ తిరిగిందిరా! ఆయనకి ఒక్కతే కూతురు. వీడి నమ్మకం చూసి పెళ్ళి చేసి అల్లుణ్ణి చేసుకున్నాడు. ఆయన పోయాడు. వీడు ప్రొప్రయిటర్ అయ్యాడు"

"మొత్తానికి బాగుపడ్డాడు! హేపీ! నువ్వేంట్రా వాడిని విశ్వాసఘాతకుడు, కృతఘ్నుడు అని తిడుతున్నావు. మీకేం కీడు చేశాడు? " అడిగాడు పురుషోత్తం.

"మా నాన్న వీడికి చదువు చెప్పించాడు కదా! స్వయానా చెల్లెలి కొడుకు కదా! కాలేజీ పెట్టి దెబ్బతిన్నాడు. కూతురు

పెళ్ళికి అప్పుకావాలని వెళ్తే, ఇల్లు తాకట్టు పెట్టుకుని ఇచ్చాడ్రా డబ్బు!" అన్నాడు నవనీతం.

నవనీతం కోపం ఏమిటో పురుషోత్తంకి అర్థమైంది. ఎంత మేనల్లుడైనా డబ్బు దగ్గర బంధుత్వం ఎందుకు చూస్తాడు! వ్యాపారంలో మొహమాటం ఏం వుంటుంది? వీర్రాజుని, వీడు సరిగా అర్థం చేసుకోలేదని అనిపించింది పురుషోత్తంకి. వీర్రాజు అడ్రస్ అడిగి తీసుకున్నాడు.

ఆదినారాయణ మాష్టారు మేనల్లుడిని చేరదీసి చదువుకి సహాయం చేసిన మాట వాస్తవమే. ఆయనకు ఆర్థికావసరం వచ్చినప్పుడు ఆదుకోవడం ధర్మమే. ఈ రోజుల్లో చేసిన మేలు ఎందరు గుర్తుంచుకుంటున్నారు? ఆదినారాయణ మాష్టారు మేనల్లుడు తనకు ముందు ముందు ఏదో సహాయం చేస్తాడనే ఆశతో చదువు చెప్పించలేదు. వీర్రాజు కూడా మరీ స్వార్థపరుడు కాదు. ఎటువంటి పరిస్థితుల్లో ఇల్లు తాకట్టు పెట్టుకుని డబ్బు ఇచ్చాడో? అతను నడుపుతున్న ఫైనాన్స్ కంపెనీలో పార్టనర్లు వున్నారేమో?

పురుషోత్తంలో రకరకాల ఆలోచనలు చెలరేగుతున్నాయి. హాస్పిటల్లో పని అయిపోయిన తర్వాత వీర్రాజుని కలుసుకోవడానికి వెళ్ళాడు.

పురుషోత్తంని చూస్తూనే గుర్తుపట్టాడు. "నవనీతం ఇచ్చాడా నా అడ్రస్? " అడిగాడు వీర్రాజు.

"ఔన్రా! హాస్పిటల్లో కనిపించాడు" చెప్పాడు పురుషోత్తం.

వీర్రాజు పురుషోత్తం చేతిని పట్టుకుని తన రూమ్‌లోకి తీసుకెళ్ళాడు. ఏసీ ఆన్ చేశాడు.

"ఏంట్రా పురుషోత్తం కొంచెం నలిగినట్టు కనిపిస్తున్నావే? " అని ప్రశ్నించాడు.

"ఏజ్ అడ్వాన్స్ అయిపోతోంది గదా? జబ్బులు స్టార్ట్ అవుతున్నాయి. పోయేరోజులే కానీ వచ్చేరోజులు కావుగదా? " అన్నాడు వేదాంతి ధోరణిలో.

"ఏంట్రా అప్పుడే వేదాంతం మాట్లాడుతున్నావు? పిల్లల పెళ్ళిళ్ళు చేశావా? ఏంటి ఫ్యామిలీ పరిస్థితి? " అని అడిగాడు వీర్రాజు.

పురుషోత్తం తన గురించి అంతా చెప్పాడు. "ఇక హైదరాబాద్ వెళ్ళిపోతాం రా! పిల్లల కోసం అక్కడ వుండక తప్పదు. ఇన్నిరోజులు మా వూళ్ళోవున్నారంటే నా బలవంతం వల్లనే. మన మూలాలు ఎక్కడ వున్నదీ పిల్లలకు తెలియడం ముఖ్యం. లేకపోతే కొన్నాళ్ళకి బంధువులతో టచ్‌పోతుంది. రక్తసంబంధీకులు కూడా దూరమై పోతారు"

"నిజమేరా పురుషోత్తం. మేమంటే ఇక్కడే పుట్టి పెరిగాం కనుక మార్పులేదు. విదేశాలకు వలసపోయిన మీలాంటివాళ్ళ పిల్లలకు మూలాలు తెలియజేయడం అవసరమే" అన్నాడు వీర్రాజు.

"ఇంకేంట్రా సంగతులు? ఆదినారాయణ మాష్టారు ఎలా వున్నారు? "

"డెబ్బై ఐదేళ్ళు దాటిపోయాయి. బీపీ, సుగరు, మోకాళ్ళనొప్పులు.. ఫరవాలేదు"

"నవనీతం నీ మీద కోపంగా వున్నాడే? "

వీర్రాజు నవ్వాడు.

"ఎవరి స్వార్థానికైనా అడ్డు తగిలితే కోపంగానే వుంటుంది మరి? "

"ఏమైందేం? "

"అన్నదమ్ములిద్దరూ చెల్లెలి పెళ్ళికి ఏ సహాయం చేయలేదు. మావయ్య ఏం చేస్తాడు? తండ్రిగా బాధ్యత వుందిగా? పెళ్ళికి నేనే డబ్బు సర్దాను"

"ఇల్లు తాకట్టు పెట్టుకున్నావని గుర్రుగా వున్నాడు నవనీతం"

"అది పాతబడిపోయిన ఇల్లు. ఇంటికి విలువలేదు. స్థలానికే విలువ. బ్యాంకు వాళ్ళెవరూ ఇవ్వకపోతేనే నాదగ్గరికి వచ్చారు. నేను గనుక మావయ్య దగ్గర

# ఆ లాప్‌టాప్ అతనికెలా ఉపయోగపడింది?



'ఆ లాప్‌టాప్ ఎక్కడిది?' భర్త బంగారాజు ఇంటర్నెట్‌లో అర్ధనగ్న స్త్రీ బొమ్మలను చూస్తున్నాడని ముందురోజే తమ కంప్యూటర్ని అమ్మిన భాగ్యలక్ష్మి అతని చేతిలో లాప్‌టాప్‌ను చూసి విరుచుకుపడింది.

'ఉద్యోగం పోయిన నాకు కంప్యూటరొక్కటే కాలక్షేపమని తెలిసీ పంతం కొద్దీ దాన్ని అమ్మేశావు. పక్కింటి సుందరి రూపంలోనే కాదు, గుణంలోనూ నీకన్నా చాలా మెరుగు! నా ఇబ్బందిని గమనించి ఈ లాప్‌టాప్‌ని ఉచితంగా ఇచ్చింది వాడుకొమ్మని!' విసురుగా చెప్పాడు భార్యకు బంగార్రాజు.

ఇంతకీ సుందరి బంగార్రాజుకు తన లాప్‌టాప్ ఎందుకిచ్చింది? అతనికెలా ఉపయోగపడిందది? ఆర్థికమాంద్యం వల్ల సాఫ్ట్‌వేర్ ఉద్యోగం కోల్పోయినవారి ఇతివృత్తంతో ఆద్యంతం హాస్యపు జల్లుల్లో ముంచెత్తే రెడ్డి శాస్త్రి నవల నిరుద్యోగ రమణీయం

చతుర ఏప్రిల్ కానుక!

ప్రామిసరీ నోటు రాయించుకుని డబ్బు ఇచ్చినట్లయితే వాళ్ళకి సంతోషంగా వుండేది"

"ఇల్లు తాకట్టు పెట్టుకుంటే వాళ్ళకెందుకు బాధ? బ్యాంక్ వాళ్ళయినా మార్టిగేజ్ చేసుకునే గదా! లోన్ ఇచ్చేది"

"అక్కడే వుంది మతలబు. నేను గనుక ఇల్లు తాకట్టు పెట్టుకోక పోయినట్టయితే ఈపాటికి దాన్ని అమ్ముకునేవాళ్ళు. ఇల్లు అమ్మడానికి వీల్లేకుండా వుందనే వాళ్ళ ఏడుపు" అని నవ్వాడు వీర్రాజు.

పురుషోత్తంకి నవనీతం బాధ అర్థమైంది. "ఇటువంటిది ఏదో వుందనుకున్నాలే!" అన్నాడు.

"ఇల్లు అమ్మేవరకు మా దగ్గర వుండొచ్చు నాన్నా! అని ప్రేమ ఒలకపోసేవాళ్ళు. తల్లీతండ్రీ ఇంటికి వచ్చాక అన్నదమ్ములు వంతులు వేసుకునేవాళ్ళు, 'అమ్మ నా దగ్గర, నాన్న నీ దగ్గర' అని.. ఎంత మందిని చూడ్డం లేదూ? మావయ్యకి అటువంటి పరిస్థితి రాకూడదని పట్టు బిగించాను. వాళ్ళున్నంత కాలం అందులోనే వుంటారు" చెప్పాడు వీర్రాజు.

ఈసారి గుంటూరు వచ్చినప్పుడు మళ్ళీ కలుస్తాలే" అన్నాడు పురుషోత్తం.

వీర్రాజు గేటు వరకూ వచ్చి సాగనంపాడు.

"నీకు ఎప్పుడైనా డబ్బు అవసరమైతే ఫోన్ చెయ్యి.. పంపిస్తాను. మొహమాట పడకు. ఏదైనా అవసరం వున్నప్పుడు నేనున్నానని గుర్తు పెట్టుకో" పురుషోత్తం భుజం తట్టి ఆప్యాయంగా చెప్పాడు వీర్రాజు.

"అలాగేరా! మాటన్నావు అంతే చాలు. నేను దివాలా ఎత్తానని, అందరూ మొహం చాటేస్తున్నారు. నాకేదైనా చెయ్యాల్సి వస్తుందని భయపడుతున్నారు. నువ్వే నయం" అన్నాడు పురుషోత్తం.

"చిన్ననాటి స్నేహితులం. ఆ మాత్రం చేయకపోతే ఎందుకు?"

"ఓకేరా! వస్తాను" అన్నాడు.

"కారు పంపనా? బస్టాండ్ కేగా?"

"వద్దురా! దగ్గరేగా! నడిచిపోతాను. కాస్త వంటికి ఎక్సర్‌సైజ్" అని బయల్దేరాడు పురుషోత్తం.

★ ★ ★

హైదరాబాద్ వెళ్లటానికి సర్దుకున్నారు చైతన్య, గీతికలు. పురుషోత్తం కూకట్‌పల్లిలో ఒక డబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ అద్దెకు తీసుకున్నాడు. గీతిక పికాక్ ఫ్యాషన్స్ కంపెనీలో చేరింది. కంప్యూటర్ కోర్సులే కాకుండా ఫ్యాషన్ డిజైనింగ్‌లో డిప్లొమా ఉంది ఆమెకు. సాఫ్ట్‌వేర్ కంపెనీలలో కంటే గార్మెంట్ కంపెనీలో వర్కు ఇంట్రెస్టింగ్‌గా ఉంటుందని గుండ్ల పోచంపల్లిలోని కంపెనీలో చేరింది. ఆమెకు క్వాలిటీ కంట్రోల్ విభాగంలో పోస్టింగ్ ఇచ్చింది కంపెనీ.

చైతన్య స్పెక్ట్రామ్ సొల్యూషన్స్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా చేరాడు. గీతికకు కంపెనీ బస్సు వస్తుంది అప్ అండ్ డౌన్. చైతన్య ఆఫీసు మాదాపూర్. తను బైక్ కొనుక్కుని వెళ్లి వస్తున్నాడు.

కొడుకు, మనుమడు, మనుమరాలు వెళ్లిపోతుంటే కళ్లనీళ్లు పెట్టుకుంది శేషమ్మ. మరమ్మతులు చేయించి రంగులు వేయించిన తర్వాత ఇంటికి కళ వచ్చింది. కానీ కళకళలాడుతూ కళ్లముందు తిరుగుతున్న పిల్లలు వెళ్లిపోతుంటే శేషమ్మ ముఖం కళ తప్పింది.

"అమ్మా! నువ్వేం బాధపడకు! నేను, పిల్లలు నీతో రోజూ మాట్లాడుతుంటాం. అవసరమైతే వస్తాం" అని ఓదార్చాడు పురుషోత్తం తల్లిని.

శేషమ్మకి తోడుగా వెంకటరత్నం అనే ఆవిడను మాట్లాడాడు. ఆమెను భర్త వదిలేశాడు. పిల్లలు లేరు. ఒంటరిగా ఉంటోంది. ఇంట్లోనే తింటూ ఉండడానికి ఏర్పాటు చేశాడు. తిండి, బసకు ఏర్పాటు చేసి నెలకు వెయ్యి రూపాయల జీతం వెంకటరత్నానికి. సంతోషంగా ఒప్పుకుంది. ఇంట్లో ల్యాండ్‌లైన్ టెలిఫోన్ పెట్టించాడు.

పిల్లలిద్దరూ బిజీ అయిపోయారు ఉద్యోగాలకు వెళ్తూ. ఒక్కసారిగా తను ఒంటరి అయిపోయినట్టు ఫీలయ్యాడు పురుషోత్తం.

కూకట్‌పల్లిలో పురుషోత్తానికి అద్దె ఇల్లు ఇప్పించింది కాళిదాసు. ఇద్దరూ నాగార్జున సాగర్ డ్యామ్‌లోనే జూనియర్ ఇంజనీర్‌గా కెరీర్ ప్రారంభించారు.

పురుషోత్తం ఫ్యామిలీ ఎదురింట్లో దిగుతున్నప్పుడు చూసింది అలకనంద. "ఏమండీ! ఎదురింట్లోకి ఎవరో కొత్తవాళ్లు దిగుతున్నట్టున్నారండీ!" అని కాళిదాసుకి చెప్పింది.

కాళిదాసు ఆఫీసుకు వెళ్లే హడావుడిలో ఉన్నాడు. ఇంటి ముందు కారు సిద్ధంగా ఉంది. అతను ఇప్పుడు సూపరింటెండెంట్ ఇంజనీర్.

"కొత్తవాళ్లు కాదే పాతవాళ్లే. పురుషోత్తం! సాగర్లో నాతోపాటు పనిచేశాడు. గుర్తుపట్టలేదా? నువ్వు 'అన్నయ్యా! అన్నయ్యా!' అనే దానివి. మన పెళ్లిచేసింది వాడేగా!" అని పకపకా నవ్వాడు కాళి

## కొత్తగాలి...

**జిమ్ముల్లో లేని**
**దమ్మున్న సాధనాలు!**
**రుబ్బురోలు.. తిరగలి**
**కవ్వం.. కల్వం .. చేద**

– కృష్ణ మాదవరపు, కాకినాడ

దాసు.

"ఓ పురుషోత్తం అన్నయ్యా! ఇరవై ఏళ్ల యిపోయిందేమో చూసి గుర్తుపట్టలా!" అంది అలకనంద.

"ఆc వాడే! డిపార్టుమెంట్‌లో గొడవలు తట్టుకోలేక ఉద్యోగానికి రిజైన్ చేశాడు. దుబాయ్ వెళ్లిపోయాడు. అక్కడ కొన్నాళ్లు ఉద్యోగం చేశాడు. తర్వాత పార్టనర్లతో కంపెనీ పెట్టాడు. కోట్లు సంపాదించాడు. అయితే ఇప్పుడేం లేదు. పార్టనర్లు మోసం చేశారనీ, కంపెనీ దివాలా ఎత్తిందనీ అంటున్నాడు. ఎట్లాగోట్లా జాబ్‌లో ఉన్నా హేపీగా ఉండేవాడు. చీఫ్ ఇంజనీర్‌గా రిటైరయ్యేవాడు. ఇప్పుడు అటూఇటూ కాకుండా పోయాడు. పాపం అతని భార్య కూడా చనిపోయింది" చెప్పాడు కాళిదాసు.

"అయ్యో! అన్నపూర్ణ పోయిందా? చాలా మంచిదండీ! పిల్లలకు పెళ్లిళ్ల య్యాయా? "

"లేదు. అమ్మాయి, అబ్బాయి జాబ్స్‌లో చేరారు. ఇక చెయ్యాలి పెళ్లిళ్లు" అన్నాడు.

కాళిదాసు హడావిడిగా కారెక్కి వెళ్లిపో యాడు.

అలకనంద ఎదురింటికి వెళ్లింది.

"అన్నయ్యా! బాగున్నారా! ఇప్పుడే ఆయన చెప్పారు మీగురించి. పాపం వదిన పోయిందటగా? " అంటూ పలకరిం చింది.

"ఏదో! ఇలా ఉన్నాం" అని గీతికను, చైతన్యను పిలిచి అలకనందకు పరిచయం చేశాడు.

"అన్నయ్యా! ఈ ఏరియా మీకు కొత్త. ఏం కావాలన్నా మొహమాట పడకండి. నన్ను అడగండి" అంది.

పిల్లలతో కాసేపు మాట్లాడి వెళ్లిపో యింది.

ఇంటికి వెళ్లిన తర్వాత అలకనందకు పాతరోజులు గుర్తొచ్చాయి.

అలకనంద తండ్రి నాగార్జునసార్‌లో సీనియర్ అసిస్టెంట్. అప్పట్లో ఆమె బి.ఎస్సీ చదువుతోంది. రైట్ బ్యాంక్‌లో రెసిడెన్షియల్ డిగ్రీ కాలేజీలో తను డే స్కాలర్. రోజూ బస్సులో వెళ్తుండేది. కాళి దాసు సైట్‌లో పనిచేస్తుండేవాడు. జీప్‌లో వెళ్తూ ఆమెకు లిఫ్ట్ ఇస్తుండేవాడు. అలా పరిచయమై ప్రేమలోకి దారి తీసింది. అప్పట్లో అతను తనను పెళ్లి చేసుకుం టాడా? లేదా? అని ఆలోచించలేదు. ప్రేమలో మత్తు అలాంటిది. కాళిదాసు వాళ్లు ధనవంతులు. తన తండ్రిది నెల జీతం మీద గడిపే కుటుంబం. ఇంటి అవ సరాలే అంతంత మాత్రంగా గడిచేవి. ఇంట్లో తల్లిదండ్రులు లోపల బెడ్‌రూమ్‌లో పడుకునేవాళ్లు రాత్రిళ్లు. ముందు గదిలో తను, తన తమ్ముడు నిద్రపోయేవాళ్లు. కాళిదాసు ఒంటరిగా ఉండేవాడు. కొన్నాళ్లకి అతనితో శారీరక సంబంధం ఏర్పడింది. రాత్రిళ్లు నెమ్మదిగా తలుపు తీసుకుని కాళి దాసు ఇంటికి వెళ్లేది. ఏ అర్ధరాత్రో ఇంటికి వచ్చి ఏమీ ఎరుగనట్టు పడుకునేది. తమ్ముడు ఎక్కడికి వెళ్తున్నావని నిలదీస్తే, వాడికి చాక్లెట్లు లంచం ఇచ్చేది. ఇలా జరి గిపోతూ ఉండగా ఒకరోజు తండ్రికి ఆయాసం ఎక్కువైంది. ఆయనకు ఆస్మా ఉంది. తల్లి అంబులెన్స్‌కి ఫోన్ చేసి తెప్పించింది. ముందుగదిలో కొడుకు ఒక్కడే ఉన్నాడు. కూతురు లేదు. అప్పుడు బయటపడింది అలకనంద, కాళిదాసుల సంగతి.

ఆ పక్కింట్లోనే ఉండేవాడు పురుషోత్తం. అతనికి సంగతి తెల్సింది. కాళిదాసు ఇంటికి పోయి అలకనందను తీసుకుని వచ్చాడు. ఆమె ఒకటే ఏడుస్తోంది. తల్లినో టికి వచ్చినట్టు తిడుతోంది.

పురుషోత్తం తల్లికి సర్దిచెప్పాడు. అలక నందను ఓదార్చాడు. కాళిదాసుతో పెళ్లి గురించి మాట్లాడతాననీ గొడవ చేసుకోవ ద్దన్నాడు. అయితే అప్పటికే ఆ లైన్‌లో

ఉన్న క్వార్టర్లలో ఉన్నవాళ్లకి తెలిసిపోయింది.

క్వార్టర్స్‌లో ఉన్న వాళ్లంతా ప్రభుత్వోద్యోగులు. అందరికీ అందరితో పరిచయాలు ఉన్నవాళ్లే. కాళిదాసుకి బ్రెయిన్‌వాష్ చేశారు.

"నువ్విప్పుడు పెళ్లి చేసుకోకపోతే అలకనంద సాగర్ రిజర్వాయర్లోకి దూకుతుంది. నీ మీదకు కేసు వస్తుంది. క్రిమినల్ కేసు. నీ ఉద్యోగం ఊడుతుంది"

తన ప్రేమ వ్యవహారం బయటపడి అల్లరవడంతో కాళిదాసు పెళ్లికి తల ఊపక తప్పలేదు. పురుషోత్తమే చొరవ తీసుకుని కాళిదాసు తల్లిదండ్రుల్ని పిలిపించాడు. కట్నాలు, కానుకలు లేవు. గుమాస్తా కూతురు. దిక్కులేని పెళ్లి సంబంధం. అయినా కొడుకు చేసిన తప్పుకు తలవంచక తప్పలేదు. హిల్ కాలనీలోనే ఉన్న సత్యనారాయణ గుడిలో పెళ్లిచేశారు.

అలకనంద హేపీ! ఖర్చులేకుండా ఇంజనీర్ భర్త దొరికాడు. సంవత్సరం తిరక్కుండానే ఆమెకు కొడుకు పుట్టాడు. శ్రీధర్ అని పేరు పెట్టారు. తర్వాత పురుషోత్తం పెళ్లయింది. అతనికి చైతన్య పుట్టాడు. తర్వాత గీతిక పుట్టింది.

అప్పట్లో గీతిక బొద్దుగా, ముద్దుగా బార్బీబొమ్మలా ఉండేది. అలకనంద ఇంట్లోనే తిరుగుతూ ఉండేది.

"గీతికను మా కోడలు చేసుకుంటాను వదినా!" అని అన్నపూర్ణతో అనేది అలకనంద.

"మా గీతికకు కట్నాలు ఇవ్వం. నీకు ఇష్టమైతే చేసుకో" అని అన్నపూర్ణ హాస్యమాడేది.

"నేనేం కట్నం తెచ్చాను? మా కోడలే కట్నం" అనేది అలకనంద.

ఆ రోజులన్నీ గుర్తొచ్చాయి అలకనందకు. అయితే అప్పటి జూనియర్ ఇంజనీర్ కాళిదాసు భార్య వేరు. ఇప్పటి సూపరింటెండెంట్ ఇంజనీర్ కాళిదాసు భార్య అలకనంద వేరు. కోట్లకు పడగలెత్తిన ఇతరులతో పోల్చుకోవడం, కొలతలు వేసుకోవడం అలవాటైంది. గతంలో పురుషోత్తం దగ్గరుండి తమ పెళ్లిచేయడం కేవలం తన అదృష్టంగా భావిస్తోంది ఆమె.

★ ★ ★

పురుషోత్తం, పిల్లలు క్రమంగా నగర జీవితానికి అలవాటు పడుతున్నారు. ఒక రోజు పురుషోత్తం కళ్లుతిరిగి పడిపోయాడు. అప్పుడు ఇంట్లో చైతన్య లేడు. గీతిక ఉంది.

"ఆంటీ! డాడీకి సీరియస్‌గా ఉంది" అని వెళ్లి చెప్పింది.

అప్పుడు అలకనంద కొడుకు శ్రీధర్ ఇంట్లోనే ఉన్నాడు. తన కారులో పురుషోత్తంని హాస్పిటల్‌కి తీసుకెళ్లాడు. పురుషోత్తంని అడ్మిట్ చేసుకున్నారు.

"బి.పి. డౌన్ అయింది" అని చెప్పాడు డాక్టర్.

పురుషోత్తంకి సుగర్ ఉంది. దానికి ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాడు. కాళ్ల వేళ్లు, చేతుల వేళ్లు వాస్తున్నాయి. హాస్పిటల్లో దగ్గరుండి అన్ని టెస్టులు చేయించాడు శ్రీధర్. రక్తంలో యూరిక్ యాసిడ్ ఎక్కువుందని బయటపడింది. మందులు రెగ్యులర్‌గా వాడుతూ ఉండమనీ, ఒంటరిగా ఉండొద్దనీ పురుషోత్తంకి సలహా ఇచ్చాడు డాక్టర్. మందులు వాడకుండా నిర్లక్ష్యం చేస్తే కిడ్నీలు ఫెయిలవుతాయనీ, జాగ్రత్తగా ఉండాలనీ వార్నింగ్ ఇచ్చాడు.

పురుషోత్తం హాస్పిటల్లో నాలుగు రోజులు ఉన్నాడు. కాళిదాసు, అలకనంద ఒకరోజు వచ్చి చూశారు.

"పిల్లల పెళ్లిళ్ల గురించి ఏమైనా ఆలోచిస్తున్నావా? అయిన సంబంధాలు ఏమైనా ఉన్నాయా?" అని కాళిదాసు అడిగాడు.

"అటువంటివి ఏమీలేవు. బయట



సంబంధాలు చూడాల్సిందే" చెప్పాడు పురుషోత్తం.

"పెళ్లిళ్లు చేసేస్తే నీ బాధ్యత తీరిపోతుంది" అన్నాడు పురుషోత్తంతో కాళిదాసు.

పురుషోత్తం నవ్వాడు. "సంబంధాలు కుదరాలిగా! నీ దృష్టిలో ఏమైనా వస్తే చెప్పు" అన్నాడు.

కాళిదాసు తల ఊపాడు.

పురుషోత్తం డిశ్చార్జి అయ్యాడు. ఇంట్లోనే ఉంటున్నాడు. కాళిదాసు అప్పుడప్పుడు వచ్చి పలకరిస్తున్నాడు. ఇంటి పనికి, వంటకి మనిషి ఉంది.

కాళిదాసుకి శ్రీధర్ ఒక్కడే కొడుకు. ఎమ్.టెక్ పాసయ్యాడు. జాబ్ చెయ్యడం లేదు. ఇద్దరు స్నేహితులతో కన్‌స్ట్రక్షన్ కంపెనీ నడుపుతున్నాడు. సికింద్రాబాద్‌లో

ఆఫీసు ఉంది.

గీతికతో శ్రీధర్ చనువుగా ఉంటు న్నాడు. అప్పుడప్పుడు శ్రీధర్ కారులో గీతిక వెళ్లడం చూసింది అలకనంద. ఆమెకు తను కాళిదాసుతో ప్రేమలో పడ్డ ప్పటి రోజులు గుర్తొస్తున్నాయి. అప్పటి తన పరిస్థితుల్లోనే ఇప్పటి గీతిక ఉంది. కాళిదాసు స్థానంలో శ్రీధర్ ఉన్నాడు.

అలకనందకు ఈ పరిస్థితి జీర్ణం కావడం లేదు. అప్పట్లో తన పెళ్లి గుళ్లో తూతూ మంత్రంగా జరిగింది. తన కొడుకు పెళ్లి అట్లా జరగటానికి వీల్లేదు. గీతిక తన కోడలు కావడం ఆమెకు ఇష్టం లేదు. ఇప్పుడు తను ఎన్నో పెళ్లిళ్లకు వెళ్తోంది. ఆ పెళ్లిళ్లు ఎంత గొప్పగా జరుగుతున్నాయి? తమకు మాత్రం ఏం తక్కువ? ఆస్తిలేదా? అంతస్తు లేదా? శ్రీధర్ పెళ్లి కూడా అంత వైభవంగా జరగాలి.

ఇప్పుడు పురుషోత్తం దగ్గర ఏం ఉంది? పిల్లల జీతాలతోనే ఇల్లు గడుస్తోంది. స్వగ్రామంలో కూడా ఆస్తులు లేవు. గీతికను చేసుకుంటే ఏవుంటుంది? పెళ్లి ఖర్చులు కూడా తామే భరించాలేమో? ముద్దు ముచ్చట్లు ఏమీ తీరవు.

శ్రీధర్, గీతికతో సన్నిహితంగా ఉండటం అలకనంద భరించలేకపోతోంది. గీతిక ఇంటికి వచ్చినప్పుడు, శ్రీధర్‌తో మాట్లాడుతున్నప్పుడు దగ్గరగా ఉంటోంది. వాళ్ల సంభాషణల్లో గొంతు కలుపుతోంది. గీతిక ఆకర్షణలో పడి 'ఆమెను ప్రేమిస్తున్నాను' అని కొడుకు ఎప్పుడు అంటాడోనని భయపడుతోంది.

అందుకే గీతికతో అంటీ ముట్టనట్టు ప్రవర్తిస్తోంది. ముక్తసరిగా మాట్లాడుతోంది.

"పురుషోత్తంకి అంత పెద్ద ఇల్లు ఎందుకండీ? ఇండిపెండెంట్ ఇంటికి పదిహేను వేలు అద్దె. దండగ కదా? ఐదారువేలకి ఏదైనా అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్ వస్తుంది. అసలే ఇబ్బందుల్లో ఉన్నారు" అంది అలకనంద, కాళిదాసుతో.

"ఉండనీ! పిల్లలకు పెళ్లిళ్లయితే ఫ్లాట్‌లో ఇబ్బంది కదా? " అన్నాడు కాళిదాసు.

శ్రీధర్, గీతికతో సన్నిహితంగా ఉంటున్నాడని, భర్తతో చెప్పాలని అనుకుంది. అయితే తను అతనిలో లేనిపోని ఆలోచనలు కలగడానికి ముట్టించినట్టు అవుతుందని ఊరుకుంది.

'సన్నిహితంగా ఉంటే తప్పేంటి? అప్పట్లో నువ్వూ నేనూ ప్రేమించుకోలేదా? ఇప్పట్లో వీళ్లూ అంతే అంటాడేమో? గీతిక అందంగా ఉంది.. చదువుకుంది. ఇంకేంటి? ' అని వాదిస్తే ఏం చెప్పగలదు?

ఆస్తి, అంతస్తు గురించి తను ఎత్తలేదు గదా?

అలకనంద డొంక తిరుగుడుగా మాట్లాడింది. "మీ చీఫ్ ఇంజనీర్ గారమ్మాయి శ్రావణి చదువు పూర్తయిందా? పెళ్లి సంగతి ఏమంటున్నాడు? "

"శ్రావణి డాక్టర్ ఇన్ ఫార్మసీ చదువుతోంది. ఇంటర్ తర్వాత ఆరేళ్లు. ఇంకా వన్ ఇయర్ ఉందేమో? ఆయనేం మాట్లాడలేదు" అన్నాడు కాళిదాసు.

"శ్రీధర్ పెళ్లి చెయ్యాలి గదా! ఎన్నాళ్లు ఆగుతాం? వాళ్లను ఎట్లా నమ్ముకుం

## కొత్తగాలి...

**ఆమె నవ్వులో జలపాతం!**
**అందుకేనేమో!**
**అతని నడకలో**
**విద్యుత్ ప్రవాహం!**

*– జి.వి.ఎస్. ప్రియంవద,*
*అరసవల్లి*

టాం? చదువు పూర్తయ్యాక కొంతకాలం జాబ్ చేస్తానంటుందేమో ఆ పిల్ల?"

"మనం ఏం చెప్పగలం?"

"శ్రీధర్‌కి సంబంధాలు చూడండి! పెళ్లి చేసేద్దాం!"

"చూద్దాం! నువ్వు కూడా తెలిసిన వాళ్లకి, మన బంధువులకి చెప్పండు. ఎందుకంటే ఇప్పుడు మగవాడికి పెళ్లి చెయ్యడం కష్టంగా ఉంది. ఆడపిల్లలు తగ్గిపోతున్నారు. నా కొలీగ్స్ చాలామంది 'మా వాడికి సంబంధం చూడు' అని చెప్పే వాళ్లే గానీ, 'మా అమ్మాయికి చూడు..' అనేవాళ్లే లేరు" అన్నాడు కాళిదాసు.

అలకనంద సంతోషించింది. భర్త పురుషోత్తం కూతురు సంగతి ఎత్తనందుకు. ఆయనకు మాత్రం గొప్ప సంబంధం కొడుక్కి చేయాలని ఉండదా? ఏం? పురుషోత్తం దగ్గర ఏం ఉంది బూడిద?

భర్తతో అన్నట్టే కొడుకుతో అంది అలకనంద.

"శ్రీధర్, డాడీ వాళ్ల సీఈఓగారమ్మాయి శ్రావణి కోర్స్ అయిపోతోందట. ఈ యేడు పెళ్లి చేద్దామంటున్నారు"

"శ్రావణి ఎవరమ్మా?"

"జూబ్లీహిల్స్‌కి వెళ్లాం గుర్తులేదా? సుదర్శన్‌గారని సీఈఓగారు. ఆయన గృహప్రవేశానికి నువ్వు కూడా వచ్చావుగా! శ్రావణి తెలియకపోవడం ఏంట్రా? మనకి ఇల్లంతా దగ్గరుండి చూపించిందిగా!"

"ఓ..! ఆ అమ్మాయా? పొడుగ్గా, ఎర్రగా కోతిలా ఉంది"

"కోతిలా ఉండడం ఏంట్రా? చక్కగా ఉంటేను!"

"సరదాగా అన్నాలేమ్మా! ఆ పిల్ల నవ్వితే పళ్లు బయటపడి కోతిలా కనిపించింది" అన్నాడు శ్రీధర్ నవ్వుతూ.

"తప్పు! ఆడపిల్లల్ని అట్లా ఎగతాళి చెయ్యగూడదు. రేపు నీకూ అట్లా కోతి లాంటి పిల్ల పుడుతుంది" అంది.

"ఆ పిల్లని చేసుకుంటే అంతే మరి!"

## డ్రా చేస్తుంటాడా?

ఒకసారి ఏర్‌దక్కన్‌కు చెందిన అధికారి ఒకరు ఆర్.కె.లక్ష్మణ్ కామన్‌మేన్‌ను తమ ఏర్‌లైన్స్ లోగోగా వాడుకునే నిమిత్తం అనుమతికోసం ఆయన ఇంటికి వెళ్లారు.



ఆ అధికారిని సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు చేసిన ఆర్.కె.లక్ష్మణ్ అతనితో ఎన్నో విషయాలు చర్చిస్తున్నారు.

ఆ సమయంలో ఆర్.కె. లక్ష్మణ్ కొడుకు కూడా ఏదో రాసుకుంటూ అక్కడే కూర్చుని వుండటాన్ని ఆ అధికారి గమనించారు. వెంటనే ఆయన ఆర్.కె.తో 'మీ పుత్రుడు కూడా ఏమైనా డ్రా(గీయడం) చేస్తుంటాడా?' అని అడిగాడు.

దానికి లక్ష్మణ్ నవ్వుతూ 'ఆ..ఆ.. బాగానే డ్రా చేస్తుంటాడు. బ్యాంకులోంచి తన పాకెట్ మనీకోసం నేను కూడబెట్టిన డబ్బును డ్రా చేస్తాడు' అని సమాధానమిచ్చారు.

అన్నాడు శ్రీధర్.

కొడుకు మనసులో కూడా గీతిక లేదని సంతోషించింది అలకనంద. అటువంటిది ఏదైనా ఉంటే బయటపడేవాడే కదా! అయితే ఆమెకు వేరే భయం ఉంది. కొడుకు మంచివాడే. కానీ గీతిక వీడిని బుట్టలో వేసుకుంటే? సినిమాలకు, షికార్లకు తిప్పుతూ, 'ఐ లవ్ యు శ్రీధర్!' అంటే, వీడు ఫ్లాట్ అయిపోతే? గీతిక మనసులో వీడున్నాడేమో?

ఒకరోజు అలకనంద ఇంటికి వచ్చింది. పురుషోత్తం టీవీ చూస్తున్నాడు. ఆమె అతన్ని పలకరించి, గీతికతో నవ్వుతూ

అంది "గీతికా! ఈరోజు నాకు నీ కంపెనీ కావాలి"

"ఏంటి ఆంటీ సంగతి? "

"ఏంలేదు. ఒక పెళ్లికి వెళ్లాలి. అంకుల్‌కి తీరికలేదు. శ్రీధర్ ఊళ్లో లేడు. తప్పకుండా వెళ్లాల్సిన పెళ్లి. నువ్వు నాతో తోడు రావాలి" అంది.

"ఆంటీతో వెళ్లమ్మా! విందు భోజనాలకి వెళ్దామంటే కాదనగూడదు" అన్నాడు పురుషోత్తం నవ్వుతూ.

గీతిక డ్రెస్ మార్చుకుని అలకనంద వెంట బయల్దేరింది.

హైటెక్స్‌లో పెళ్లి. ఆ ప్రాంతమంతా పట్టపగల్లా విద్యుత్ దీపాల వెలుగులతో ధగధగలాడుతున్నాయి. వీఐపీలు వచ్చినప్పుడల్లా పోలీసులు విజిల్స్ ఊదుతూ హడావుడి చేస్తున్నారు. కారు పార్కు చేయడానికే పావుగంట పట్టింది. వందల కొద్దీ రకరకాల కార్లు. అదొక కార్ల సముద్రంలా ఉంది.

కారు దిగి లోపలకు వెళ్లారు. పెళ్లి మండపం ఎక్కడో దూరంగా ఉంది. చుట్టూ ఉన్న టెలివిజన్లలో పెళ్లితంతు కనబడుతోంది. వేదిక మీద ఉన్న యాంకర్ వీఐపీలు వచ్చినప్పుడు వారిని పొగుడుతూ ఉంది. క్రేన్ చుట్టూ తిరుగుతూ వీడియో రికార్డింగ్ చేస్తోంది.

ఇక పెళ్లి తర్వాత వధూవరులను ఆశీర్వదించడానికి చాలా పెద్ద క్యూ ఉంది. అది ఎంతకీ తరగడం లేదు. వెళ్లినవాళ్లు ఫొటోలు దిగడానికి టైమ్ పడుతోంది. నిలబడి నిలబడీ గీతికకి కాళ్లు పీకుతున్నాయి.

"మనం వెళ్లి అక్షింతలు వెయ్యకపోతేనేం ఆంటీ? " అంది గీతిక విసుగ్గా.

"భలేదానివే! ఫొటోలు దిగొద్దూ! రేపు వాళ్లు ఆల్బం తయారు చేస్తున్నప్పుడు మన ఫొటోలు లేకపోతే పెళ్లికి రాలేదనుకుంటారు" అంది అలకనంద.

వధూవరులకు అక్షింతలు వేసి భోజనాలకు వెళ్లారు. అక్కడొక సంతలా ఉంది. జనం పెద్దపెద్ద క్యూలలో షాపుల వంటి వడ్డించే కేంద్రాల దగ్గర ప్లేట్లు పట్టుకుని నిలబడి ఉన్నారు. రకరకాల క్యూలు. వెజిటేరియన్ క్యూ, నాన్‌వెజ్ క్యూ, చాట్ క్యూ, ఐస్‌క్రీమ్, ఫ్రూట్ సలాడ్ క్యూలు. వేలమంది ఎగబడి క్యూలలో తోసుకుంటున్నారు. ఎక్కడబడితే అక్కడ నిలబడి తింటున్నారు. ఆడ, మగ, పిల్లలు, ముసలివాళ్లూ అంతా నిలబడే.

గీతికకు విరక్తి పుడుతోంది తిండి మీద. బాగా అలసట కలుగుతోంది.

"ఎంత గ్రాండ్‌గా జరుగుతోందో చూశావా? పెళ్లంటే ఇట్లా చెయ్యాలి. మా శ్రీధర్ పెళ్లి కూడా ఇక్కడే చేస్తాం. పెళ్లి ఖర్చులు ఏభై లక్షల పైనే అవుతుందట ఇక్కడ" గీతికతో అంటోంది అలకనంద.




కాళిదాసు తమ్ముడి కూతురు స్వప్న గైనకాలజీలో పీజీ చేసింది. కూకట్‌పల్లిలోనే కొత్తగా ప్రారంభించిన సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ మహతిలో డాక్టర్‌గా చేరింది. ప్రస్తుతం పెద్దనాన్న ఇంట్లోనే ఉండి డ్యూటీకి వెళ్తోంది.

పురుషోత్తం కుటుంబానికి బాగా దగ్గరైంది. గీతికతో ఆమెకు స్నేహం కుదిరింది. చైతన్యతో చనువు పెరిగింది. జోక్స్ వేస్తూ ఆటపట్టిస్తూంటుంది.

"మీ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు వీక్ఎండ్ పార్టీలని పబ్బులకెళ్లి తాగి తందనాలాడతారంటగా? నువ్వేంటి సాటర్‌డే ఇంటికొచ్చేశావు?" అని చైతన్యని అడిగింది స్వప్న.

"అదంతా ఎవరు చెప్పారు నీకు?"

"మొన్ననే న్యూస్‌లో చూశా! ఒకమ్మాయి తాగి రోడ్డు మీదనే తందనాలాడుతోంది. పోలీసుల్ని బూతులు తిడుతోంది. ఒంటి మీద బట్టలున్నాయో లేదో కూడా చూసుకోవడం లేదు. చూడలేక చావుకొచ్చింది"

"ఎవరో అతిగా ఉంటార్లే! అందర్నీ అంటే ఎలా? మీ డాక్టర్లంతా మంచాళ్లా? ఏం? చచ్చిన శవానికి వైద్యం చేసినట్టు డ్రామాలాడ్డం లేదూ?"

"ఏంటి బాబూ! సినిమాలో చూశావా?" అని పకపకా నవ్వింది స్వప్న.

"సినిమాల్లోనే కాదు. నేనూ న్యూస్ చదివా!" అన్నాడు చైతన్య.

స్వప్న పురుషోత్తంకి ఇంజక్షన్ ఇవ్వడం, బి.పి., షుగర్ టెస్ట్ చేయడం, మెడిసిన్స్ తెచ్చివ్వడం చేస్తోంది.

"అంకుల్ మీరేం వర్రీ కావద్దు. ఇప్పుడు చాలా లేటెస్ట్ పవర్‌ఫుల్ మెడిసిన్స్ వచ్చాయి. ఎప్పుడూ కొత్తవి కనిపెడుతూనే ఉంటారు. మార్కెట్‌కి వస్తుంటాయి. కేన్సర్ కూడా ఎర్లీ స్టేజిలో గుర్తిస్తే పూర్తిగా నయం చెయ్యొచ్చు" అని ధైర్యం చెప్తోంది.

పురుషోత్తంకి స్వప్న నచ్చింది. తన ఆరోగ్యం మెరుగుపడడం గమనించాడు.

"అంకుల్ మందులకంటే కూడా పాజిటివ్ థింకింగ్ ముఖ్యం! జబ్బుందనే ఆలోచన రానివ్వగూడదు. ఏమీలేదనుకోవాలి. ఏదొక పనిలో బిజీగా గడపాలి. లాంగ్ లైఫ్ గ్యారంటీ" అంది స్వప్న ఒకరోజు.

"ఇండియా వచ్చి ఎక్కువ కాలం కాలేదు స్వప్నా! దుబాయ్‌లో బిజినెస్ చేశాను. మళ్లీ ఏదైనా చెయ్యాలని ఉంది. అయితే కాంట్రాక్టులు, అవీ చెయ్యను. అందులో టెన్షన్ ఎక్కువ. శ్రమ కూడా ఉంటుంది. ఇంకేదైనా చేస్తాను"

"ఏదైనా కంపెనీలో కన్సల్టెంట్‌గా చేరొచ్చుగా అంకుల్?"

"అది కూడా శ్రమే స్వప్నా! వాళ్లట్టిగా కూర్చోబెట్టి జీతం ఇస్తారా ఏం?" అన్నాడు పురుషోత్తం.

ఆ రోజు ఉదయం స్వప్న స్వీట్ బాక్స్ తెచ్చి పురుషోత్తం చేతికి ఇచ్చింది. కాళ్లకి దండం పెట్టింది. ఆకుపచ్చటి పట్టుచీరలో అందంగా కనిపించింది. ఎక్కువగా తెల్లకోటులో చూసేవాడేమో, ఆరోజు కొత్త అమ్మాయిలా ఉంది.

"ఏంటి స్వప్నా! విశేషం?" అడిగాడు పురుషోత్తం.

"నా బర్త్‌డే అంకుల్!" అంది.

"హేపీ బర్త్‌డే టు యు!" ఆమె తల మీద చేతిని ఉంచి అన్నాడు.

"ఎన్నో బర్త్‌డే స్వప్నా?"

"అది చెప్పగూడదు అంకుల్" అని నవ్వింది.

"ఓకే.. ఓకే! చెప్పొద్దులే! పోనీ ఎప్పుడు పెళ్లి చేసుకుంటావు?"

"జాబ్ చేస్తున్నంత కాలం పెళ్లిచేసుకోను అంకుల్! కార్పొరేట్ హాస్పిటళ్లు బిజినెస్ సెంటర్ల మాదిరిగా ఉన్నాయి. ఇండిపెండెంట్‌గా ట్రీట్‌మెంట్ ఇవ్వనివ్వడం లేదు. ల్యాబ్ నడపాలిగా టెస్ట్‌లు రాయమంటారు. ప్రాఫిట్స్ రావాలిగా నార్మల్ డెలివరీ అయ్యే కేసులకు కూడా సిజేరియన్ చెయ్యమని వత్తిడి చేస్తారు"

"జాబ్ చెయ్యకుండా మరేం చేస్తావు? ఇంత చదువూ చదివి మానేస్తావా?"

"లేదు అంకుల్! నర్సింగ్ హోమ్ కట్టించిన వాడిని పెళ్లి చేసుకుంటాను" నవ్వుతూ చెప్పింది స్వప్న.

"నర్సింగ్ హోమ్ స్టార్ట్ చెయ్యడానికి ఎంత కావాలి?"

"నాలుగు కోట్లు"

"ఆ నాలుగు కోట్లు నేనిస్తాను. సరేనా?"

"కోట్లు అంటే మీరేసుకునే నెహ్రూ కోట్లు కాదు అంకుల్! డబ్బులు" పకపకా నవ్వింది.

"నెహ్రూ కోట్లు, పెళ్లికోట్లు కాదు. నేను ఇస్తానన్నది కూడా డబ్బులే"

"మీరిచ్చినా మీకు, నాకు ఏజ్ గ్యాప్ ఎక్కువ ఉందేమో? ముసలి మొగుడు.. పడుచు పెళ్లాం అంటారేమో? "

"యు.. సిల్లీ! జబ్బులతో చస్తున్నాను. నాకెందుకు పెళ్లి? మా చైతన్యను చేసుకో! వాడ్దూ యుసే? " అన్నాడు పురుషోత్తం.

అంతలోనే అక్కడికి చైతన్య వచ్చాడు. పట్టుచీరలో మెరిసిపోతున్న స్వప్నవైపు కళ్లు పెద్దవి చేసి చూశాడు.

## కొత్తగాలి...

**చెబితే వినేవాడు**
**బాగుపడతాడు**
**చెప్పుడు మాటలు వినేవాడు**
**బాధపడతాడు!**

– కుంటముక్కల సత్యవాణి,
కాకినాడ

"ఏంటి డాడీ! నా పేరు చెప్తున్నావు డాక్టరమ్మతో? " అని అడిగాడు.

"నిన్ను పెళ్లి చేసుకోమని అడుగుతున్నారా!" అన్నాడు పురుషోత్తం.

"నో.. డాడీ! డాక్టర్ని చేసుకోను" అన్నాడు.

"ఏం? "

"మందుల కంపు డాడీ..!" అన్నాడు నవ్వుతూ.

"ఏయ్! నా దగ్గర మందుల కంపా! ఏదీ.. వచ్చి చూడు.." అంటూ చైతన్య దగ్గరకి దూసుకెళ్లింది స్వప్న.

చైతన్య లోపలకు పరిగెత్తాడు.

స్వప్న తన కోడలైతే బాగుండును అనుకున్నాడు పురుషోత్తం.

స్వప్న బర్త్‌డే అని కేక్ కట్ చేయించాడు కాళిదాసు. పురుషోత్తం కుటుంబాన్ని డిన్నర్‌కి ఆహ్వానించారు. రాత్రి పదింటి వరకు అంతా కబుర్లు చెప్పుకుని ఆనందించారు. 'గుడ్‌నైట్' చెప్పి అంతా వెళ్లిపోయారు.

"పెద్దమ్మా! గీతిక స్మార్ట్‌గా ఉంటుంది కదూ? " అలకనందని అడిగింది స్వప్న.

"ఔను! ఉంటుంది.. ఏం? "

"నాకు వదిన అయితే బాగుంటుంది కదా? "

"ఏంటే నువ్వనేది? "

"ఔను పెద్దమ్మా! గీతికను అన్నయ్యకు చేసుకుంటే బాగుంటుంది కదా? " తన మనసులో మాట చెప్పింది స్వప్న. అదే జరిగితే చైతన్యతో వరస కుదురుతుంది అనేది ఆమె ఆలోచన.

అలకనంద ముఖం అప్రసన్నంగా మారింది. స్వప్నవైపు విచిత్రంగా చూసింది.

"శ్రీధర్‌కి రెండు కోట్లు కట్నం ఇచ్చే మ్యాచ్‌లున్నాయి. తెలుసా నీకు? "

"పురుషోత్తం అంకుల్ కూడా భారీగా కట్నం ఇస్తాడేమో? "

అలకనంద ఎగతాళిగా నవ్వింది.

"భారీగా ఇవ్వడానికి ఆయన దగ్గర ఏవుందే? పిచ్చి మొహమా! నీకు వాళ్ల పరిస్థితి తెలీదు. ఆయన మీ పెదనాన్న కొలీగ్ ఒకప్పుడు. ఇక్కడ ఉద్యోగం మానేశాడు. గవర్నమెంట్ ఉద్యోగం ఎవరైనా మానేస్తారా? తనకు ఏదో ప్రాబ్లమ్ అనీ ఇక్కడ చెయ్యలేనని రిజైన్ చేశాడు. దుబాయ్ వెళ్లి ఏదో కంపెనీలో చేరాడు. ఆ ఉద్యోగం మానేసి సొంతంగా కంపెనీ పెట్టాడు. పార్ట్‌నర్లు మోసం చేశారనీ, కంపెనీ దివాలా ఎత్తిందనీ అన్నాడు. ఇప్పుడాయన దగ్గర డబ్బేం లేదు. వాళ్ల ఊళ్లో తన వాటాకు వచ్చిన రెండెకరాల

పొలం తమ్ముళ్లకు రాసిచ్చాడు పెద్ద దాన కర్ణుడులా. ఇప్పుడు పిల్లలిద్దరూ జాబ్స్ చేస్తుంటేనే ఇల్లు గడుస్తోంది. ఆయన భార్య చనిపోయింది. ఆయన ఆరోగ్యం కూడా అంతంత మాత్రమే. మనకు ఏవి ధంగా చూసిన సూటబుల్ మ్యాచ్ కాదు. అర్థమైందా? " అంది.

గీతికను తన కోడలుగా చేసుకోవడం పెద్దమ్మకు ఏమాత్రం ఇష్టం లేదని స్వప్నకి అర్థమైంది.

"అదేంటి పెద్దమ్మా! అంకుల్ నేను నర్సింగ్ హోమ్ స్టార్ట్ చేస్తానంటే నాలుగు కోట్లు ఇస్తానన్నారు? " అంది స్వప్న.

"నాలుగు కోట్లు ఇస్తానన్నాడా? అవి నువ్వు వేసుకునే తెల్ల కోట్లేమో? " పరిహాసంగా నవ్వింది అలకనంద.

పురుషోత్తం ఫ్యామిలీ గురించి పెద్దమ్మ చెప్పిన మాటలు విన్నాక, ఆయన నాలుగు కోట్లు కావాలంటే ఇస్తానన్నది కేవలం ఒక జోక్ అనుకుంది స్వప్న.

ఆ రాత్రి కాళిదాసు ఇంటికి వచ్చాక స్వప్న ప్రస్తావించిన విషయం చెప్పింది అలకనంద.

"స్వప్న అన్నదాంట్లో తప్పేముంది? పురుషోత్తం అడిగితే గీతికను శ్రీధర్‌కి చేసుకుందాం" తేలిగ్గా అన్నాడు కాళిదాసు.

"ఆయన అడగడానికే ఉంది? అడుగుతాడు. దేనికైనా ఒక పద్ధతి లేదా? కట్నం సంగతి తర్వాత. కనీసం గ్రాండ్‌గా పెళ్లయినా చేయగలరా? అని. నేనైతే శ్రీధర్ పెళ్లి హైటెక్స్‌లో చెయ్యాలని చెప్పాను" సీరియస్‌గా అంది అలకనంద.

"బాగుందే. మినిష్టర్లు, ఇండస్ట్రియలిస్ట్లు, సినిమా స్టార్లు కోట్లు ఖర్చుపెట్టి పెళ్లిళ్లు చేస్తున్నారని మనం కూడా అలా చేయాలా? ఎవరి స్థోమతను బట్టి వాళ్లు పెళ్లిళ్లు చేస్తుంటారు"

"అదే మరి! పెళ్లి సంబంధాలు కూడా స్థోమతను బట్టి కుదుర్చుకోవాలి. వియ్యమైనా, కయ్యమైనా సరిసమానుల మధ్య జరగాలని పెద్దలు అంటారు కదా? "

"అన్నీ పెద్దల మాటలను బట్టి జరగవు. అట్లాగైతే నీ పెళ్లి నాతో జరిగేదా? " అన్నాడు కాళిదాసు.

భర్త మాటలు చెంపదెబ్బ కొట్టినట్టు తగిలాయి ఆమెకు. తలెత్తి సీరియస్‌గా చూసింది. ఉక్రోషంతో ఏడుపు ముంచుకొచ్చింది. ముఖం ఎర్రగా చేసుకుని వెళ్లిపోయింది. ఏం మాట్లాడకుండా. భార్యకు కోపం వచ్చిందని గ్రహించాడు కాళిదాసు.

★ ★ ★

ఆ రోజు ఆదివారం. ఉదయమే కాళిదాసు పురుషోత్తం ఇంటికి వచ్చాడు.

"ఏంట్రా బూబూ! బిజీనా కనిపించడమే లేదు" అన్నాడు పురుషోత్తం కాళిదాసుని చూస్తూనే.

"బిజీనే! ఈ సర్వీసు ఎప్పుడైపోతుందా? అని ఎదురుచూస్తున్నాను. ఏ పనీ సక్రమంగా సాగడం లేదు. కాంట్రాక్టర్లు ఇదివరకు మాదిరిగా లేరు. ఇంజనీర్లంటే లెక్క లేదు. పురుగుల్ని చూసినట్టు చూస్తున్నారు. అంతా ఎమ్మెల్యేల బామ్మర్దులు, మినిష్టర్ల తమ్ముళ్లు, మేనల్లుళ్లు. ఎస్టిమేట్ ప్రకారం చెయ్యరు. అంచనాలు పెంచమంటారు. ఒక్కోసారి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకోవాలనిపిస్తోంది. ఆ తర్వాత ఖాళీగా ఉండి ఏం చేయాలో తోచక కంటిన్యూ అవుతున్నాను" కాళిదాసు చెప్తూ కూర్చున్నాడు.

"డిపార్టుమెంట్‌లో ఉండేవే కాంట్రాక్టర్ల డామినేషన్లు. ఇప్పుడు మరీ ఎక్కువై ఉంటాయి" అన్నాడు పురుషోత్తం.

"అవున్రా ఛస్తున్నాం"

"ఏంటి తీరిగ్గా వచ్చావు? "

"నువ్వెలా ఉన్నావో చూద్దామని వచ్చాను. ఎదురింట్లో ఉంటున్నానన్న మాటేగాని నిన్ను కలవడానికి కుదరడం లేదు. ఎలా ఉంది ఆరోగ్యం? హాస్పిటల్‌కి

వెళ్తున్నావా చెకప్‌లకి? "

"డాక్టరే మా ఇంటికొస్తుంటే ఇంకా హాస్పిటల్‌కి ఎందుకు? మీ అమ్మాయి నాకు బాగా ట్రీట్‌మెంట్ ఇస్తోందిలే. మందులు కూడా తెచ్చిస్తోంది. వెరీగుడ్ గర్ల్!" మెచ్చుకున్నాడు పురుషోత్తం.

"మా స్వప్న ఇక్కడున్నంత కాలం దిగుల్లేదు. అది సరేగానీ, నీతో ఒక ముఖ్యమైన సంగతి మాట్లాడుదామని వచ్చాను" అన్నాడు కాళిదాసు.

"ముఖ్యమైన విషయమా? "

కాళిదాసు తల ఊపి "మీ వాడి పెళ్లి చెయ్యాలనుకుంటున్నావా ఈ ఏడు? " అడిగాడు.

"మంచి సంబంధం కుదిరితే చేస్తాను"

"మంచి సంబంధమే. అజయ్‌చంద్ర అని కాకినాడ కాలేజీలో మన సీనియర్. జూబ్లీహిల్స్‌లో ఉంటున్నాడు. నీలాగే జాబ్ మానేసి కన్‌స్ట్రక్షన్ కంపెనీ పెట్టాడు. బాగా సంపాదించాడులే. వాడీమధ్య మా ఆఫీసుకి వచ్చాడు పనిమీద. మాటల్లో వాడి కూతురికి సంబంధం ఉంటే చూడమన్నాడు. వాడికి ఇద్దరు కొడుకులు. పెళ్లిళ్లయిపోయాయి. పెద్దోడు యు.ఎస్.లో. చిన్నోడు ఆస్ట్రేలియాలో ఉంటున్నారు. కూతురు చిన్నది మేఘన" అంటూ కోటు జేబులో నుంచి ఫొటో తీసి ఇచ్చాడు.

పురుషోత్తం ఫొటో చూసి టీపాయ్ మీద ఉంచాడు.

"ఫొటోలో ఏం తెలుస్తుంది? నల్లగా ఉన్న వాళ్లు కూడా తెల్లగా కనిపిస్తారు. ఒడ్డూ పొడుగూ తెలీదు"

"పర్సనల్‌గా చూద్దాంలే! మీ వాడితో మాట్లాడు"

"అలాగే!"

"కుదిరితే బాగానే ఉంటుంది. భారీగానే ముట్టజెప్తాడు" అన్నాడు కాళిదాసు.

"కట్నం సంగతా? అది ముఖ్యం కాదులే!"

"ఎందుకు కాదు? వాడి దగ్గర ఉంది. కూతురికి ఇస్తాడు. మీ అమ్మాయి పెళ్లికి డబ్బు కావాలిగదా! పనికొస్తుంది"

"తను తెచ్చుకున్న డబ్బు నా కూతురికి ఇవ్వనిస్తుందా కోడలు? మా నాన్న నాకు ఇచ్చాడు అంటుంది"

"ఆ సంగతి ముందుగానే చెప్తాం" అన్నాడు కాళిదాసు.

"చూద్దాంలే! ముందు మా వాడికి ఆ పిల్ల నచ్చాలి. ఆ పిల్లకి వీడు నచ్చాలి. కట్నాలు, కానుకలు తర్వాత సంగతి" అన్నాడు పురుషోత్తం.

"అన్నీ నచ్చితేనే ప్రొసీడ్ అవుదాం. నేను అజయ్‌తో మాట్లాడుతాను" అన్నాడు కాళిదాసు.

పురుషోత్తం తల ఊపాడు.

"నేనిక వెళ్తొస్తాను" అంటూ లేచాడు కాళిదాసు.

"అజయ్‌కి అన్ని విషయాలు చెప్పావా? "

"ఏం విషయం? "

"అదే! నేను సౌండ్ పార్టీ కాదనీ.. ఆస్తులు ఏమీ లేవని.. ఆ సంగతి"

"ఆ సంగతి చెప్పాను. అజయ్‌కి వాటి మీద ఆసక్తి లేదు. కుర్రాడు హేండ్సమ్‌గా ఉండాలి. ఇంజనీర్ అయితే చాలన్నాడు. అంతేకాదు అమెరికా వెళ్లాలనే కోరిక ఉంటే వద్దన్నాడు. కొడుకులిద్దరూ వెళ్లిపోయారు. కూతురు కూడా దగ్గర లేకపోతే ఎట్లా? ఇంత డబ్బుండి ఏం లాభం? అదీగాక అజయ్‌కి భార్య కూడా లేదు.. పోయింది" చెప్పాడు కాళిదాసు.

"మా వాడికి అమెరికా పిచ్చి లేదులే! ఇండియాలోనే సెటిలవ్వాలని గదా దుబాయ్ నుంచి వచ్చాం"

"ఔన్లే!"

"ఆ పిల్లకి తల్లి లేదంటున్నావు. మరి మా వాడికీ తల్లిలేదు. రెండు వైపులా ఇంట్లో పెద్దదిక్కుగా ఆడవాళ్లు లేకపోతే ఎలా? మంచికైనా! చెడ్డకైనా? " అన్నాడు

పురుషోత్తం.

"అవన్నీ పాత రోజుల్లేరా! లేకపోతే ఏమైంది? అతాకోడళ్ల గొడవలు అవీ లేకుండా హేపీగా ఉంటారు. ఇప్పుడు లైఫ్ స్టైల్ మారిందిగా!" అన్నాడు కాళిదాసు, అదొక ముఖ్యమైన విషయం కాదన్నట్టు.

ఒకరోజు అజయ్‌చంద్రని వెంటబెట్టుకొచ్చాడు కాళిదాసు. బిఎమ్‌డబ్ల్యూ కారులో వచ్చాడతను. బాగా లావుగా ఉన్నాడు. ఖద్దరు బట్టల్లో పొలిటీషియన్‌లా కనిపించాడు.

"బాగున్నారా పురుషోత్తంగారూ! అప్పట్లో మీగురించి విన్నాను. ఎమ్మెల్యేకి ఎదురు తిరిగారనీ, వాళ్లు మిమ్మల్నీ ఏదో కేసులో ఇరికించి సస్పెండ్ చేయించారనీను. రిజైన్ చేసి మంచిపని చేశారు. నేనూ ఆ తర్వాత అదే పని చేశాను. హేపీ" అని గలగలా నవ్వాడు అజయ్‌చంద్ర.

అజయ్‌చంద్ర వస్తున్నాడని ముందుగానే చెప్పడం వల్ల చైతన్య, గీతిక ఇంట్లోనే ఉన్నారు.

చైతన్యతో కాసేపు మాట్లాడాడు అజయ్ చంద్ర.

"మా అమ్మాయితో పెళ్లయ్యాక ఎక్కడో జాబ్ చేయాల్సిన అవసరం లేదు. మన కంపెనీ చూసుకుంటే చాలు" అన్నాడు.

చైతన్య తండ్రివైపు చూశాడు. పురుషోత్తం మౌనంగా ఉండిపోయాడు.

"మంచిరోజు చూసి ఫోన్ చెయ్యండి. మా ఇంటికి వద్దురు గానీ! అన్ని సంగతులు మాట్లాడుకోవచ్చు" అన్నాడు అజయ్.

"ఇక బయల్దేరతాను" అని అజయ్ లేవగానే, గీతిక "అంకుల్ లంచ్‌చేసి వెళ్లండి" అంది.

"గీతా! కతికితే అతకదు అంటారు. అంకుల్ మా ఇంట్లో లంచ్ చేస్తార్లే! మీ ఆంటీ రెడీ చేసింది" అన్నాడు కాళిదాసు నవ్వుతూ.

అజయ్‌చంద్ర, కాళిదాసు ఇంటికెళ్లి లంచ్ చేసి వెళ్లాడు.

## చేతినిండా పని వారి చలువే

నెహ్రూ తర్వాత వచ్చిన మనదేశ రాజకీయ నాయకుల గురించి ఆర్. కె. లక్ష్మణ్‌కు మంచి అభిప్రాయం ఉండేది కాదు. దేశంలో



పెరిగిన అవినీతినికి విసుగు చెందారు. ఒకసారి ఎవరితోనో పిచ్చాపాటిగా మాట్లాడుతూ 'మన రాజకీయనాయకులు దేశం గురించి ఏమాత్రం పట్టించుకోడంలేదు. వాళ్ల పుణ్యమా అనీ నాకు చేతినిండా పని దొరుకుతోంది' అని చమత్కరించారు.

మరోసారి లాలూ, జయలలితల అవినీతి గురించి మాట్లాడుతూ 'జైలు లోపల ఉండాల్సిన లాలూప్రసాదేమో బయట ఉన్నాడు. ఇక బయట ఉన్న జయలలిత రోజురోజుకూ ఎంత లావెక్కుతున్నారంటే ఆమె పట్టేంత జైలు దేశంలో ఎక్కడైనా ఉందో లేదో తెలియట్లేదు!' అని వ్యంగ్య బాణాలు విసిరారు.

"ఇంత పెద్దసంబంధం పోనిస్తున్నారేంటి? మన శ్రీధర్‌కి చేసుకుంటే బాగుండేది కదా? " అంది అలకనంద అసంతృప్తితో.

"శ్రీధర్ రెండేళ్లదాకా పెళ్లి చేసుకోనన్నాడు. అడిగి చూశాలే. అజయ్ ఏమో వెంటనే పెళ్లి చెయ్యాలని తొందర పడుతున్నాడు. వాడికీ ఆరోగ్యం బాగాలేదు. బైపాస్ అయింది. మరొక వైపు భార్య పోయింది. ఏ రోజు ఎట్లా ఉంటుందో అని దిగులు పడుతున్నాడు. ఎంత తొందరగా కూతురు పెళ్లిచేస్తే అంత మంచిది అన్నాడు" చెప్పాడు కాళిదాసు.

"వాళ్ల కారే రెండు కోట్లో, మూడు కోట్లోనటండీ! డ్రైవర్ చెప్పాడు" అంది.

గొప్ప సంబంధం చెయ్యి జారిపోతోం

దని ఆమెకు బాధగా ఉంది. ఎదురింట్లో చైతన్యకు ఆ అదృష్టం పట్టడం అసూయ కలిగిస్తోంది. కొడుకు మీద కోపం వచ్చింది. రెండేళ్ల వరకు ఎందుకు పెళ్లి చేసుకోడు? ఇంత మంచి సంబంధం కావాలంటే దొరుకుతుందా?

"వాడు రెండేళ్ల దాకా పెళ్లి చేసుకోనంటే, మీరు గమ్మున ఉండిపోయారా? నచ్చజెప్పాల్సింది. అప్పటి దాకా ఎందుకు చేసుకోడట?" నిలదీసింది భర్తని అలకనంద.

"వాడు పసిపిల్లోడా ఏం? పెళ్లంటే నూరేళ్ల పంట. ఎవరి బలవంతానా చేసుకోగూడదు. బాగా ఇష్టపడి చేసుకోవాలి. అయినా వాడి మనసులో ఎవరున్నారో?"

కాళిదాసు మాటలు అగ్నిలో ఆజ్యం పోసినట్టు అలకనందను మండించాయి.

గీతిక ఆమె కళ్ల ముందు మెదిలింది. కొంపదీసి వీడు ఆ పిల్లని ఇష్టపడుతున్నాడా? తను చెప్పలేక స్వప్నతో తనకు చెప్పించాడా? అలకనందకు మనశ్శాంతి లేకుండా పోయింది.

★ ★ ★

కాళిదాసు నిద్రలేచి బ్రష్ చేసుకుని హాల్లోకి వచ్చాడు. సోఫాలో కూర్చుని టీవీ చూస్తున్నాడు. పనిపిల్ల కాఫీ తెచ్చి టీపాయ్ మీద ఉంచింది.

జూబ్లీహిల్స్‌లో అర్ధరాత్రి పన్నెండు దాటిన తర్వాత తాగి డ్రైవ్ చేస్తూ యాక్సిడెంట్ చేసిన మేఘన. రోడ్డు పక్కన ఆగి ఉన్న కారుని, మేఘన నడుపుతున్న కారు ఢీకొంది.

ఆగి ఉన్న కారులో ఎవరూ లేనందున ప్రమాదం తప్పింది. మేఘన తాగిన మత్తులో పోలీసుల మీద దాడి చేసింది. పోలీసులు ఆమెను, ఆమె బాయ్‌ఫ్రెండ్‌ని అరెస్ట్ చేసి జూబ్లీహిల్స్ పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్లారు.

టీవీలో మేఘన తాగిన మత్తులో పోలీసుల్ని తిడుతూ మీద మీదకు వెళ్లడం చూసి కాళిదాసు బిత్తరపోయాడు.

ఎందుకంటే మేఘన అజయ్‌చంద్ర కూతురు.

కాళిదాసు భార్యను పిలిచి టీవీలో టెలీకాస్ట్ అవుతున్న మేఘన విశ్వరూపం చూపించాడు.

"మరీ ఇంత బరితెగించిందా ఆ అమ్మాయి. చూస్తుంటే రోజూ పబ్బుల్లో తప్పతాగి చిందులేసే దానిలా ఉంది. ఇదేం కాపురం చేస్తుంది మొగుడితో?" అని నోరు నొక్కుకుంది అలకనంద.

"ఇంకా నయం! పురుషోత్తం కొడుకుతో పెళ్లి చేశాం కాదు.. పరువుపోయేది" అన్నాడు కాళిదాసు.

అజయ్‌చంద్ర వంటి మల్టీ మిలియనీర్, ఆస్తిపాస్తులు లేని పురుషోత్తం కొడుక్కి తన కూతురినివ్వడానికి ఎందుకు ముందుకు వచ్చాడో అతనికి అర్థమైంది. ఆ పిల్ల బరితెగించి, తాగుడికి అలవాటు పడి విచ్చలవిడిగా తిరుగుతున్న సంగతి అతని సర్కిల్లో అందరికీ తెలిసి ఉంటుంది. ఆ పిల్లను చేసుకోవడానికి ఎవరూ సుముఖంగా ఉండి ఉండరు. చైతన్యలాంటి బీద కుటుంబానికి చెందిన వాడిని బకరా చేద్దామని అనుకుని ఉంటాడు.

ఆ రోజు నుంచి అజయ్‌చంద్ర పెళ్లి సంబంధం గురించి పురుషోత్తం దగ్గర ఎత్తడం మానేశాడు కాళిదాసు.

డాక్టర్ స్వప్న మూడీగా ఉంటోంది. పురుషోత్తం ఇంటికి ఇదివరకటిలా తరచూ రావడం లేదు. ఒకవేళ వచ్చినా ముభావంగా, అంటీ ముట్టనట్టుగా ప్రవర్తిస్తోంది. పురుషోత్తం ఆమె మనసు కొంత వరకు గ్రహించగలిగాడు. చైతన్యకు పిల్లనిస్తానని అజయ్‌చంద్ర వచ్చినప్పటి నుంచి ఆమె అలా ఉంటోంది.

ఆ సంబంధం ముందుకు సాగలేదు. కాళిదాసు ఫోన్‌చేసి "ఆ సంబంధం వద్దులేరా మనకి" అన్నాడు. కారణం చెప్ప

లేదు. తనూ రెట్టించలేదు.

కొన్నాళ్ల తర్వాత స్వప్న మామూలుగా ఉంటోంది. చైతన్యకు వచ్చిన పెళ్లి సంబంధం వెనక్కి పోయిందని ఆమెకు పెద్దమ్మ ద్వారా తెలిసింది. ఆ పిల్ల కేరెక్టర్ మంచిది కాదని, మనకు తగిన మ్యాచ్ కాదని అనుకున్నారు.

"చైతూ! నీ పెళ్లంటగా ఎప్పుడేంటి? " అని అతను ఒంటరిగా ఉన్నప్పుడు పట్టుకుని అడిగింది స్వప్న.

"నీకేంటి ఇంట్రెస్ట్? " ప్రశ్నించాడు చైతన్య.

"ఎదురింటి అమ్మాయిని. ఆ మాత్రం ఇంట్రెస్ట్ చూపించగూడదా? "

"కూడదు"

"ఎందుకు? "

"నీ దారి నీది! నా దారి నాది!"

"అంటే? "

"నువ్వు డాక్టరువి! నేను ఇంజనీర్‌ని!"

"అదా!"

"ఔనమ్మా! నాలుగు కోట్లు పెట్టి నర్సింగ్ హోమ్ పెట్టించిన వాడినే పెళ్లి చేసుకుంటానికి డిసైడ్ అయ్యావుగా? ఇంక నాతో ఏం పని? "

"ఆ నాలుగు కోట్లు అంకుల్ ఇస్తానన్నారు. నీకు ఆ సంగతి తెలీదు"

"ఇస్తే పుచ్చుకో! మరెందుకు నా పెళ్లి గురించి ఎంక్వయిరీ చేస్తున్నావ్? " అడిగాడు చైతన్య.

అప్పుడే లోపలకు వచ్చింది గీతిక. "ఏంటి పుచ్చుకో అంటున్నావ్? హృదయాలు ఇచ్చి పుచ్చుకోవడమా? మనసులు ఇచ్చి పుచ్చుకోవడమా? మీసంగతి కనిపెడుతూనే ఉన్నాను. ఐ నో..!" చిలిపిగా అంది.

"అటువంటిదేం లేదు. ఈ డాక్టరమ్మకి ఎదురు కట్నం కావాలట! నాలుగు కోట్లు! ఇండియా మరీ అంతగా ఎదగలేదమ్మా!" అన్నాడు చైతన్య.

"నాలుగు కోట్లా? ఇండియా ఎదగడం కాదు, దిగజారలేదను. కన్యాశుల్కం రోజులొచ్చాయని కలలొస్తున్నాయేమో? " అని పకపకా నవ్వింది గీతిక.

"అంకుల్ ఇస్తానంటున్నారు నాలుగు కోట్లు. మీకేంటి బాధ? " అంది స్వప్న.

ఇంతలో అక్కడికి పురుషోత్తం కూడా వచ్చాడు. "ఏంటి ముగ్గురూ ఇక్కడ గూడుపుఠాణీ చేస్తున్నారు? " అడిగాడు.

"డాడీ! నువ్వు ఈ డాక్టరమ్మకి నాలుగు కోట్లు ఇస్తానన్నావని దబాయిస్తోంది మమ్మల్ని" చెప్పింది గీతిక.

"ఔను! బీరువా తీసి ఇచ్చెయ్!" అంటూ నవ్వాడు.

కాసేపటికి చైతన్య, స్వప్న వెళ్లిపోయారు. తండ్రికి కాఫీ ఇచ్చి తనూ ఒక కప్పు తెచ్చుకుని తాగుతూ ఆలోచనలో పడింది గీతిక. పికాక్ ఫ్యాషన్ కంపెనీలో తారసపడిన శ్రీరామ్ గుర్తొచ్చాడు.

## కార్టూనిస్టు కాకపోయింటే?

ఒకసారి ఒక పత్రికా మిత్రుడు ఆర్. కె. లక్ష్మణ్‌ను 'జీవితంలో మీరు ఒకవేళ వ్యంగ్య చిత్రకారుడు కాకుంటే, ఏమయ్యుండేవారు? ' అని ఎంతో ఉత్కంఠగా అడిగాడు. తన అభిమాన కార్టూనిస్టుకు ఇష్టమైన ఇతర రంగం తెలుసుకోవాలనేది ఆ పత్రికా మిత్రుడి కుతూహలం.



దానికి ఆర్. కె. లక్ష్మణ్ 'ప్రతి మనిషికీ ఏదైనా ఒక వ్యాపకం ఉండాలి. అప్పుడే ఆయన జీవితంలో అసహ్యమైనవాటి నుంచి నిర్మాణాత్మక కృషివైపు వెళతాడు.

ఇక నా గురించి చెప్పాలంటే నేను కార్టూనిస్టును కాకపోయివుంటే మనదేశంలోని భ్రష్టు పట్టిన రాజకీయాలను, నాయకులను చూసి తప్పకుండా ఆత్మహత్య చేసుకుని చనిపోయి వుండేవాడిననిపిస్తుంది' అని నవ్వుతూ చెప్పారు.

తన సీటు దగ్గరకొచ్చి "హాయ్! గీతా!" అన్నాడు అతను.

అతన్ని అంతకు ముందెప్పుడూ చూసిన గుర్తు రాలేదు. ఎత్తుగా చామనచాయలో ఉన్నాడు. పెద్దపెద్ద కళ్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. తనని చూసి మంద హాసం చేశాడు.

"మీరు..?!" అని ఆగిపోయింది.

"నేను బాగా తెలిసిన వాడిని! జ్ఞాపకం తెచ్చుకో! ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లు" అని నవ్వుతూ వెళ్లిపోయాడు.

ఆమె తల బద్దలు కొట్టుకుంది. "ఎవరు అతను? ఎక్కడ పరిచయం?" పక్క టేబుల్ ముందు కూర్చున్న తారని అడగా లనుకుంది.

"తారా! ఇప్పుడు నాతో మాట్లాడి వెళ్లిన అతను ఎవరు?"

"ఓ..! అతనా! మన కంపెనీ డైరెక్టర్ అనంతరాములు కొడుకు"

"నేనెప్పుడూ చూళ్లేదే?"

"హైద్రాబాద్ వచ్చి పది రోజులైంది. ఆస్ట్రియాలో ఏదో ట్రైనింగ్‌కి వెళ్లాడట"

గీతిక మళ్లీ జ్ఞాపకాల పొరల్లోకి వెళ్లి వెతికి చూసింది.

ఆ రోజంతా పరధ్యానంగానే గడిపింది. అతను ఎవరో గుర్తుకు రావడం లేదు. ఇంటికి వచ్చాక కూడా అతని ముఖం కళ్ల ముందు కనిపిస్తూనే ఉంది.

కంపెనీ డైరెక్టర్ అనంతరాములు కొడుకు అని తార చెప్పింది. అతని పేరేంటో? తను ఎందుకు అడగలేదు? రేపు అడిగి తెలుసుకోవాలి అనుకుంది గీతిక.

ఇంతలో ఇంటి ముందు బైక్ ఆగింది.

'ఇప్పుడేగా అన్నయ్య, స్వప్న కలిసి వెళ్లారు. అప్పుడే వచ్చాశారేంటి?' అను కుంటూ ఉండగా అతను గేటు తీసుకుని చొరవగా లోపలకు వస్తున్నాడు.

గీతిక ఆశ్చర్యపోతోంది.

అతను సరాసరి ఇంటికి వచ్చేసేడేంటి? నిన్ననేగా తను 'నేను బాగా తెలిసినవా డిని. జ్ఞాపకం తెచ్చుకో!' అని పజిల్ విసి రిపోయాడు. ఎవరు ఇతను?

"హాయ్! గీతా! గుడ్‌మాణింగ్..!" అంటూ చొరవగా హాల్లోకి వచ్చేశాడు.

సోఫాలో కూర్చున్న పురుషోత్తం చదు వుతున్న పేపరు పక్కన పెట్టి అతన్ని ఎగాదిగా చూశాడు.

"హాయ్! అంకుల్! బాగున్నారా?" అని అడిగి ఎదురుగా కూర్చున్నాడు.

పురుషోత్తంకీ అతను ఎవరో గుర్తు రాలేదు.

"బాబూ..! నువ్వు..!" అని ప్రశ్నార్థకంగా చూశాడు.

"గుర్తుపట్టండి చూద్దాం? నిన్ననే గీతను మా కంపెనీలో చూశాను. నేనైతే వెంటనే గుర్తుపట్టి పలకరించాను. తనే నన్ను గుర్తు పట్టలేకపోయింది. అంటే నన్ను పూర్తిగా మర్చిపోయిందన్నమాట. నేను గీతికను మర్చిపోలేదు. పదేళ్లపైనే అయి నాగానీ! అందుకే గుర్తుపట్టాను" అతను గలగలా మాట్లాడుతున్నాడు.

గీతిక అక్కడకు వచ్చింది.

"డాడీ ఇతను అనంతరాములుగారి అబ్బాయట" అంది క్లూ ఇస్తూ.

"అనంతరాములు..! అంటే మీది మిర్యా లగూడా? అవునా?" అన్నాడు పురు షోత్తం.

"ఎగ్జాట్లీ..!" అన్నాడు అతను.

"గీతా! వీడు రాహుల్. మిర్యాలగూ డలో మనం ఉన్న ఇంటి పక్కనే ఉండే వాళ్లు. వీళ్ల నాన్న అనంతరాములు. వీళ్లకి మిర్యాలగూడాలో క్లాత్‌స్టోర్ ఉంది"

పురుషోత్తం చెప్తుంటే గీతికకు లీలగా జ్ఞాపకం వచ్చింది. నందిపాడు రోడ్డులో ఉండేవాళ్లు అప్పుడు. పక్కింట్లోనే ఉండే వాడు రాహుల్. వీడు తనకంటే నాలు గేళ్లు పెద్దవాడు. చైతన్య తోటివాడు.

ఇద్దరూ ఒకే క్లాస్.

"రాహుల్..! నువ్వా? సారీ..! గుర్తుపట్టలేకపోయాను" అంటూ అతని పక్కనే కూర్చుంది గీతిక.

"నువ్వు నన్ను మర్చిపోయావు పూర్తిగా!"

"అప్పుడు చిన్నదాన్ని. పది, పన్నెండేళ్ళ యిందేమో గదా! ఏం గుర్తుంటుంది?"

"మరి నాకెందుకు గుర్తున్నావు?"

"నువ్వు నా కన్నా నాలుగేళ్లు పెద్దవా



డివి బాబూ! జ్ఞాపకశక్తి ఎక్కువ ఉంటుంది"

"అదేం కాదు".

"సర్లేగానీ! వాదన ఎందుకు? నీ కబుర్లు చెప్పు? ఆస్ట్రియాలో ట్రైనింగ్ ఏదో చేస్తున్నావంట" అంది గీతిక.

"ఔను ఫ్యాబ్రిక్ యార్న్ మీద రీసెర్చి. లేటెస్ట్ టెక్నాలజీ ట్రైనింగ్ ఎట్సెట్రా చేశాను. ఇప్పుడు అయిపోయిందిలే. ఇండియాలో ఆ టెక్నాలజీ ఇంటర్‌డ్యూస్ చేయాలని ఆలోచన. అయితే మా కంపెనీ డైరెక్టర్లు ఒప్పుకోవడం లేదు" అన్నాడు రాహుల్.

"ఏం? " అడిగాడు పురుషోత్తం.

"అంకుల్! వీళ్లు మార్పు అంటే భయపడతారు. 'ఇప్పుడున్నది బాగానే ఉందిగా! సేల్స్ బాగున్నాయి. ప్రాఫిట్స్ వస్తున్నాయి. మళ్లీ పెట్టుబడి ఎందుకు పెట్టాలి?' అని వాదిస్తారు"

"నిజమే!"

"ప్రస్తుతం బాగానే ఉంటుంది. కొంత కాలానికి ఎవరో ఆ కొత్త టెక్నాలజీ ఫ్యాబ్రిక్స్ మార్కెట్‌లోకి తెస్తారు. మన గార్మెంట్స్ అమ్మకాలు పడిపోతాయి. నష్టాల్లో కూరుకుపోతాం. అంకుల్! కొత్తొక వింత, పాతొక రోత" అని నవ్వాడు రాహుల్.

"బాగా చెప్పావు! నాన్న ఎలా ఉన్నాడు? మీ అమ్మ బాగుందా? " అడిగాడు పురుషోత్తం.

రాహుల్ ముఖంలో విచారం కనిపించింది.

"అంకుల్! నాలుగేళ్ల క్రితం యాక్సిడెంట్ జరిగింది. అమ్మ కోమాలోకి వెళ్లిపోయింది. అప్పటి నుంచి అలాగే ఉంది. ఇంట్లో బెడ్‌కే పరిమితమైంది. నాన్న, అమ్మని చూసుకుంటూ ఇంట్లోనే ఉంటున్నాడు. ఒక నర్స్ వచ్చి ట్రీట్‌మెంట్ ఇస్తుంది. వంటకి, ఇంటి పనికి మనుషుల్ని పెట్టుకున్నాడు. నాన్న ఇప్పుడు బయటకు రావడం లేదు. ఒక విధమైన వైరాగ్యంలో ఉన్నాడు" చెప్పాడు రాహుల్.

"నాలుగేళ్ల నుంచి కోమాలో ఉందా? అయ్యో పాపం!" అన్నాడు పురుషోత్తం.

రాహుల్ తల ఊపాడు.

పురుషోత్తం మనసు విలవిల్లాడింది. అనంతరాములు పరిస్థితికి జాలి కలిగింది. "ఇంట్లో జబ్బుతో ఎవరైనా బాధపడుతుంటే ఇంటిల్లిపాదికీ మనశ్శాంతి ఉండదు. రోజులు, నెలలు కాదు.. సంవత్సరాల తరబడి చలనం లేకుండా శవంలా పడి ఉన్న భార్యని ప్రాణప్రదంగా చూసుకుంటున్న అనంతరాములు మామూలు మనిషి కాదు. ఎంత ఉన్నతుడు!" అన్నాడు.

మధ్యాహ్నం రాహుల్ అక్కడే లంచ్ చేశాడు. పురుషోత్తం కాసేపు కునుకుతీస్తానని బెడ్‌రూమ్‌లోకి వెళ్లాడు.

హాల్లో గీతిక, రాహుల్ మాత్రమే ఉన్నారు. టీవీలో ఏదో పాత బ్లాక్ అండ్ వైట్ సినామా వస్తోంది "గీతికా నీకు గుర్తుందా? " అడిగాడు రాహుల్.

గీతిక అతని వైపు చూసింది. "ఏంటి? " అంది.

"చిన్నప్పుడు ఒకరోజు రాత్రి పెళ్లి ఊరేగింపు మన వీధిలో నుంచి పోతోంది. పూల పల్లకీలో పెళ్లికొడుకు, పెళ్లికూతురు నవ్వుకుంటూ, చిన్నగా సైగలు చేసుకుంటున్నారు. పెట్రోమాక్స్ లైట్ల వెలుగులో వాళ్లిద్దరూ తళతళ మెరుస్తున్న దుస్తుల్లో అందంగా కనిపిస్తున్నారు. నువ్వు వాళ్ల వైపే చూసి చూసి నాతో అన్నావు.

"రాహుల్! మనం కూడా అట్లా ఊరేగుదామా? " అని.

"మనం అట్లా ఊరేగాలంటే ముందు పెళ్లిచేసుకోవాలి గదా? " అని నేను నీతో అన్నాను.

"నువ్వు ఛీ..!" అని సిగ్గుపడి వెళ్లిపోయావు.

రాహుల్ ఆనాటి దృశ్యం కళ్లముందు కనిపించేట్టుగా వర్ణించి చెప్తుంటే గీతికకు సిగ్గు ముంచుకొచ్చింది.

ఆమెకు నెమ్మదిగా అవన్నీ గుర్తుకొస్తు న్నాయి. చిన్ననాటి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. తర్వాత పురుషోత్తం లేచి వచ్చి కూర్చున్నాడు.

"గీతా! కాఫీ పెట్టమ్మా!" అన్నాడు.

గీతిక కిచెన్‌లోకి వెళ్లింది.

"అంకుల్! నేను అహమ్మదాబాద్‌గానీ, సూరత్‌గానీ వెళ్దామనుకుంటున్నాను" చెప్పాడు రాహుల్.

"ఏం? "

"ఇక్కడ ఆ ప్లాంట్ ఎస్టాబ్లిష్ చేయడానికి ఎవరూ ముందుకు రావడం లేదు. నా ట్రైనింగ్ వృథా అవుతుంది గదా! గుజరాత్‌లో అయితే ఎవరైనా ఎంకరేజ్ చేస్తారేమో!" అన్నాడు.

"మరి పికాక్‌లో మీ వాటా? "

"అమ్మేస్తాను అంకుల్! నాన్న ఎటూ ఇంట్రెస్ట్‌గా లేరు. ఇక ఎందుకు? "

"పికాక్‌లో వాటా అమ్మేసిన తర్వాత ఇక్కడే ఆస్ట్రియా టెక్నాలజీ ఫ్యాబ్రిక్ ప్లాంట్ పెట్టడానికి ప్రాజెక్ట్ రిపోర్ట్ తయారుచెయ్యి"

"ఇక్కడ ఎంకరేజ్ చేసేది ఎవరు? అంత పెట్టుబడి ఎవరు పెడతారు? " ప్రశ్నించాడు రాహుల్.

"బ్యాంకులు!"

"నేను కన్సల్ట్ చేశాను, అంకుల్! పికాక్ ఫ్యాషన్స్ కంపెనీకి అయితే ఎంతయినా లోన్ శాంక్షన్ చేస్తామంటున్నారు. కొత్త కంపెనీకి అయితే సెక్యూరిటీ కావాలంట. మా ఎండీకి ఇష్టం లేనప్పుడు ఏం చేస్తాం. డైరెక్టర్లంతా ఆయన మాటే వింటారు" చెప్పాడు రాహుల్.

"అదంతా నేను చూస్తాను గదా! నేను చెప్పినట్టు ప్రాజెక్ట్ రిపోర్ట్ తయారు చెయ్యి" అన్నాడు పురుషోత్తం నవ్వుతూ.

రాహుల్ ఆలోచనలో పడ్డాడు. పురుషోత్తం కుటుంబం గురించి అతను విన్నాడు. ఇంజనీర్ ఉద్యోగం మానేసి దుబాయ్ వెళ్లాడనీ, భార్య చనిపోయిందనీ, అక్కడ నష్టపోయి తిరిగి ఇండియా వచ్చాడనీ చెప్పుకున్నారు. గీతిక తమ కంపెనీలో జాబ్ చేస్తున్నదంటేనే వాళ్ల ఇంటి పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. అంకుల్ వ్యక్తిగతంగా తనకు సహాయం చేయలేడు. కానీ ఎంకరేజ్ చేస్తున్నాడంటే ఆయనకి ఏదో పలుకుబడి ఉండి ఉండొచ్చు.

కొంచెంసేపు కూర్చుని రాహుల్ సెలవు తీసుకుని వెళ్లాడు.




**పు**రుషోత్తం, పిల్లలూ అనంతరాములు ఇంటికి వెళ్లారు. లంకంత ఇంట్లో పాపం అతను ఒంటరిగా మాటా పలుకులేని భార్యకు తోడుగా ఉండడం చూసి పురుషోత్తం కళ్లల్లో నీళ్లుతిరిగాయి.

మిర్యాలగూడలో పక్కపక్క ఇళ్లల్లో ఉన్నప్పుడు అనంతరాములు భార్య దేవకి, అన్నపూర్ణ కలివిడిగా ఉండేవాళ్లు. కూరలు, పిండివంటలు ఇచ్చి పుచ్చుకునేవాళ్లు. సంక్రాంతికి ఇళ్లముందు ముగ్గులేసేవాళ్లు, ఆ వీధిలో ఆడవాళ్లంతా పోటీలు పడి. భోగిమంట వేస్తే ఇరవై నాలుగు గంటలు మండుతూనే ఉండేది. పండుగలు, వేడుకలు సరదాగా జరిగేవి. పిల్లల ఆటపాటలతో ఆ వీధి కళకళలాడుతుండేది.

ఆ రోజులన్నీ గతించిపోయాయి.

పురుషోత్తం, అనంతరాములు గత స్మృతులు నెమరేసుకున్నారు. గీతికను క్వాలిటీ కంట్రోల్ సెక్షన్ నుంచి డిజైన్స్ సెక్షన్లోకి మార్పించాడు రాహుల్. సంవత్సరం పిల్లల్నుంచి టీనేజ్ యువతుల చుడీదార్లు, గాగ్రాచోళీలు, పంజాబీ సూట్స్ వగైరా లేటెస్ట్‌డిజైన్స్ తయారుచేయడంలో నిమగ్నమైంది గీతిక.

ఆర్నెల్ల తర్వాత దేవకి చనిపోయింది. దశదినకర్మలు అయిన తర్వాత అనంతరాములు కాశీకి వెళ్లిపోతానని అన్నాడు. జీవితంలో చరమాంకం అక్కడే గడపాలని అతని ఆలోచన.

"రాములూ! నువ్వు కాశీకి వెళ్లి చరమాంకం గడపాల్సిన టైమ్ ఇంకా రాలేదు. నీ బాధ్యతలు వదిలేసి ఎక్కడికి పోతావు? " అన్నాడు పురుషోత్తం.

"ఇంకేం బాధ్యత పురుషోత్తం? మంచంలో ఉన్నా ఆరేళ్లు కంటికి రెప్పలా కాపాడుకున్నా దేవకిని. తను విముక్తి పొందింది. నా బాధ్యత తీరింది" అన్నాడు రాములు.

"భలేవాడివి రాములూ! రాహుల్ పెళ్లి చేయలా? ఇంటి కోడలు రావాలి. నువ్వు మనవల్ని ఎత్తుకు తిరగాలి. వాళ్ల ముద్దు ముచ్చట్లతో గడపాలి. అదంతా బాధ్యత కాదా? కాశీకి వెళ్లి గడపాల్సిన వయసు కాదు నీది" అన్నాడు పురుషోత్తం.

అనంతరాములు బంధువులు కూడా పురుషోత్తం మాటల్ని బలపరిచారు. రాహుల్ పెళ్లిచేసి సుఖంగా ఉండమని కోరారు.

"రాహుల్ కంపెనీలో భాగం అమ్మేసి గుజరాత్ వెళ్లిపోవాలనుకుంటున్నాడు. నేను ఈ చివరిరోజుల్లో పరాయి ప్రాంతంలో ఇమడలేను" అన్నాడు అనంతరాములు.

"రాహుల్ అలా అనుకుంటున్న మాట నిజమే రాములూ! కానీ ఇక్కడే మరొక ప్లాంట్ వాడితో పెట్టిస్తాను. నువ్వేం దిగులుపడకు. అదంతా నేను చూసుకుంటాను గదా? " అని పురుషోత్తం అనంతరాములుకి నచ్చజెప్పాడు.

పురుషోత్తం, బంధువులు నచ్చజెప్పిన తర్వాత అనంతరాములు మనసు మార్చుకున్నాడు. కొడుకుతోపాటు కంపెనీకి వెళ్లడం ప్రారంభించాడు. కంపెనీలో తన భాగం వదిలేస్తున్నట్టు మేనేజ్‌మెంట్‌కి తెలియజేశాడు. ఎకౌంట్ సెటిలయ్యేవరకు ఆయన్ని ఒక డైరెక్టర్‌గా కంపెనీ కార్యకలాపాలలో పాల్గొనవలసినందిగా యాజమాన్యం కోరింది.

గీతిక, చైతన్య ఉద్యోగాలకు వెళ్లిన తర్వాత పురుషోత్తం ఒక్కడే ఇంట్లో ఉండేవాడు. కొంతకాలంగా ఆ ఇంటికి తాళం కనిపించడం గమనించింది అలకనంద. పిల్లలు వెళ్లిన తర్వాత రోజూ ఒక కారు వస్తోంది.

అది ఎక్కి వెళ్తున్నాడు పురుషోత్తం. తను కూడా ఎక్కడైనా జాబ్ చేయడానికి వెళ్తున్నాడా? అని అనుమానించింది ఆమె. రిటైర్డ్ ఇంజనీర్లకు ప్రైవేట్ కంపెనీలలో కన్సల్టెంట్లుగా అవకాశాలు ఉంటాయి.

"పురుషోత్తం అన్నయ్య రోజూ ఎక్కడికో వెళ్తున్నాడండీ. ఎక్కడైనా జాబ్ చేస్తున్నాడా? " భర్తని అడిగింది అలకనంద.

"జాబ్ చేస్తున్నాడా? నాతో చెప్పలేదే? " అన్నాడు కాళిదాసు.

వెంటనే ఫోన్ చేసి అడిగాడు పురుషోత్తంని.

"నీకు చెప్పాలనుకుంటూనే మర్చిపోతున్నాను. నీకు ఇప్పుడు ఖాళీ ఉంటే సైట్‌కి రా! ఇక్కడే ఉంటాను" అని అడ్రస్ చెప్పాడు పురుషోత్తం.

కూకట్‌పల్లి నుంచి మియాపూర్ వెళ్లే రోడ్డు పక్కన ఉంది పురుషోత్తం చెప్పిన

సైట్. గత కొన్నేళ్లుగా నాలుగు అంతస్తులు స్లాబ్ వేసిన పిల్లర్లు కనిపిస్తూ ఉన్నాయి అక్కడ.

ఎంతకాలం చూసినా అది పూర్తి కావడం లేదు. ఎవరో నాలుగు అంతస్తుల బిల్డింగ్ కట్టడానికి మొదలు పెట్టి మధ్యలో వదిలేశారు.

పురుషోత్తం అక్కడ ఉన్న రేకులషెడ్ ఆఫీసులో ఉన్నాడు. బిల్డింగ్ పనులు చేయిస్తూ కనిపించాడు.

"ఎవరిదిరా ఈ సైట్? " అడిగాడు కాళిదాసు.

"అన్నదమ్ముల మధ్య డిస్ప్యూట్. బిల్డర్ వదిలేసి పోయాడు వీళ్ల గొడవల్తో. కోర్టులో కేసు తీర్పు వచ్చింది. బిల్డింగ్ కంప్లీట్ చెయ్యాలి. ఆర్నెల్లలో రెడీ చేస్తాను" చెప్పాడు పురుషోత్తం.

"నీకు అసలే ఒంట్లో బాగాలేదు. ఇప్పుడెందుకు ఈ పనంతా నెత్తినేసుకున్నావు? మూలబడితే చేసేవాళ్లు లేరు నీకు!" అని మందలించాడు కాళిదాసు.

"పిల్లలకు పెళ్లి చేసే వరకు తప్పదు నాకు" అని నవ్వాడు పురుషోత్తం.

"ఏంటోరా నీ పిచ్చి? నాకు అర్థం కావడం లేదు. పిల్లల పెళ్లిళ్లు చేయడానికి, ఈ వయసులో నువ్వు కష్టపడాలా? " అన్నాడు కాళిదాసు.

"పెళ్లిళ్లు చేయగానే సరా? వాళ్ల భవిష్యత్తు అంతా హేపీగా ఉండాలి. అందుకే నా తాపత్రయం"

"సర్లే! ఆరోగ్యం జాగ్రత్త! నీకు అసలే పనిపిచ్చి! పనిలో పడితే అన్నం, నీళ్లు కూడా అక్కర్లేదు నీకు. మందులైనా సమయానికి వేసుకో! రెగ్యులర్‌గా చెకప్‌లకు

హాస్పిటల్స్‌కి వెళ్లు. డిపార్టుమెంట్‌లో సిన్సియర్‌గా పనిచేశావు. చివరకు ఏమైంది? దొంగ కేసులు పెట్టి నిన్ను సస్పెండ్ చేయించారు. ఇక్కడ ప్రైవేట్‌వాళ్లు నీ నెత్తిన కిరీటం తొడగరు ఎంత మేలు చేసినా!" అని కాళిదాసు చివాట్లు పెట్టాడు.

ఇంటికి వెళ్లిన తర్వాత భార్యకు చెప్పాడు.

"గుజరాతీవాళ్ల బిల్డింగ్ కట్టిస్తున్నాడు దగ్గరుండి. అందుకే రోజూ వెళ్తున్నాడు"

"తండ్రి, కొడుకు, కూతురు ఎంత కష్టపడ్డా ఈ హైదరాబాద్‌లో ఒక అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్ అయినా కొనగలరా? ఈ ఏరియాలలోనే ఏభై లక్షలు చెప్తున్నారు డబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్. 'గాజుల బేరం కూటికి సరి' అని ఎంత సంపాదించినా ఇంటికి అద్దె, బైకులో పెట్రోలుకి, తినడానికి సరిపోదు" అంది అలకనంద.

"పోనీలే! ఇంట్లో ఖాళీగా కూర్చుని మాత్రం ఏంచేస్తాడు? టైమ్‌పాస్ అవుతుంది. ఏదొక పనిచెయ్యనీ" అన్నాడు కాళిదాసు.

"మీరే ఎక్కడైనా లోన్ ఇప్పించండి. ఒక ఫ్లాట్ అయినా కొనుక్కుంటారు. ఇండిపెండెంట్ ఇల్లు కావాలంటే కోట్లు కావాలి. అయ్యో పనేనా?" అంది అలకనంద.

"చూద్దాం! లోన్ ఇప్పించడానికైనా ఎలిజిబులిటీ కావాలి. వీళ్లు ఉద్యోగాల్లోకి పోయి సంవత్సరం కూడా కాలేదు. బ్యాంక్‌వాళ్లని మేనేజ్ చెయ్యాలిక" అన్నాడు కాళిదాసు.

"ఏదో ఒకటి చేసి పుణ్యం కట్టుకోండి" అంది అలకనంద పురుషోత్తం కుటుంబానికి మేలు చేయాలని.

ఆర్నెల్ల తర్వాత...

ఒకరోజు పురుషోత్తం కారులో స్వప్నని తీసుకెళ్లాడు. నేషనల్ హైవేకి పక్కనే మెరిసిపోతోంది నాలుగు అంతస్తుల బిల్డింగ్, కారు దిగి బిల్డింగ్ అంతా చూసింది స్వప్న.

"అంకుల్! ఇది హాస్పిటల్ కోసం కట్టించినట్టుగా ఉందే" అంది స్వప్న ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ.

"యస్ స్వప్నా! హాస్పిటల్ కోసమే. నీకు నచ్చిందా?" అడిగాడు.

"సూపర్!"

"ఇది స్వప్నా సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్! ఇక నీ పని మొదలు పెట్టు. స్టాఫ్‌ని రిక్రూట్ చేసేకో! రోగులకు ట్రీట్‌మెంట్, అదంతా నువ్వు చూసుకోవాలి. హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్ చైతన్య చూసుకుంటాడు. ఓకే..!" అన్నాడు పురుషోత్తం.

స్వప్నకి అది కలా? నిజమా? అనిపించింది. తను ఏదో తమాషాకి తన మనసులో మాట బయటపెట్టింది.. సొంతంగా నర్సింగ్‌హోమ్ నడపాలని. అంకుల్ తన కల సాకారం చేశాడు.

"అంకుల్ ఎవరిది ఈ బిల్డింగ్? లీజ్ ఎంత? మనకి వర్కవుట్ అవుతుందా?" ఆశ్చర్యం నుంచి తేరుకుని అడిగింది.

"మనకి వర్కవుట్ అవుతుంది. ఎందుకంటే దీన్ని లీజ్‌కి తీసుకోలేదు. మనం కొనేశాం. ఇది మన సొంతం" అన్నాడు పురుషోత్తం.

"కొనేశారా?! ఎంతకి?"

"నువ్వు నాలుగు కోట్లు కావాలనుకున్నావ్. నేను మరొక పది కలిపి, మొత్తం

కొత్తగాలి...

**కులం గజ్జికుక్క**
**అయితే తిరగనివ్వకు**
**మతం పిచ్చి మొక్క**
**అయితే పెరగనివ్వకు**

– కూకట్లపల్లి పోలయ్య,
హైదరాబాద్

పద్నాలుగు కోట్లతో కొన్నాను"

"అంకుల్! అంత డబ్బు..?!"

"బ్యాంక్‌కి కన్నం వేశాను. సరేనా? అని పకపకా నవ్వాడు పురుషోత్తం.

కురుక్షేత్రంలో కృష్ణుడి విశ్వరూపం చూసి మూర్ఛపోయిన అర్జునుడి మాదిరిగా స్వప్నకి తెలివి తప్పింది.

ఇంటికి వెళ్లిన తర్వాత పెద్దమ్మకి చెప్పింది స్వప్న.

"పెద్దమ్మా! పురుషోత్తం అంకుల్ నాలుగు అంతస్తుల బిల్డింగ్ కొన్నారు. అందులో నేను హాస్పిటల్ పెడుతున్నాను. ఇక జాబ్‌కి రిజైన్ చేసేశాను"

"ఏంటే నువ్వనేది? పురుషోత్తం అంకుల్ బిల్డింగ్ కొన్నాడా? ఎంతకీ?"

"పద్నాలుగు కోట్లు"

"పిచ్చి మాటలు మాట్లాడకు. పురుషోత్తం అంకుల్ పద్నాలుగు కోట్లు పెట్టి బిల్డింగ్ కొన్నాడా? నా చెవిలో కాలీఫ్లవర్ పెట్టకు. నమ్మడానికి నేనేం పిచ్చిదాన్ని కాదు. ఉండడానికి సొంత ఇల్లులేదు. నువ్వు అనవసరంగా చేస్తున్న ఉద్యోగం వదలకు. ఆ బిల్డింగేదో లీజ్‌కి తీసుకుని నీకు అంటగట్టాలని చూస్తున్నాడు. నిన్ను కోడలిగా చేసుకోడానికి ఎత్తుగడేమో?" అంది అలకనంద.

స్వప్న ఏమీ మాట్లాడలేదు. ఆ రాత్రి ఇంటికి వచ్చిన కాళిదాసుకి విషయం చెప్పింది అలకనంద. అతను నవ్వి ఊరుకున్నాడు.

పురుషోత్తం మర్నాడు కాళిదాసు ఇంటికి వచ్చాడు.

"స్వప్న, చైతన్య ఒకరినొకరు ఇష్టపడుతున్నారు. మీ తమ్ముడ్ని, మరదల్ని పిలిపించు మాట్లాడుదాం" అన్నాడు.

అలకనంద అనుమానం నిజం అయింది!

"అన్నయ్యా! లీజుకి తీసుకుని అంత పెద్దబిల్డింగ్ మెయింటైన్ చెయ్యడం స్వప్న వల్ల అవుతుందా? హాస్పిటల్ నడపడం అంటే మాటలా?" అంది అలకనంద.

"నీ అనుమానం నాకు అర్థమైందమ్మా! ఆ బిల్డింగ్ మన సొంతం! ఔట్‌రైట్ సేల్‌కి ల్యాండ్ కొని, బిల్డింగ్ కట్టించాను. చైతన్య, స్వప్నల పేరుమీద రిజిస్ట్రేషన్ చేయించాను. ఇవిగో డాక్యుమెంట్లు" అన్నాడు పురుషోత్తం, డాక్యుమెంట్లు కాళిదాసు చేతికి అందిస్తూ.

అవి చూసి భార్యాభర్తల కళ్లు తిరిగాయి. కలకాదు యథార్థమే!

పురుషోత్తం ఎంత నాటకం ఆడాడు? దుబాయ్‌లో దివాలా ఎత్తి వచ్చాననీ, చేతిలో డబ్బులేదనీ..!

"మరి ఎందుకురా ఇంత నాటకం ఆడావు? నేను కూడా నిజమే అనుకున్నా! దుర్మార్గుడా? ఎంత మోసం? నన్ను కూడా మాయలో పడేశావు గదా!" ఆక్రోశించాడు కాళిదాసు.

పకపకా నవ్వాడు పురుషోత్తం.

"ఎందుకంటే నా పిల్లల కోసం. వాళ్లు ఇన్నాళ్లు విదేశంలో పెరిగారు. మనదేశం మనుషుల మనస్తత్వాలు వాళ్లకి తెలీవు. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్లు అని నమ్మేస్తారు. అందుకే వాళ్లనీ మభ్యపెట్టాను. ఇండియాలో మన బంధుమిత్రుల నిజస్వరూపాలు ఎలా ఉంటాయో వారికి ప్రాక్టికల్‌గా చూపించాను. మన దగ్గర సంపద ఉన్నప్పుడు ఎలా ప్రవర్తిస్తారో, లేదని తెలిసినప్పుడు ఎలా తప్పుకుంటారో వారి కళ్లతో చూశారు. మనుషుల్ని నమ్మినట్టు నటించండి. పూర్తిగా నమ్మకండి. సమయం వస్తేగానీ వారి నిజరూపాలు బయటపడవు అనేది తెలుసుకునేట్టు చేశాను. నా ఆరోగ్యం అంతంత మాత్రం. నేను పోయాక వారికి మంచి చెడు చెప్పేవారు ఉండరు. నేనే వారికి లోకం పోకడ అర్థమయ్యేట్టు చేశాను. ఇక నాకు దిగుల్లేదు" అన్నాడు పురుషోత్తం.

అలకనందలో దింపుడు కళ్లం ఆశ మొదలైంది. తన కొడుకు శ్రీధర్‌కి పురుషోత్తం కూతురు గీతికను అడుగుదామని స్వప్న ప్రపోజ్ చేస్తే, తను ఈసడించిన విషయం గుర్తొచ్చింది. ఎంత పొరపాటు జరిగింది? ఇప్పటికైనా మించి పోలేదు.

"అన్నయ్యా! మరి ముందు గీతిక పెళ్లి చేయాలని అంటూ ఉండేవాడివి కదా?" అడిగింది అలకనంద.

"గీతికకు మ్యాచ్ ఫిక్సయిందమ్మా! మిర్యాలగూడలో మా పొరుగున ఉండే అనంతరాములు కొడుకు రాహుల్‌తో పెళ్లి చేస్తున్నాం. పోచంపల్లిలో గీతిక ఫ్యాషన్స్ పేరుతో ప్లాంట్ రెడీ అయింది. రాహుల్ ఆస్ట్రియా టెక్నాలజీతో గార్మెంట్ మాన్యు ఫ్యాక్చరింగ్ యూనిట్ రెడీ చేశాడు" చెప్పాడు పురుషోత్తం ఆనందంతో.

అలకనంద ఆశలన్నీ ఆవిరైపోయాయి.

"ఆ ప్లాంట్‌కు ఎంతయిందిరా?" అడిగాడు కాళిదాసు.

"పాతిక కోట్లు" చెప్పాడు పురుషోత్తం.

"సొంత ఇల్లు లేకుండా పిల్లల పెళ్లి పెట్టుకున్నావా?" అన్నాడు కాళిదాసు.

"పెళ్లి చేసేది సొంత బిల్డింగ్‌లోనే. జూబ్లీహిల్స్‌లో కొన్నాను. మూడంతస్తుల కొత్త బిల్డింగ్. వెయ్యిగజాల ఏరియా. ఇరవై కోట్లు అయింది. ఆ బిల్డింగ్ మాత్రం నాపేరుతోనే ఉంటుంది. నా తర్వాతే పిల్లలకి! ఎందుకంటే ఉన్నదంతా పిల్లలకి ఇప్పుడే ఇచ్చేశాననుకో.. రేపు నేను మూలపడిన తర్వాత సరిగా చూస్తారో? లేదో? ఈయన దగ్గర ఇంకా ఏం వుంది? అంతా ఇచ్చేశాడుగా! ఎందుకు చూడాలి అనుకోవచ్చు? నా పిల్లల నిజస్వరూపాలు నాకు తెలీదుగా! దేనికైనా సమయం రావాలి. అప్పుడే నిజరూపాలు బయటపడతాయి" అని పకపకా నవ్వాడు పురుషోత్తం.

"ఇప్పటికే అరవై కోట్లకి లెక్క చెప్పావు. ఇంకా ఎంత డబ్బుందిరా నీ దగ్గర?" అనుమానంగా అడిగాడు కాళిదాసు.

"ఆ ఒక్కటి అడక్కు" అన్నాడు పురుషోత్తం.

"ఎంత నాటకం ఆడావురా? నీ ముందు నటరత్నలు, నటసామ్రాట్టులు చాలరురా!" అని నవ్వాడు కాళిదాసు.

హైటెక్స్‌లో స్వప్న, చైతన్య... గీతిక, రాహుల్‌ల పెళ్లిళ్లు వైభవంగా జరుగుతున్నాయి.

అప్పుడెప్పుడో గీతిక, తను ఒక పెళ్లికి ఇక్కడకు వచ్చినప్పుడు ఆమెతో అన్నమాటలు గురుకొచ్చాయి అలకనందకు.

"ఎంత గ్రాండ్‌గా జరుగుతోందో చూశావా? పెళ్లంటే ఇట్లా చేయాలి. మా శ్రీధర్ పెళ్లికూడా ఇక్కడే చేస్తాం. పెళ్లి ఖర్చులు ఏభై లక్షలుపైనే అవుతుందట ఇక్కడ"

శ్రీధర్‌తో తనకు పెళ్లవుతుందేమోనని గీతిక ఆశ పడుతుందేమో? అనే అనుమానంతో మీ స్టేటస్ ఇది అని గుర్తుచేస్తూ, ఈసడిస్తూ అంది అప్పుడు.

ఇప్పుడు గీతిక పెళ్లి ఇక్కడే వైభవంగా జరుగుతోంది. పురుషోత్తం ఇన్నాళ్లూ ఎంత గుంభనంగా ఉన్నాడు? ఎంత నాటకం ఆడాడు?

"మమ్మీ! అక్షింతలు వేసొద్దాం పద!" అన్నాడు శ్రీధర్.

ఉలిక్కిపడింది అలకనంద. ఆలోచనల్లో నుంచి తేరుకుంది.

"అంత పెద్ద క్యూ ఉందేంరా అక్కడ? మనం వెళ్లక పోతేనేం?" అంది.

"భలేదానివమ్మా! మనం వీడియోలో, ఫొటోల్లో పడొద్దూ! లేకపోతే పెళ్లికి రాలేదనుకుంటారు" అన్నాడు శ్రీధర్.

'అవి తనమాటలేగదా? ఒకప్పుడు' అనుకొని లేచింది అలకనంద.

పెళ్లిళ్లకొచ్చిన శేషమ్మ సిటీలో పెద్దకొడుకుతోనే ఉండిపోయింది. ఆ తర్వాత మన్మథరావు, లక్ష్మణరావు శేషమ్మ ఇంట్లోకి మారిపోయారు. ©

పెద్ద కథ



# శ్రమ మాధుర్యం

ఒక మనిషిని అర్థం చేసుకోవడం అంత తేలికేం కాదు. నలభై సంవత్సరాలు పైబడిన నా జీవితానుభవాల అభిప్రాయమిది. ఒకరి వ్యక్తిత్వాన్ని అవగాహన చేసుకోవడం కష్టమైన విషయమనేది నాకర్థమైంది. ఇతరులను అర్థం చేసుకునే ప్రయత్నంలో అకస్మాత్తుగా ఆ మనిషి వ్యక్తిత్వం సమున్నతంగా అవగాహనకు వస్తుందనే విషయంస్వానుభవంలోకి వచ్చింది.

'విమోచన' కాలానికి ముందు నేను కొంతకాలం అవస్థలు పడ్డాను. ఆ తర్వాత ఆనందాన్నీ పొందాను. 'సాంస్కృతిక విప్లవం' నన్ను నిలబెట్టింది. విదేశీ సాంకేతిక విజ్ఞానం గురించి నేను కొన్ని సిద్ధాంతపరమైన రచనలు, అనువాదాలూ చేశాను. ఈ నెపంతో... 'విదేశీయతనంత

టినీ ఆరాధిస్తున్నాననీ, పునర్విమర్శన పంథా (రివిజనిజం)కు అనుకూలుణ్ణి' అని అభియోగం మోపి శ్రమశక్తిని ధారపోయ మని నన్ను సరిహద్దు ప్రాంతాలకు పంపించారు. నేను వెరవలేదు. దాంతో నన్ను 'ధృడమైన వ్యక్తిత్వం వున్నవాడు' అని పిలిచారు. నా కొడుకును కూడా గ్రామీణ ప్రాంతానికి పంపించారు. నా భార్య చనిపోయింది. ఆమె మరణం సహజమైందన్నారు కానీ, దాని అర్థమేమిటో మాకందరికీ తెలుసు. ఆ విధంగా నా గుండె లోతుల్లో దేంతోనూ మానని గాయాలు ఏర్పడ్డాయి.

వసంత రుతుపవనం మనుషుల హృదయాలకు వెచ్చదనం కలిగించే రీతిలో ఆకాశాన్ని మేఘంలా ఆవరిస్తున్న పొగమంచును చెల్లాచెదురు చేస్తోంది. ఈశాన్య ప్రాంతంలోని శూన్యం నిండిన నా నివాసం నుండి తప్పించుకుపోవాలనే కోరిక ఉండడంతో కాబోలు నేను నా చుట్టుపక్కల వాళ్లతో ఉదాశీనంగా వుండేవాణ్ణి. ఆ సమయంలో యాంగ్జీ ఉక్కు కార్ఖానా నిర్మాణ ప్రాంతానికి నన్ను బదిలీ చేసినందుకు నా అధినాయకత్వానికి కృతజ్ఞుణ్ని. అయినా, ఇంకా నా ఆలోచనలు ఈశాన్యానికి తిరిగి రావాలనే వుండేవి.

కార్ఖానా నిర్మాణ పనిలో నా పనేమిటో పరిశీలించుకున్న తర్వాత- కొత్తగా స్థాపించిన శాస్త్రసాంకేతిక విజ్ఞాన సమాచార కేంద్రానికి ముఖ్య పదవిలో నన్ను నియమించారు. ఈ నియామకాన్ని నేనంగీకరించాను గానీ ఇంకా నాలో ఏదో వ్యాకుల పాటుగానే వుంది. ఏదోతెలియని వేదన. కొందరిలో ఇలాంటి చెప్పనలవికాని సంవేదనలు కలుగుతాయని నేననుకుంటాను.

నిర్మాణకేంద్రాన్ని నిర్ణయించుకున్న తర్వాత మాకు కావలసిన అన్నిరకాల సరుకుల్ని, సామగ్రిని కోరిందే తడవుగా దేశ విదేశాల నుండి ప్రవాహంలా పంపడం మొదలైంది. వాటిని అల్మారాలలో సర్దడానికి మాతోటి యువశ్రామికులకు పది దినాలు పట్టింది. ఇంకా మా కార్యాలయం ఎదురుగా వున్న ఓ చిన్న చీకటి గది కూడా వాటితో నిండిపోయింది. వాటిని సరైన పద్ధతిలో విభజించి పొందికగా పేర్చకపోవడంతో పుస్తకాలను, పత్రికలను చదువుకోవడానికి వచ్చేవాళ్లు వాళ్లకేంకావాలో వెతుక్కోవాల్సి వచ్చేది. ఆ వెతుకులాట, వాళ్లు చేసేగడబిడలు.. నాకు కొంత విసుగు కలిగించినా దాని గురించి నేనేమీ చేయలేకపోయేవాణ్ణి.

ఒకసారి మధ్యాహ్నం దాటిన తర్వాత- నేనొక పెద్ద పట్టికను పరిశీలిస్తున్న సమయంలో.. పంచపాళి ప్రాంతం నుండి ఫిడేలు వాయిద్యంపై ఏకకాలంలో పలికించిన సంతోష విషాదాల మేళవింపు రాగం వినిపించింది. సంచార జాతుల ప్రస్తారంలో ఆహ్లాదకరమైన మాధుర్యగాన నాద ప్రసారధ్వని అది. ఇది అత్యంత జీవద్భరితమైన సందర్భం! ఆ నాదప్రసారం చాలా దగ్గర నుండి వస్తోంది. వెళ్లిచూస్తే.. ముప్ఫైలలో వున్న ఓ యువతి నా కళ్ల ముందు ప్రత్యక్షమైంది.

వెన్వెంటనే ఆమె ఆకారాన్ని అంచనా వేసుకున్నాను. ఓ నాట్యకత్తెలాంటి తీర్చిదిద్దిన శరీర సౌష్ఠవం ఆమెది. ఆ తర్వాత, ఆమె సాముగరడీ విద్యలలో ఆరితేరిన యువతి అని తెలిసింది. ఆకర్షణీయమైన ఆమె గుండ్రని ముఖంపై కన్పించే కొద్దిపాటి మచ్చలు కూడా ముచ్చటగానే వున్నాయి. విశాలమైన ఆమె నోటి చివరలు కిందికి వంగి చూడసొంపుగా వున్నాయి. స్థలవివరాలు, సందర్భం గుర్తుకురాకున్నా ఆమె నాకు పరిచయస్తురాలనిపిస్తోంది. జీవితం చాలా చిత్రమైంది!

"శాస్త్రసాంకేతిక సమాచార కేంద్రం ఇదేనా?" ఆమె అడిగింది.

నేను ఆమె వంక చూస్తూ సమాధా

నంగా తలుపుపైన కొత్తగా రాసిన ఫలకం వైపు కళ్లతోనే సైగ చేసి చూపించాను.

"కానీ ఇక్కడ ఏ హడావుడీ లేదే..?" చుట్టూ పరికిస్తూ అడిగింది.

"అవును! మేమింకా వచ్చిన సామగ్రిని సర్దుకోవడమే పూర్తికాలేదు" చల్లగా చెప్పాను. అంతలోనే నాకు- 'ముప్పైలలో ఉన్న స్త్రీ చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుంది' అని ఎప్పుడో ఏదో నవలలో చదివిన మాట గుర్తొచ్చింది.

ఆమె నావైపు స్థిరంగా, సాలోచనగా చూస్తూ.. "మీ వద్ద లోహాల అతుకులకీ, కోతలకీ సంబంధించిన విదేశీ సమాచారమేదైనా దొరుకుతుందా? అన్నట్లు నేను యిన్‌పింగ్‌ని. వెల్డింగ్ టెక్నీషియన్ని" చుట్టుపక్కలున్న ప్రతి వస్తువునూ నిశితంగా పరిశీలిస్తూ అంది.

"ఆ సమాచారం గురించి నువ్వే వెతుక్కో!"

"అలాంటివి మీదృష్టికి ఏమీ రాలేదా?"

"అక్కడ చాలా సమాచారముంది. మేం ప్రతీదీ చదవలేం" నా పక్కనున్న వాంగ్ సమాధానమిచ్చాడు. ఇతను కూడా ఈశాన్యం నుండే నాతో పాటిక్కడికి వచ్చాడు.

"ఎక్కడుందది?"

"అదిగో! అక్కడ..!" ఎదుటిగదివైపు చూపించాడతను.

ఆమె ముఖం చిట్లించుకుని పుస్తకాల, పత్రికల గుట్టలవైపు చూసింది. వెంటనే సంబాళించుకుని "ఇంకా ఏమైనా వున్నాయా?" అని అడిగింది.

"అబ్బో.. చాలా!" అని ఆమెకు సమాధానమిస్తూనే నేను వాంగ్‌తో ఆమెను ఎదురుగదికి తీసుకెళ్లమని చెప్పాను. వెనకనుంచి ఆమె ఆకారాన్ని పరికిస్తూ.. 'అబ్బో! ఇంకా కావాలా?' అనుకుంటూ ఆలోచించసాగాను.

ఆ గది నుండి యింగ్‌పింగ్ ఉద్వేగంతో వాంగ్‌తో చేసే సంవాదాన్ని నేను వింటూనే వున్నాను. తర్వాత ఆమె ఇంతక్రితం తాను వాయించిన పాటకు పొడిగింపుగా కూనిరాగం తీయసాగింది. 'ఇలాంటి స్త్రీలు సంగీతం పైన తప్ప ఇతర విషయాల పైనా అంత శ్రద్ధపెట్టరు' అనుకున్నాను.

కొంచెం సేపటికి ఆమె బైటికి వచ్చింది. మండువేసవి కావడంతో ఆమె చొక్కా చెమటతో తడిసి పోయింది. నా దగ్గరకు వచ్చి పరిశీలనగా చూస్తూ తీక్షణంగా- "మీరు పూర్తి చేయాల్సిన పని.. ఇంకా చాలా మిగిలిపోయింది" అంది.

"పోనీ! మీరో చేయి వేయండి" తిప్పికొట్టినట్లన్నాను.

"అంటే..? మీకు మీ ఉద్యోగం వూడుతుందనే భయం లేదా?" కనుబొమల మీది చెమటను తుడుచుకుంటూ గుంభనంగా నవ్వుతూ అంది. వెళ్తూ మళ్లీ వసారాలో అదే పాట పాడుతోంది. 'ముప్పైల లోని వివశురాలైన యువతి' అనే భావన మళ్లీ నాలో కలిగింది. మరుక్షణంలో మా సమాచార కేంద్రంలో నిమ్మళంగా కొనసాగుతున్న ప్రశాంతత ఈమె వల్ల భగ్నమవుతోందనే ఒక అసందర్భమైన భావం నాలో మెదిలింది.

**చైనా మూలం : ఝౌ జియాజున్**

**అనువాదం : యస్కె ఈశ్వర్**

ఆ తర్వాతి ఉదయాన ఏదో ఒక అనుకోని సంఘటన జరిగింది.

ఆరోజు నేను పెందలకడనే నిద్రలేచాను. షాంఘై పగటి ఎండ చాలా తీక్షణంగా ఉంటుంది. కానీ రాత్రులు మరీ దారుణం! పైగా మా వసతిగది బైట పోసి

వున్న యిసుక, కంకర పగటి వేడిమిని పీల్చుకుని రాత్రులు విడుదల చేస్తుం టాయి. ఆ చిరాకులో పరిపరి విధాలుగా ఆలోచించుకుంటూ కార్యాలయానికి చేరు కున్నాను. మా కార్యాలయం ఎదుటి గది తలుపు వోరగా తీసివుంది. లోపల ఎవరో వున్నారు. 'ఎవరక్కడ?' అన్న నా కంఠ స్వరం విని వాంగ్ బైటికి వచ్చాడు.

"ఎవరూ లేరు.. కొంచెం సేపటివరకూ యిన్‌పింగ్ వుందిక్కడ. రాత్రంతా ఆమె ఇక్కడే వుంది"

దిగ్భ్రాంతితో అడిగాను "కానీ.. ఆవిడ లోపలికెలా వెళ్లింది?"

"ఆమెకి తాళం చెవి నేనే ఇచ్చా"

'ఇది చాలా దారుణం' నాలో నేననుకు న్నాను. ఏదో ద్వైదీభావంతో నా చేతిలోని పట్టికను అక్కడుంచి, చిన్న కిటికీ సందు లోంచి గెంతి పుస్తకాలూ, పత్రికలూ చెల్లా చెదురుగా పడివున్న గదిలోకి వెళ్లాను. కొంతవరకు సర్దివున్న అరలను గమనించి ఆశ్చర్యపోయాను. కుతూహలంతో గది నంతా పరిశీలించాను. కాగితంలో చుట్టిన రొట్టె, జపాను, చైనా భాషలలో వివరాలు రాసి వున్న ఓ కాగితం, 'వెల్డింగు' సమా చారంపై రాసిన ఎన్నో ఆంగ్ల, ఫ్రెంచి భాషా గ్రంథాల దొంతరలు! ఏమిటి ఈవి డకేమిటి సంబంధం? నేనాశ్చర్యపో యాను.

తిరిగి నా కార్యాలయంలోని నా రాతబ ల్లల దగ్గరకొచ్చాను. అక్కడే వున్న వాంగ్ అన్నాడు "మనకు వచ్చిన సమాచార విజ్ఞాన సరుకును మనం సరిగ్గా వినియో గించుకోవడం లేదు ఓల్డ్‌వీ! మనం ఉప యోగించుకోని వాటినలా కుప్పలుగా పడ వేయకూడదు గదా!"

ఆ మాటలు నాకు కోపాన్ని తెప్పిం చాయి. కానీ నా కోపాన్ని అణచుకుంటూ మౌనంగా వుండిపోయాను. నా గది ముందు హడావుడి అడుగుల ధ్వని ఆగం తకురాలి రాకను తెలియజేసింది. నా ఉద్యోగ ఉద్వాసన గురించి ఆమె అన్న మాట గుర్తొచ్చి నా రోషం మరింత పెరి గింది.

"వాటిని తప్పనిసరిగా చదవాలి! అధ్య యనం చేయాలి! కాదనను. కానీ అవన్నీ డెబ్బైలలో ప్రచురించిన పుస్తకాలు. మరి ఎనభయ్యో దశకం వచ్చినా అవి అలాగే దిక్కులేనట్లు గుట్టలుగా పడుండాలని మీరు కోరుకుంటున్నారా?" ఆమె రాకతో పాటే హెచ్చిన ఆమె స్వరమూ వచ్చింది. ఆమె కళ్లు నన్ను పరీక్షిస్తున్నాయి.

ఆమె వైపోసారి దృష్టి సారించి నాలో నేననుకున్నాను..! ఈమెకేం తెలుసని? వి దేశీయులు మూర్ఖులు కారు. కేవలం టో పీని తలనుండి తీసివేసినంత సులువుగా తమ పరిశోధనా ఫలితాలను ప్రకటించ రు. తనకు పనికొచ్చే కొద్దిపాటి అనుబంధ పరిశీలనలను బేరీజు వేసేందుకు గాను, అంతటి అసంఖ్యాక ప్రచురణలను చద వడం సులభమైన విషయమేం కాదు!

"చూడండి.." ఆమె నాకు నచ్చచెబుతు న్న విధంగా మొదలుపెట్టింది- "దయచేసి దీనిని అనువదించి ఇవ్వగలరా? ఈ ఇంగ్లీషు అర్థం చేసుకోవడం నాకు కష్టంగా ఉంది. ఇది చిన్న కరెంట్ ప్లాస్మా కటింగ్ గురించిన సమాచారం. వాళ్లు ఈ పద్ధతిని 1972 నుండే ఉపయోగిస్తున్నారు" ఆమె తన చేతిసంచిలోంచి ఒక పత్రికను బైటికి తీసి నా చేతికిచ్చింది. వినడానికది అభ్య ర్థనలా వున్నా ఆజ్ఞాపిస్తున్నట్లుగానూ ఉం ది. తిరస్కరించే పరిస్థితి లేదు. ఆజ్ఞలిచ్చే నాయకులెప్పుడూ మిక్కిలి అధికారయు తంగా స్వరాన్ని పలికించకుండా వుండగల గాలి. అప్పటికి నా కోపం తగ్గి మౌనంగా వుండిపోయాను.

"నాకు తెలుసు. మీరిదిచేయగలరు. కుర్రాడు వాంగ్ చెప్పాడు, మీకు ఆంగ్ల భాషా పరిజ్ఞానం ఎక్కువని - ఏం వాంగ్



చెప్పావు గదా!" రూఢి పరచడం కోసం ఆమె అతనివైపు తిరిగింది.

నేను అప్పుడామెను తేరి పార చూశాను.. నేనెప్పుడో, ఎక్కడో ఆమెను చూశానన్న నమ్మకం బలపడింది. కానీ.. ఎవరో ఏమిటో, నేను గుర్తు తెచ్చుకోలేకపోతున్నాను.

నెమ్మదిగా మా చిన్న సమాచార కేంద్రం రూపుమారిపోయింది. నేనెంత ముందుగా వచ్చినా అప్పటికే పనిలో నిమగ్నమయిన వాంగ్ ఒళ్లంతా దుమ్ము కొట్టుకుని, ముఖంపైన మట్టిచారలతో కన్పించేవాడు.

"నువ్వేమిటి? ఇదంతా..? "

"పుస్తకాల విభజనలో నేను యిన్‌పింగ్‌కి సాయపడ్తున్నా!"

నిజానికి యిన్‌పింగ్‌కది సహాయమే! సమాచార సరంజామా ఎవరికి సంబంధించింది? ఆమెకా? మాకా?

"చూడు లీ! ఆమె ఇప్పుడు రోజుల తర

బడీ ఈ పనిలో వుంటోంది. మన వద్ద సమాచారం మొత్తం రెండు మూడు టన్నులుంటుంది. ఆమె తనక్కావలసిన వాటిని వెతుక్కుంటూనే వాటిని క్రమవిభజన చేస్తూ వుంది. ఆమెకు జపాను భాష మాత్రమే తెలుసు. ఇతర పేర్లు తదితరాల కోసం నిఘంటువులలోకి వెళ్తుంది. వెళ్లి ఒకసారి చూడు- ఆ గది నేలంతా ఆమె చెమటధారలతో తడిసిపోయి వుంది" అతను పూర్తిగా ఆమెపట్ల గౌరవభావంతో వున్నాడు.

"దేని గురించి ఆమె ఇంతగా శ్రమిస్తుందో నీకు తెలుసా?" నేనడగకుండా

**కొత్తగాలి...**

**'కామన్‌మేన్' తోడున్నాడని**
**బతికేస్తున్న 'కామన్‌మేన్'**
**లక్ష్మణ్‌తోపాటు పోగొట్టుకున్నాడు**
**'కామన్‌మేన్'ని**
**ఇక తోడెవరు?**

– తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్

వుండలేకపోయాను.

"నిర్మాణ ప్రక్రియను వేగవంతం చేయగల ఏదో నూతన విధాన రూపకల్పన కోసమట!"

'నిజంగా..?' సంభ్రమంతో 'అదీ ఒక ఆడది..!' నాలో నేను ఆలోచనలో పడ్డాను.

ఒక విశ్రాంతి దినాన నేను ఉదయాన్నే గ్రామం దాటి మూడు కిలోమీటర్లు నడిచి, పొదవాటి బూరుగు చెట్లను దాటి నది పక్కనున్న గట్టు వరకూ వెళ్లాను. చల్లని ఉషోదయ పవనం.. అలల శబ్దంతో కదులుతున్న నది.. ఎగురుతున్న పక్షులు.. ఇవన్నీ.. నిర్మాణ కేంద్ర ముఖ్యుడొకరు ఒకరోజు నాతో ఏం చెప్పాడో గుర్తుకు తెచ్చాయి! సరుకులో, డబ్బో, భూమో వీటిలో దేనికోసమో జనంచేసే ఆందోళన చెవుల్లో హోరుమనిపిస్తున్నపుడుగానీ, నిర్మాణ ప్రణాళికలు సాలెగూడులా గజిబిజిగా అనిపించినప్పుడు గానీ.. వాటన్నింటినీ వదిలేసి ఈ గట్టు ప్రాంతాలకు వచ్చి కొద్దిసేపు చల్లని గాలిని పీల్చుకోవడమే ఉత్తమమైన పని' అని. అది నిజమే అనిపిస్తోందక్కడి వాతావరణం చూశాక.

కానీ, వైవిధ్య భావజాల ద్వేషంతో 'దుష్ట చతుష్టయం' కొనసాగించిన హింసలో చనిపోయిన నా భార్యను గానీ, ఇంకా ఈశాన్య ప్రాంతంలోనే వుండిపోయిన నా కొడుకు స్థితిని గానీ నేను మరిచిపోలేకపోతున్నాను. ఆ చేదునిజం నాలో అలా మిగిలిపోయింది.

హఠాత్తుగా నా దృష్టి ఓ రాయి కింద పెట్టివున్న కొన్ని ప్రణాళికా పటాల నమూనాలు (బ్లూప్రింట్లు) పెన్సిళ్లపై పడి నడక ఆపాను. అవెవరివో? వాళ్లెక్కడున్నారో..? చుట్టూ పరికించాను. చుట్టుపక్కలెంత చూసినా ఎవ్వరూ కనిపించలేదు. నదిలో అయిదారొందల మీటర్ల దూరాన అలలతో కలగలసి ఒక నల్లని బిందువు అటూ ఇటూ కిందికీ పైకీ ఊగుతూ తేలుతూ కన్పించింది. నా కళ్లను 'స్క్రూ'లా తిప్పుతూ దృష్టి సారించాను. అది - ఆనకట్ట వైపు వస్తున్న ఓ ఈతగానిగా గుర్తించాను.

'గొప్ప సాహసం!' నాలో నేను గొణుక్కున్నాను. ఆనకట్ట వద్దకు నడుస్తూ.. ప్రవాహ కదలికను బట్టి నీళ్లు ఒడ్డువైపు సుడులు తిరుగుతున్నట్లు గమనించాను. నీటిలో నుంచి ఒక్కసారిగా తడిసి ముద్దయివున్న యిన్‌పింగ్ ఒడ్డుపైకి గెంతింది. దృఢమైన ఆమె శరీరాన్ని చూస్తూనే - నిట్టూర్చి - "నువ్వు జీవితాన్ని సాహసంతో ముడిపెడుతున్నావు సుమా!" అన్నాను.

"లేదు. జీవితపు విలువంటేనే మృత్యువుతో పోరాటం" నవ్వుతూ తన తడిసిన

జుట్టును పిండేస్తూ రెల్లుపొదల్లోకి పరుగెత్తిందామె.

నేను నా చూపుల్ని చుట్టుకుంటూ పోతున్న అలలవైపు తిప్పాను.

ఆమె పాడటం ప్రారంభించింది.

'యాంగ్జీనది సముద్రుణ్ణి
కౌగలించుకుంటుంది
కంప్యూటర్లు పాత దస్త్రాలను
తుడిచేస్తున్నయ్యి
లోహ సంయోగంలో
వెలువడే విస్ఫుకణాల్లా
చతుర్విధ ఆధునీకరణల
శక్తిని వికసించనియ్యి'

ఆమె తన పొడవాటి వెంట్రుకలను విదిలిస్తూ, శుభ్రమైన బట్టలతో ఆమె మళ్లీ తిరిగి వచ్చింది. ఎండకి కందిన బంగారు చాయ ఒంటితో ఆమె గులాబీలా వుంది. అక్కడున్న ప్రణాళికా నమూనా కాగితాల వద్దకు నడిచి, ఒక్కక్షణం వాటిని పరిశీలించి మళ్లీ తన జుట్టునోమారు పిండుకుంది.

నేను ఆమెతో మాట్లాడాలని కుతూహలపడ్డాను - అవకాశం ఎదురు వచ్చినా గానీ ఎందుకనో నా గొంతు మూగపోయింది.

"ఇక్కడ చాలా సుందరంగా వుంది"

"అవును!"

"మీరిక్కడకు నడకకి వచ్చారా? " హఠాత్తుగా అడిగింది.

"నాకీ ప్రదేశం ఇష్టం.. అందుకే వచ్చాను"

"మీరేదో పరధ్యానంగా వున్నట్లున్నారు? " ఆమె నావైపు తదేకంగా చూస్తూ అడిగింది.

"నాకు తెలీదు!"

"మీరెందుకు శ్వాసిస్తున్నారో మీకే తెలియదంటారా? " ఆమె పరిహాసం పాడుస్తున్నట్లుంది. ఒక చిన్నరాయి నందుకుని నీటిలోకి విసిరింది.

"నీకు.. సంగీతమంటే చాలా యిష్టమనుకుంటా..? "

"అవునండి! నేను ఫిడేలు వాయిస్తాను. ఉచ్ఛస్వరంలో పాడతాను. పాటల బాణీలు కూడా కూరుస్తాను" చాలా స్వచ్ఛంగా నిజాయితీగా చెప్పింది.

"మీ వయసువాళ్లు చాలా స్వేచ్ఛగా, తుళ్లుతూ వుంటారు. నీ వయసింకా ముప్పైయ్యే - అవునా? " ఆమె సంతోషానికి అసూయపడుతూ పెద్దగా నవ్వాను.

వెంటనే ఒక్కసారిగా ఆమె చూపుల్లోని ఉల్లాసవంతమైన వెలుగు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయి, ముఖం గంభీరంగా మారిపోయింది. తన కింది పెదవిని పై పంటితో గట్టిగా నొక్కిపట్టింది. నేను చింతాక్రాంతుణ్ణయ్యాను. నేనేమైనా పాత గాయాన్ని రేపానా? లేకుంటే ఏదేని సంఘటనతో మానసిక స్థిరత్వాలు ఊరికే మారిపోయే స్త్రీలలో ఈమె కూడా ఒకర్తేనా?

కాసేపు ఇద్దరు నిశ్శబ్దంగా గడిపాం. మాకు దిగువన నదీజలాల్లో నురుగు ఒడ్డుకు కొట్టుకుని ఛిద్రమౌతోంది... ఓ సముద్రపు కాకి తరంగాల మీదుగా పైపైన ఎగురుతోంది.. వేసవిగాలి రాక ముందే చేపల పడవలు నదిలో కదలిపోతున్నాయి. నేను అంతకముందు ఇక్కడికెప్పుడువచ్చినా ఆ అనుభూతులేవీ నాకు గుర్తులేవు. కానీ, ఈసారివి మరచిపోవడానికి సాధ్యం కానివి.

"నువ్వు కోరిన ఆంగ్లవ్యాసం తర్జుమా త్వరలో పూర్తవుతుంది! చాలా కాలం ఈ పనికి దూరంగా వుండటం వలన నేను ఆంగ్లం మరచిపోయానేమో అని భయపడ్డాను"

"ఎంత త్వరగా అయితే అంతమంచిది" నా సహాయానికి ధన్యవాదాలు చెప్పకపోగా- అసంతృప్తిగా చూసింది. తర్వాత వివరణగా అంది- "మనమిప్పుడు నూతన

కల్పనల సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయో గించే యత్నంలో వున్నాం" కొంచెం ఆగి మళ్లీ అంది.. "మన ప్రణాళికలను నిరా టంకంగా ముందుకు తీసుకువెళ్లడానికి భూమిని తవ్వేముందు ఉక్కు దుంగలను చొప్పిద్దామని నేను సూచించాను. కొంత మంది అనుభవజ్ఞులైన శ్రామికులతో ఈ విషయమై చర్చించాను. అయితే కొందరు ఒప్పుకోలేదు. మిగతావాళ్లు విదేశీ ప్రామా ణికులు ఏనాడూ యిలా ప్రయత్నించలేద న్నారు. అప్పటికీ నేను ప్రతిసారీ కేవలం ఆ విదేశీ పద్ధతులనే పూర్తిగా అనుకరించ లేమని గట్టిగా వాదించాను"

విదేశీ నిపుణుల గురించి ఆమె వాదించ డానికి సిద్ధమవడం నాకు ఆశ్చర్యమనిపిం చింది. అయితే ఆమె ధీమాను నేను అభి నందించాలి.

"శ్రామికులలో చాలామందికి చాలా తెలుసు. కానీ నోరు తెరవడానికే వాళ్లు భయపడతారు. మరి ఎంతోకొంత నువ్వే ఎందుకని చెప్పవు? నువ్వు నన్ను నమ్మడం లేదా? "

"అవునేమో..!" ఆమె ఈ విశేష వ్యాఖ్యానం మేకును సూటిగా నెత్తిన కొట్టి నట్లుంది. కందిన ముఖంతో కొద్దిపాటి సమాధానమియ్యడానికి ప్రయత్నించాను- "నీ ధైర్యానికీ, విశ్వాసానికీ నిన్ను ప్రశంసి స్తున్నా.."

"ప్రశంసించడమా? కానీ నాకు మీరు మద్దతివ్వరుగదా! ఇస్తారా? "

"నేను.. నేనలా.. చిక్కులు చుట్టుముట్టే విషయంలో.. స్పందించను.." తడబడుతూ అన్నాను.

ఆమె పగలబడి నవ్వింది. నేనొక పెద్ద నిట్టూర్పు విడిచాను.

"సంగతేమిటి? చేదును చవిచూ శారా..? సరే! మీలో ఏవో గాయాలు న్నాయి. ఈ శ్రమ ఇక్కడి వాతావరణం వాటిని మానిపోయేలా చేస్తుందని ఆశిద్దాం!"

చాలామంది సాంకేతిక నిపుణులూ, శ్రామికులూ కలిసి భూగర్భంలో 'ప్లాస్మా' తో లోహాల్ని తెగనరికే విధాన రూపకల్పన చేస్తున్నారనీ అది గనక ఒనగూడితే ఉక్కు దుంగలను చొప్పించిన తర్వాత భూమి లోని ఉక్కుకంబాలను ఛేదించడం సులభ సాధ్యమవుతుంది. ఆపైన ఉక్కు కార్ఖానా నిర్మాణం అత్యంత వేగవంతమవడానికి దోహదపడుతుందని యిన్‌పింగ్ ఆరోజు వెళ్లిపోతూ చెప్పింది గుర్తొచ్చింది.

"అంచేత ఇంకా ఎక్కువ సాంకేతిక పరి జ్ఞాన సమాచారాన్ని మీరు మాకు ఇవ్వక తప్పదు. కొద్దిరోజులలో నేను మీ దగ్గరకొ స్తాను. మీ అవసరం నాకుంది! అంటే.. మీ శాఖ సాయం నాక్కావాలి" అంటూనే ఆమె- ఎర్రపూల టవల్‌ను విసురుగా భైట కులాగి ప్రణాళికా పటాల నమూనాల నక ళ్లను చుట్టచుట్టి పట్టుకుని కదలి వెళ్లిపో యింది.

ఆమె మళ్లీ యిటువైపు రాలేదు. కానీ, ప్రతి సాయంత్రం మా సరుకు నిల్వగదిలో పుస్తకాల, సంచికల మధ్య కూరుకుపోయి నాకు కనిపిస్తూనే వుంది. వాంగ్ సహా ఆమెకు నలుగురు సహాయకులున్నారు. తరగతుల వారీగా విభజించి సమాచార సామగ్రిని సర్ది నిల్వచేయడానికి కావలసిన అలమరాల తయారీలో వాళ్లు ఉపయోగి స్తున్న సుత్తులు, బాడిశలు, ఉలుల శబ్దాలు నా గదిలోకి వినిపిస్తూనే వున్నాయి. నేను వాటిని పట్టించుకోకుండా ఉందామనుకున్నాగానీ ప్రతిసారీ అది నాక సాధ్యమవుతూనే వుంది. విదేశాల నుండి వచ్చిన సమాచార సరుకంతా ఇప్పుడు వాళ్ల చేతులగుండానే కదిలిపోతూవుంది. ఎందుకో తెలియదుగానీ.. ఎంతో శ్రమిస్తూ పనిచేస్తున్న వాళ్లను చూస్తూం డడం వలన కావచ్చు. నా అనువాదం పని కూడా వేగం పుంజుకుంది.



ఇతర శాఖావిభాగాలు సహాయం చేయడంవలన ముఖ్య నిర్మాణానికి అనుబంధ ద్వైపాక్షిక నిర్మాణాలు పూర్తయ్యాయి. ఇప్పుడిక మిగిలివున్న సమస్యేమిటంటే మొదట దుంగలను చొప్పించటమా? లేక భూమిని తవ్వడమా? అనేది. దీనిపై చర్చ పార్టీ ప్రధాన ఆలోచనా సభ ముందు కెళ్లింది. ఎంతో అనుభవజ్ఞులైన నిపుణులు ఆ సమావేశంలో పాల్గొన్నారు.

చర్చ మధ్యలో యిన్‌పింగ్ లేచి నిలబడింది. అంతటి నిపుణుల సమక్షంలో కూడా ఆమె ఆత్మవిశ్వాసంతో మాట్లాడింది.. "నేను యిన్‌పింగ్‌ని! వెల్డింగ్ టెక్నీషియన్‌ని! ఈ సమావేశంలో పాల్గొనేందుకు నాకు ఆహ్వానం లేకపోయినా.. మీరు నన్ను మన్నిస్తారనుకుంటున్నా.. నేను మాట్లాడాల్సింది వుంది.." ఈ మాటలతో సభలో గలగలమని నవ్వులు వినిపించాయి.

"స్వాగతం! రండి!" ముఖ్యనిపుణుడు చిరునవ్వుతో ఆహ్వానించాడు.

ఆమె కొనసాగించింది.. "నేను సూచించేదేమిటంటే..? మనం భూమిని తవ్వే ముందు.. ఉక్కు దుంగలను చొప్పించాలి. ఇతర దేశాలలో వారివారి ప్రాంతీయ అనుకూలత ననుసరించి వాళ్లు మరోవిధంగా చేస్తారు. కానీ, ఇక్కడ మనవి ప్రత్యేక పరిస్థితులు.. మనం యిలా.. చేసిచూద్దాం.." చెప్తూనే ఆమె తను కూర్చున్న స్థానం నుంచి లేచి వచ్చి ముఖ్యనిపుణుని వద్ద

నుండి పొడవాటి కర్రను తీసుకుని గోడకు వేలాడుతున్న భూసంబంధమైన రేఖా పటం వద్దకు వెళ్లింది. ఆమె నిర్భయత్వం నన్ను దిగ్భ్రాంతికి గురి చేసింది. ఆమె ధైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్ని ప్రశంసించా ల్సిందే.. కానీ, అంతటి గొప్ప నిపుణులు, నాయకుల పట్ల ఆమె తగిన గౌరవ, మర్యాదలు చూపకపోవడం నాకు నచ్చలే దు. వాళ్లతో అలా మాట్లాడేది ఆమె కాదు! అన్నంతగా వికారం కలిగించింది.

అదే క్షణాలలో ఓ వ్యక్తి లేచి అడిగాడు- "మీ ఆలోచన ప్రకారం ముందుగా ఉక్కు దుంగలను చొప్పించడంలోనే ఎక్కువ ఉప యోగాలున్నట్లయితే మరి విదేశాలలో వాళ్లె ప్పుడూ ముందు భూమిని తవ్వే పనినే చేపడతారెందుకు? "

"ప్రధానమైన తేడా.. నేననుకోవడం.. భూగర్భంలో పునాదుల కోసం చొప్పించిన ఉక్కుకంబాలను ఛేదించే సాంకేతిక పరి జ్ఞానం వాళ్లింకా సమకూర్చుకోలేదని.."

దీంతో చర్చ వేడెక్కింది. "శాస్త్రీయమైన వివాదాల సమయంలో మనం 'నేననుకుం టాను' అనేమాట వాడలేం.. నీ వాదానికి ఆధారమేమిటి? " మరోవ్యక్తి సవాలు విసి రాడు.

"ఈ విషయంపైన వెలువడిన అనేక మైన సాధన సమాచార సాహిత్యాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేసి వుండడమే నా వాదానికి ఆధారం"

"సమాచార కేంద్రం నుండి ఎవరైనా ఇక్కడికొచ్చారా? " ముఖ్యనిపుణుని చూపు చుట్టుపక్కలంతటా పరికిస్తూ తిరిగి తిరిగి నాపైన నిలిచింది.

"ఆయన.. ఓల్డ్‌వీ యేనా? "

"అవునండి!" నేను లేచి నిలబడ్డాను. "ఆమె చాలా అధ్యయనం చేసింది"

"వెరీగుడ్" ఆయన చిరునవ్వుతో ఆమె వైపు తిరిగాడు. "సరే మీ నిశ్చితాభిప్రాయా లేమిటి? "

"మేం ప్రయోగాపూర్వకంగా చేద్దామని.. డెబ్భైలలో కనిపెట్టిన 'ప్లాస్మా'తో లోహాన్ని ఛేదించే నూతన విధానాన్ని చేపట్టడం ఉత్తమ పద్ధతని అనుకుంటున్నాం. బంక మన్ను లేదా నీళ్ల వలన దానికెలాంటి హానీ జరగదు కాబట్టి భూమిలోపలి ఉక్కు కంబాలను నరకడానికి మనం ఈ విధా నాన్ని చేపట్టవచ్చు"

"దీని గురించి ఎంతకాలంగా పనిచేస్తు న్నారు? " ఆయన కుతుహలం పెరిగింది.

"కేవలం ఒకమాసం..! దీనిని రహ స్యంగా వుంచాలనుకున్నాను.. కానీ.." తన పరిశోధనల వివరాలను ఆయనతో వెల్ల డిస్తూ.. ఒక్కసారిగా ఆమెకు సిగ్గుముంచు కొచ్చింది.

"ఓహో! మీరు మీ భూగర్భంలోహ విచ్ఛేదన విధానాన్ని మీ మనో భూపొరల లోనే దాచేయాలని ప్రయత్నించారా? " ఆయన హాస్యోక్తి అందర్నీ నవ్వుల్లో ముంచింది. ఆయన ఆమెవైపు ప్రశంసగా తలూపుతూ.. "బాగుంది! అదే ఉత్సా హంతో కొనసాగించండి మరి! సమస్యలే మైనా వున్నాయా? " అడిగాడు.

"చాలా వున్నాయండీ! మేమింకా ఎంతో శాస్త్ర, సాంకేతిక సమాచారాన్ని అధ్య యనం చేయాల్సిన అవసరం వుంది. మా ఆ...శ..." ఆమె చూపులు నా వైపు తిరి గాయి. "మా ఆశ... సమాచార కేంద్రంలో వుండే ఓల్డ్‌వీ మా ప్రయత్నా లకు అండగా వుంటూ మాకెంతో సహాయ కారిగా వుండాలని.."

"ఓల్డ్‌వీ! విన్నారా? " ముఖ్యనిపుణుడు అడిగాడు.

ఆ సమావేశం ఎలా ముగిసిందో నాకు గుర్తులేదు. నాకు చాలా బాధ కలిగినప్ప టికీ యిన్‌పింగ్‌ని తప్పుపట్టలేదు. ఆమె నన్నర్థం చేసుకుంది కొంచెమే..! నేనూ ఆమెనంతే..!

ఆ సాయంకాలం.. నేను అనువదించిన

సమాచారాన్ని కొంత, ఆమె కోసమని వాంగ్ సేకరించిన కొన్ని కాగితాల చుట్టను పట్టుకుని వెళ్లాను.

ఆమె వుంటున్న ఇల్లు అతి సాధారణ మైన చిన్నకుటీరం. లోపలికి ప్రవేశించే ముందే.. లోపల ఆమె వాయిస్తున్న ఫిడేల్ ధ్వని వినిపించింది. ఆ రాగ తరంగం ప్రసిద్ధ స్పానిష్ సంగీతజ్ఞుడు కూర్చిన రాగశ్రావ్యతను మంద్రధ్వనిలో స్ఫురింపజేస్తూ సాగుతోంది. వాయులీన వాద్యకారులు ఈ సంగీత రసజ్ఞుని కూర్పు లను వారి వారి అవగాహన మేరకు రకర కాలుగా తమలోకి అనూదితం చేసు కుంటుంటారు. అందలి కవితాత్మ, భావగ ర్భిత ధ్వనులు నా గుండెని తట్టాయి. ఈమె సంగీతాన్ని కూడా ఇంతగా ప్రేమి స్తుందని నేనెప్పుడూ అనుకోలేదు. తలుపు వారగా తీసి ఉండటంతో నా ఆగమనం ఆమె సంగీత సాధనకు ఆటంకమైంది. తను అటునుండి ఇటు తిరుగుతూండగా ఆమె కళ్లలో నిండివున్న నీటిని చూసి ఆశ్చర్యపోయాను. వెంటనే - సూచనలే కుండా అమర్యాదగా అలా నేను లోనికి వచ్చేయడం - నాకు కలవరపాటును కలి గించి, మాటా పలుకూ లేకుండా చేసింది.

"నేను ఫిడేలు ప్రేమికురాలినండీ! నిరం తర సాధనతో ఎంతో అభ్యసించాను-" తలవంచి అభివాదం చేస్తున్నట్లభినయిస్తూ కుదిరికలేని కదలికతో తల కిందికి వాల్చి - అసలేమి జరగలేదన్నట్లుగా అతి సహజ ధోరణిలో అంది.

"సంగీతమంటే నాకూ ప్రేమే? నువ్వు నిజంగా చాలా అద్భుతంగా వాయిస్తు న్నావు! నిజాయితీగా-" చివరిమాట ఎందుకు అన్నానో నాకే అబ్బుర మనిపిం చింది.

"నిజాయితీగానా? అంటే ఏమిటి మీ భావార్థం? " నవ్వింది.

"అసౌకర్యంగా ఉన్న నా ఈ కుటీరాన్ని ఇదే మీరు ప్రథమంగా సందర్శించడం- దయచేసి కూర్చోండి"

ప్రణాళికా నమూనాలు దొంతరగా పేర్చి వున్న ఒక మేజాబల్ల దగ్గర కూర్చున్నాను. అక్కడ సుమారు అయిదేళ్ల వయసున్న ఓ పాలబుగ్గల పాపాయి ఛాయాచిత్రాన్ని గమనించాను. ఈమె కూతురా..?

"అవును! అది నా కూతురు..! ముద్దుగా వుంది కదూ? " నేనా చిత్రాన్ని పరికించి చూడటం గమనించి ఆమె కించిద్గర్వంగా అంది.

"అవును, తాను తండ్రితో ఉంటోందా? "

"లేదు, తనకు తండ్రి లేడు" తటాలున అంది.

"అరే, బాధాకరం..!" ఏలాంటి ఆందో ళన, బాదరబందీ లేనట్లుండే ఈ యువతి కూడా వ్యక్తిగతంగా విషాదాలననుభవించి ఉంటుందని నేననుకోలేదు.

ఈమె తండ్రి ఫ్రెంచి దేశంలో ఆటోమొ బైల్ ఇంజనీరింగ్ చదివాడు. చైనాకు తిరిగి వచ్చిన తర్వాత హెనన్‌లోని ట్రాక్టర్ల తయారీ కార్ఖానాలో పనిచేశాడు. 1957లో ఆయన తన నాయకుణ్ణి విమర్శించిన కార ణంగా వామపక్ష భావ వ్యతిరేకి' (రైటిస్ట్) అనే ముద్రవేశారు. అప్పటి నుండే - తన యావచ్ఛక్తినీ సమసమాజ నిర్మాణానికి అంకితం చేసి పనిచేసిన ఈ వివేకశీలి కుటుంబానికి - ఒక దుర్ఘటన వెంట మరోటి సంభవిస్తూనే వచ్చాయి. తన దుర్మార్గపు వేధింపులతో దిగులుపడి భార్య రెండేళ్లకు మరణించింది. తెలివైన పిల్ల యిన్‌పింగ్ పెంపకం బాధ్యతను ఒక బంధువుకు కేటాయించారు. కుటుంబ సమస్యలలా ఉన్నప్పటికీ వాటిని అధిగ మిస్తూ చదువును కొనసాగిస్తూనే తండ్రి దగ్గర ఫిడేలు వాదనను నేర్చుకుంది. తన పదహారో ఏట ఈమె సాముగరిడీ విద్యల నేర్పరిగా ఒక పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. బీజింగు బాలల భవనం ఎర్రతివాచీపైన

ఈమె ప్రదర్శనలను తిలకించి ప్రేక్షకులు పులకించిపోయేవారు. విశ్వవిద్యాలయంలో పట్టభద్రురాలైన తర్వాత ఆర్క్ వెల్డింగు పని కోసం సాంకేతికశాస్త్ర పరిశోధనా బోధనశాలకు వెళ్లింది. చివరికొక బాయిలరు పరిశ్రమ నిర్మాణంలో సహాయకురాలిగా ఉన్న సమయంలో ఒక లోహాల అతుకు సమస్యను అధిగమించడంలో సహాయపడటమే కాకుండా ఒక పత్రికలో తన పరిశోధనా వ్యాసాలను ప్రచురించింది. సహజంగానే - 'దుష్టచతుష్టయ' కాలంలో అంతటి మేధావినిగా పేరొందిన ఈ యువ సాంకేతిక నిపుణురాలు కూడా సరిహద్దు ప్రాంతంలోని ఒక గుత్త వ్యవసాయ క్షేత్రానికి ఒక శ్రామికురాలిగా రావాల్సి వచ్చింది.

ఇదంతా చెప్పిన తర్వాత ఆమె ఛాయా చిత్రాన్ని చేతిలోకి తీసుకుని దీక్షగా చూస్తూ- "నేనక్కడికి నా బిడ్డను తీసుకుని వెళ్లాను. తన వయసప్పుడు కేవలం మూడుమాసాలు" అంది.

నేను దిగ్భ్రాంతి చెందాను. హఠాత్తుగా నా బుర్రలోని చిక్కుముడి విడిపోయింది. ఇంతకుముంద నేనామెను ఎక్కడ చూశానో గుర్తొచ్చింది. "అప్పుడొక సాముదాయక సంఘం (కమ్యూన్) వాళ్లు వచ్చి తమ మాధ్యమిక పాఠశాలలో ఆటపాటలు నేర్పేందుకని ఆహ్వానించింది నిన్నేకదూ? "

"అది మీకెలా తెలుసు? " ఆమె ఆశ్చర్యపోయింది.

"అదే వ్యవసాయక్షేత్రంలో నేనూ పనిచేశాను గనుక- నేను వచ్చిన రోజు నువ్వప్పుడే ఓ గాడిదబండి మీద వెళ్లిపోతున్నావు"

ఆమె కళ్లల్లో మళ్లీ నీళ్లు చిప్పిల్లాయి.

నేనా దృశ్యాన్నింకా చూడగలుగుతున్నాను. ఆ సాయంత్రంవేళ గాడిద లాక్కెళ్తున్న ఓ బండి దడదడ శబ్దం చేస్తూ కొండదారి వైపు వెళ్తూవుంది. ఆ బండిలో ఓ యువతి కూర్చుని ఉంది. వెలిసిపోయిన పూల రుమాలును ముఖాన మేలి ముసుగులా వేసుకున్నందువల్ల దిగులు కమ్మిన కళ్లు తప్ప ఆమె ముఖ భాగం చాలా వరకు కన్పించలేదు. ఆమె అలా వెళ్లిపోయిన తర్వాత అక్కడున్న ఆమె సహోద్యోగులు ఆమెకు జరిగిన అన్యాయం, అనాదరణ గురించి కోపంగా, సానుభూతిగా మాట్లాడారు. వాళ్లనుండి నేను తెలుసుకున్నదేమిటంటే - సాంస్కృతిక విప్లవకాలంలో ఈమె తండ్రికి ఎదురైన సమస్యలను తిరిగి వెలికిలాగి అందులో ప్రమేయం కూడా ఉందనే అభియోగం మోపి తనను చిక్కుల్లో పెడతారేమోననే భయంతో ఆమె భర్త ఆమెను వదిలేశాడనీ, విడాకుల రోజు ఒక్కమాట కూడా మాట్లాడకుండా ఆమె పాపను తీసుకుని అతని నుండి వెళ్లిపోయిందనీని.

"నేనతన్ని అసహ్యించుకున్నాను - అయితే బహుశా క్షమించాను కూడా. ఆ రోజుల్లో మేమెంతగా తీవ్ర అనాదరణకు గురయ్యామో మీరూహించలేరు"

నిశ్శబ్దం అలముకుంది. అలా ఆమె ప్రదర్శించిన కరుణరసాత్మక విషాదగీతాన్ని నేను నిశ్చల సమాధిలో ఉండి విన్నట్లయింది. తల్లిమరణం, సిద్ధాంత ద్వేషంతో తండ్రిపై హింస, తనను వదిలి పారిపోయిన భర్త పిరికితనం - అన్నీ ఈ యువతిని తాకాయి.

"తిరిగి మన చర్చలలోకి వెళ్దాం పదండి" తన దురదృష్టాలను మరిచిపోడానికన్నట్లు తలను విదిలిస్తూ అంది. ఆమెకు సాంత్వన చేకూర్చడానికి కళ్లెత్తి ఆమెవైపు చూశాను, కానీ నాకు మాటలు కరువయ్యాయి. ఈమె గాథ నా వ్యధలను గుర్తుకు తెస్తోంది. సంగీత ప్రతిధ్వనిని ఆలోచనలలో నిలుపుకుంటూ మౌనంగా కూర్చోడానికే ఇష్టపడ్డాను.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ - "దాని గురించి

ఏమాత్రం ఆలోచించకండి - దీని వలన మన పని ప్రభావితం కాకుండా చూసుకోవాలి" అంది.

నేను నిట్టూర్చాను. "నువ్వు మరిచిపోవాలనుకుంటున్నావా? అది ఎప్పటికీ కుదరదు"

"కావచ్చు" నిశ్చయంగా అంది. "కానీ, మనకు తగిలిన దెబ్బే మనకు బలమిస్తుంది. మనం బతికి ఉన్నంతకాలం మన శరీర గాయాల మచ్చలే మనం మన మాతృభూమికి ఎంతగా సేవలందించగల మనే విషయాన్ని ఆమె ఆలోచించుకోడానికి సహాయపడతాయి? "

అదిగో! అప్పుడే వాస్తవంగా నేనామెను అర్థం చేసుకుంది. నిర్లక్ష్యధోరణిలో ఆమె కనిపించినప్పటికీ ఆమెలోని వీరావేశం నాపై ప్రభావం చూపింది. దాంతో నేనామెను ఓ కొత్తకోణంలో చూడసాగాను.

ఆ రాత్రి చాలాసేపటి వరకూ నేను నాపడకమీద అటూ ఇటూ పొర్లడంతోనే సరిపోయింది.

వేసవి వెళ్లిపోయింది. వేడి ఏమాత్రం తగ్గలేదు. అయినప్పటికీ మా పనికేం ఆటకం కలగలేదు. వాస్తవానికది క్రమాభివృద్ధి చెందింది. మా కార్యాలయం తరచూ రాత్రివేళల్లో కూడా తెరచి ఉండేది. మేం యిన్‌పింగ్ పరిశోధనా బృందానికి సాధన సాహిత్య సరుకునందించడమే కాకుండా వివిధ విభాగాల నుండి ఎందరో వ్యక్తులను ఆకర్షించేలా చాలారకాల విదేశీ పుస్తకాల, సంచికలతో ఒక ప్రదర్శనను నిర్వహించాం. ఇకపై ఎంతమాత్రమూ కాలాన్ని వృధాపరచడమనేదే లేదు. ఎంతోపని వత్తిడి ఉన్నప్పటికీ మేం ఇదివరకటి కంటే చాలా సంతోషంగా ఉన్నాం. ఒకసారి నేను కొంత సమాచార సరంజామాతో ఇన్‌పింగ్ కార్యాలయానికి వెళ్లినప్పుడు ఆమె కళ్లకి కట్టు కట్టి ఉండడం చూశాను. అలాంటి స్థితిలోనూ ఆమె చేతులింకా పని హడావుడిలోనే కదులున్నాయి.

"మా లోహాల అతుకు పనివాళ్లకు ఇలా కళ్లబాధలు తప్పవు. ఈ విషయంలో వాళ్లు నన్ను క్షమిస్తారనుకుంటా" నవ్వుతూ అందామె.

ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న వార్త ఓ శుభసమయాన వచ్చింది. యిన్‌పింగ్ ప్రతిపాదించిన 'ప్లాస్మా'తో భూగర్భలోహ విచ్ఛేదన సూత్రం సఫలమైంది. ప్రజలు ఎంతగానో ఆశలు పెట్టుకున్న ఉక్కు కార్ఖానా నిర్మాణం ఇకపై అనుకున్న ప్రకారం కొనసాగుతుందనే విషయాన్ని ఎలుగెత్తి చెబుతుందా అన్నట్లు గుట్టలలో గట్టిగా దిమ్మిశ కొడుతున్న యంత్రాల ధ్వనులు వినవచ్చాయి. పనిప్రదేశమంతటా ఉత్సాహవంతమైన వాతావరణ అలుముకుంది.

"ఇప్పుడు మీరు చాలాపని సందడిలో ఉంటున్నారు.. మీ ప్రదర్శన గొప్ప విజయవతం!"

సుపరిచితమైన కంఠస్వరాన్ని వింటూనే అటు తిరగగానే యిన్‌పింగ్ నా ముందు నిలబడి ఉంది. సంతోషంతో ఆమె ముఖం వెలిగిపోతోంది. ఆమె నీలం ఉడుపులపైన అలంకరించి ఉన్న ఓ గుర్తింపు ట్యాగూ, మరో మెరుస్తున్న చిహ్నం ఆమె సమగ్రతార్హతలను తెలియజేస్తున్నాయి.

"చూడండి!" తన గుండెల వద్ద వేలుంచి, నాకు చాలా దగ్గరగా వచ్చింది. ఆమె కున్న ట్యాగ్ పైన 'ఇంజనీర్' అన్న పదం చూసిన నాకు చాలా ఆనందం కలిగింది.

"అభినందనలు" ఆమె చేతిని నా చేతుల్లోకి తీసుకున్నాను.

"ధన్యవాదాలు..! కానీ, నా పదోన్నతికి నన్నభినందించొద్దు! అయితే మన కార్ఖానా నిర్మాణం పని అనుకున్న సమయానికి అనుకున్నట్లు ప్రారంభించుకున్నందుకు.. అభినందనలు!"

©

పెద్ద కథ

# పిన్నవాడి పెద్దమనసు

చీకటి పడుతోంది.. 'టు' అనే వ్యక్తి సైకిలుపై నెమ్మదిగా వెళుతున్నాడు. ఈ వేసవిలో 'టు' తన ముగ్గురు పిల్లల్ని పల్లెలో తన తల్లి వద్దకు పంపాడు, కాబట్టి ఇంట్లో పెద్దగా పనులేమి లేవు. తన తీరిక తీరిగ్గా ఆస్వాదిస్తున్నాడు. ఇంటికొచ్చి ముందు తలుపు తెరిచి సైకిల్‌ను వంటగదిలో పెట్టి, వెనక గదివైపు వెళ్ళాడు. అతని భార్య కోసం ఎవరో వచ్చినట్టున్నారు. వారి మాటలు వినిపిస్తున్నాయి.

'టు' అపార్ట్‌మెంట్‌లో రెండు గదులున్నాయి. 'టు' కోసం కానీ, అతని భార్య కోసం కానీ ఎవరైనా అతిథులొస్తే, కుటుంబంలోని ఇతర సభ్యులకు ఇబ్బంది కలగకుండా, వారు ఆ వెనక గదిలో కూర్చొని మాట్లాడుకుంటారు. తన భార్య కోసం వచ్చే అతిథులను 'టు' మర్యాదగా ఒకసారి పలుకరించి తిరిగి తన గదిలోకి వచ్చేస్తాడు. కానీ ఈరోజు తన భార్య అతిథిగా వచ్చిన వ్యక్తి పదమూడు పధ్నాలుగుగేళ్ల బాలుడు కావడం చూసిన 'టు' గది బయటే ఉండిపోయి, మాటలు వినసాగాడు.

"ఇంకొచెం తిను బాబు! అది పూర్తిగా తినెయ్! నేను ఇంకొంచెం తెస్తాను" 'టు' భార్య అంటోంది.

"థాంక్యూ ఆంటీ! తప్పకుండా. నేను బాగా తింటాను. ఒకప్పుడు ఒకేసారి ఏడు గిన్నెల అన్నం తినేవాడిని"

"నువ్వు తమాషా చేస్తున్నావు. ఒకప్పుడు అంటే ఎప్పుడు? "

"అమ్మ మాతోనే ఉన్నపుడు. మా అమ్మ చాలా మంచిది. ఇది మామూలుగా చెపుతున్న మాటకాదు, మా ఇరుగు పొరుగు వాళ్లు కూడా అనేవారు, నా తల్లి మంచి మనసు కలదని. ఆమె ఇతరులకు సాయం చెయ్యడంలో ముందుండేది. ఎవరి బాధా చూడలేకపోయేది"

'టు' పక్కగదిలోకి తొంగి చూశాడు. అంత చిన్నవాడు పెద్దవాడిలా ఎలా మాట్లాడుతున్నాడు? ఆశ్చర్యపోయాడు. 'టు' భార్య ఇంకో గిన్నెడు అన్నం అతనికిచ్చింది. ఆమె చేతినుండి ఆ గిన్నెను అందుకుంటూ, ఆ బాలుడు మళ్ళీ 'థాంక్యూ ఆంటీ!' అన్నాడు. అతను కృతజ్ఞత చెప్పేతీరు వినడానికి బాగుంది.

"వేయించిన గుడ్లు తినుబాబూ!" టు భార్య అంది.

"వద్దు నాకు గుడ్లు ఇష్టముండవు. నాకు వంకాయలంటే ఇష్టం. మా అమ్మ వాటికి అల్లం, వెల్లుల్లి చేర్చి వండేది. ఆరోగ్యం పాడవుతుందని నన్ను ఎక్కువగా తిననిచ్చేది కాదు. కానీ ఇప్పుడు నాకు తినడానికి వంకాయలే దొరకడం లేదు"

'టు' భార్య సానుభూతిగా 'చ్..!..చ్..!' అంది. "ఇప్పుడు వంకాయలు చాలా ఖరీదయిపోయాయి. ఒక డోంగ్ (వియత్నామ్ రూపాయి)కు ఒకటో, రెండో వస్తున్నాయి. నీ తండ్రి, సవతి తల్లి పెద్ద కుటుంబాన్ని సాకాలి కదా! అది నువ్వు అర్థం చేసుకోవాలి" అంది.

ఆ బాలుడు తన సన్నటి మెడను ముందుకు చాచి పెద్ద అన్నం ముద్దను

నోట్లో పెట్టుకుంటూ "నేను చాలా విషయాలు అర్థం చేసుకోగలను. నా తండ్రి చెడ్డవాడు కాదు, కానీ ఆయన అవకాశవాది, పిరికివాడు అని కూడ అర్థం చేసుకోగలను" అన్నాడు.

"నువ్వెందుకు అలా మాట్లాడుతున్నావు బాబూ?" 'టు' భార్య అంది.

తను అలా మాట్లాడకుండా ఉండాల్సిందని గ్రహించిన బాలుడు విషయం మార్చేస్తూ "ఈమధ్య నేను చాలా ఆలోచిస్తున్నాను ఆంటీ!, మంచికి కూడ కారణాలుండాలి. నా సవతి తల్లి నా సవతి తమ్ముడికి, చెల్లికి గుడ్లు, మాంసం పెడుతుంది. నాకు కాయగూరలే. అందులో తప్పేముందని నేననుకుంటాను. నా చెల్లి వయసు ఆరేళ్లు, తమ్ముడికి మూడేళ్లు. వాళ్ళిద్దరూ ఇంకా చిన్నవాళ్లు కదా! నేను పెద్దవాడిని. నేను వారి తిండిలో ఎందుకు భాగం కోరుకోవాలి?", అన్నాడు.

ఒక అర్థంలేని నవ్వు ఆ బాలుడి మొహం మీద నిలిచింది. మళ్ళీ అతనే "కానీ ప్రస్తుతం పరిస్థితి మరీ అధ్వానంగా తయారయ్యింది ఆంటీ! నిన్న నా తండ్రి పని నుండి వస్తూ పాలడబ్బా తెచ్చి గ్లాసులో పాలుపోసి కలిపి నాకిచ్చాడు. నేను పాలు రుచి చూసి అయిదారు సంవత్సరాలయ్యింది. నేనింకా గ్లాసును నా చేతిలోకి తీసుకున్నానో? లేదో? నా సవతి తల్లి ఆ గ్లాసును నా చేతిలో నుండి లాక్కొని పాలను వాకిట్లో పారబోసింది"

"అయ్యో!" 'టు' భార్య అంది.

"నేను అబద్ధం చెప్పడం లేదాంటీ! ఆ మాయలమారి ఈమధ్య మరీ క్రూరంగా తయారవుతోంది. మా ఇంట్లో కుందేళ్ళకు కూరగాయలు తెచ్చి తినిపించకపోతే ఆ రోజు నాకు తిండి ఉండదు, నేను ఇంట్లో కాదు పేవ్‌మెంట్ మీద పడుకోవాలి. ఒక రోజు నేను చాలా ఆకలిగా ఉన్నాను. మిగిలిపోయిన అన్నం చిన్నగిన్నెలో వేసి మా నాన్న నాకిచ్చాడు. వెంటనే నా సవతి తల్లి వచ్చి నా చేతిలో గిన్నె లాక్కొని, అన్నాన్ని నేలమీద పడేసింది. 'వీడికి తిండి పెట్టే కంటే కుక్కకు పెడితే ఇంకా ఉపయోగం అంది'. ఆమె అనుమతి లేకుండా నేనేమీ తినకూడదని నా కప్పుడర్థమయ్యింది. మీకుతెలుసా ఆంటీ! ఆమె పిల్లలు చిన్నగా ఉన్నప్పుడు వాళ్లను నన్ను ఎత్తుకోమనేది. అప్పుడు నాకు తిండి కొంచెం బాగా పెట్టేది. 'వాళ్ళనుగానీ కింద పడేస్తే నిన్ను చంపేస్తాను' అని నన్నెప్పుడూ బెదిరించేది. ఆ సంగతి గుర్తొస్తే ఇప్పటికీ నాకు భయమేస్తుంది. కానీ నేనెప్పుడూ వాళ్ళను కిందపడెయ్యలేదు. నేను నా చెల్లిని, తమ్ముడిని ఎంతో ప్రేమిస్తాను. వాళ్ళెప్పుడూ అనారోగ్యంతో ఉంటారు. వాళ్ళ గురించే నేను ఆరోతరగతి రెండేళ్ళు చదవలసి వచ్చింది. అందుకే నేనింత పెద్దగా ఉన్నా ఇంకా ఏడో తరగతిలోనే ఉన్నాను. నాకింక బడికి వెళ్ళాలనిపించడం లేదు"

**వియత్నాం మూలం :**
**మా వాన్ ఖాంగ్**

**అనువాదం :**
**డా. వై. నిర్మల**

కాస్సేపాగి, ఆ బాలుడు చిలిపిగా నవ్వుతూ రహస్యం చెబుతున్నట్టు "ఆంటీ! నేను చెడ్డవాడిని కాదు, నా వద్ద డబ్బులుంటే, వీధిలో పాటలు పాడే ముష్టివానికి, అతని కొడుక్కు ఇస్తాను. ఒకసారి ఒక పేదరాలికి, ఆమె బిడ్డకు కొంచెం అన్నం పెట్టాను. అందుకు నా సవతి తల్లి నెత్తురొచ్చేలా నా తలను గోడకేసి కొట్టి న న్ను శిక్షించింది. ఒకరోజు ఒక వృద్ధ మ హిళ పెద్ద బియ్యం సంచిని మోసుకుపోతుంటే, నేను ఆ సంచిని స్టేషను వరకు మోసుకెళ్ళాను.

ఆమె నాకు పది డోంగ్‌లు ఇవ్వబోతే తీసుకోలేదు. మనం వేరే వాళ్ళకు సాయం చెయ్యాలి కదా ఆంటీ!"

ఆ బాలుడి మాటలు 'టు' హృదయాన్ని తాకాయి. అతను తన గదిలో నుండి ఇవతలకొచ్చాడు. తనను తాను పెద్దవాడిగా చెప్పుకుంటున్న ఆ బాలుని ప్రత్యక్షంగా చూశాడు. ఆ పిల్లావాడు సన్నగా, బలహీనంగా ఉన్నాడు. అతని శరీరానికి అందవలసినంత ఆహారం అందడం లేదని తెలుస్తూనే ఉంది. పెద్ద కళ్ళల్లోని అమాయకత, తెలివి, గుండ్రని చెవులు, నల్లని జుత్తు అన్నీ కలిసి అతని పలుచని మొహంలోని బాధను కప్పేశాయి. అతని వ్యక్తిత్వంలో రెండు భిన్న ధోరణుల కలయిక కనిపిస్తోంది. జీవితంలోని కఠిన వాస్తవాలను ఎదుర్కొనే చిలిపి చిరునవ్వు.. ఆ నవ్వులో ప్రేమ, సంతోషం కలగలిసి మెరుస్తున్నట్టున్నాయి.

'టు' గదిలోనికి వచ్చి "గిన్నెలను బల్లమీద ఎందుకు పెట్టుకొని తినడంలేదు బాబు!" అని అడిగాడు.

ఆ బాలుడు 'టు'కు గౌరవ సూచకంగా వందనం చేస్తూ ఏదో గొణిగాడు. గిన్నెలను ట్రేలో సర్దేసి లేచి నిలబడి మర్యాదగా "థాంక్యూ ఆంటీ, అంకుల్! ఇప్పుడు నా కడుపు నిండింది" అన్నాడు.

'టు' నవ్వుతూ "ఒక అతిథిలా, అలాంటి మర్యాదలొద్దు" అన్నాడు.

'టు' భార్య టీ ఇస్తానంటే వద్దంటూ ఆ బాలుడు తలుపు తెరచుకొని బయటకు వెళ్ళిపోయాడు.

'టు' టీ ట్రే తెచ్చి బల్లమీద పెట్టాడు. అతని భార్య కన్నీళ్ళు తుడుచుకొంది.

"నేను అతన్ని బల్లమీదే భోం చేయమన్నాను. కానీ అతను కింద కూర్చునే తింటానన్నాడు" ఆమె చెప్పింది.

"ఆ బాలుడిని నువ్వెక్కడ కలిశావు? " అడిగాడు

"నేను నీళ్ళు తేవడానికి కిందకు వెళ్ళాను. నీళ్ళను పైకి తెస్తుంటే ఆ బాలుడు వచ్చి నాకు సాయం చేసి నీళ్ళను పైకి మోశాడు. అతన్ని లోనికి పిలిచాను. లోపలికి వచ్చి మనపిల్లల బొమ్మలతో ఎంతో ఆనందంగా ఆడుకున్నాడు. మాటల్లో అతను మన వెనుక బిల్డింగ్‌లో ఉంటాడని తెలిసింది. వ్యాపారశాఖలో పని చేసే తోంగ్, మాంసం దుకాణంలో పని చేసే శ్రీమతి సామ్‌ల కుమారుడని తెలిసింది. తోంగ్ తన మొదటి భార్యకు విడాకులిచ్చిన తర్వాత సామ్‌ను వివాహం చేసుకున్నాడు. ఈ కీమ్ అతని మొదటి భార్యకి పుట్టిన బిడ్డ. కొందరు తమ కన్నబిడ్డల జీవితాల్నే ఎందుకు నరకప్రాయం చేస్తారో నాకర్థం కాదు" 'టు' భార్య చెప్పింది.

అప్పటి నుండి కీమ్, వాళ్లింటికి అతిథి అయిపోయాడు. తన మనసు విప్పి చెప్పుకోవడానికి అతనికి ఎవరూ లేరు. శ్రీమతి టుది పిల్లలను దగ్గరకు తీసి వారి దుఃఖాన్ని దూరం చేసే మనస్తత్వం. తన పిల్లలు పల్లెలో ఉండడంతో ఆమెకు సమయం కూడా ఉండేది. ఆమె కూడ పల్లె నుండి వచ్చిన వ్యక్తే! ఆమె మొహంలో కనిపించే, నీతి నిజాయితీలే అందుకు నిదర్శనం.

కీమ్ ఎక్కువగా మధ్యాహ్నాలు వచ్చి రాత్రి భోజనానికి ఉండి వెళ్ళిపోయేవాడు. అప్పుడప్పుడు తాను పండించిన తాజా పాలకూర 'టు' దంపతులకు తెచ్చేవాడు. ఒక్కోసారి మొహంమీద దెబ్బలతో, అలసిపోయినట్లు నిశ్శబ్దంగా, బాధగా శూన్యంలోకి చూస్తూ కూర్చునేవాడు. 'టు' పిల్లల బొమ్మలతో ఆడుకునేవాడు. లేకపోతే ఇల్లు శుభ్రం చెయ్యడంలో శ్రీమతి టుకు సాయం చేస్తూ బోల్డు కబుర్లు చెప్పేవాడు.

చిన్నవయసులోనే జీవితంలోని చేదును, క్రూరత్వాన్ని అనుభవించినట్టుండేది అతని ప్రవర్తన. తమ బిల్డింగ్‌లో నివసించే ఒక అమ్మాయి, ఆమె సవతితల్లి తెచ్చిన



సంబంధం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకుందని, తన సవతితల్లి స్నేహితుడొకరిని పోలీసులు అరెస్ట్ చేశారని, కీమ్ శ్రీమతి టుకు చెప్పాడు. ఆ బాలుడికి, దొంగలు, చట్టవ్యతిరేక కార్యకలాపాలు చేసే వ్యాపారులు, ఇతర నేరప్రపంచం గురించి బాగా తెలుసు. విదేశీ పర్యటనకు, కార్మిక సంఘాల్లో సభ్యత్వానికి లంచాలు చెల్లించాలని కూడా తెలుసు. కాఫీ దుకాణాల్లో అమ్మేది నిజమైన కాఫీపొడి కాదని, బియ్యం పిండిలో నల్ల దాల్చినచెక్క పొడి కలిపిన మిశ్రమమని చెప్పేవాడు. అతను జానపద గీతాలు పాడేవాడు, స్థానికంగా ప్రజల్లో వాడుకలో ఉండే జోక్స్, వ్యంగ్య కథలు చెప్పేవాడు. కీమ్‌కు పుస్తకాలంటే చాల ఇష్టం. 'టు' దంపతుల అల్మారాలోని

పుస్తకాలను తీసుకెళ్ళి చదువుకునేవాడు.

ఆ బాలుడు తను చెప్పదలచుకొన్నది స్పష్టంగా చెప్పేవాడు. ఆ చిన్నవయసులో అతను ఎదుర్కొన్న అనుభవాలను, తద్వారా అతను పొందిన జ్ఞానాన్ని 'టు' దంపతులు అర్థం చేసుకున్నారు. శారీరకంగా, మానసికంగా ఎంత హింసకు గురైనప్పటికీ ఆ బాలుడిలో జాలి, ఆత్మాభిమానం ఉండేవి. చెడువైపు అడుగులు వేసేవాడు కాదు. అతని హృదయం నిండా ప్రేమ, అనురాగం ఉండేవి. తన సవతి చెల్లి, తమ్ముడి గురించే, తన సవతి తనను ఎన్నోసార్లు శిక్షించినప్పటికీ కీమ్ ఆ పసివాళ్లనిద్దరినీ ఎంతో ప్రేమించేవాడు. తమ తల్లి ప్రభావంతో ఆ చిన్నపిల్లలిద్దరూ తల్లికి చాడీలు చెప్పి కీమ్‌ని కొట్టించేవాళ్లు.

ఒకరోజు తను తీసుకెళ్ళిన పుస్తకం 'టు'కు తిరిగిచ్చేస్తూ "ఈరోజు నా చెల్లికి, తమ్ముడికి షడవలసిన దెబ్బలు నాకు పడ్డాయంకుల్!" అంటూ నవ్వుతూ చెప్పాడు. "అయినా నేను వాళ్ళను ద్వేషించడం లేదు వాళ్ళను విడిచి ఒక్కరోజు కూడ ఉండలేను. పుట్టినప్పటి నుంచి వాళ్లిద్దరిని నేను సంరక్షిస్తున్నాను. వాళ్ల బట్టలు విప్పి, స్నానం చేయించి, పాలు కలిపి పట్టేవాడిని. మా యింటికి వచ్చినప్పుడు నా సవతి తల్లి చాలా పేదది. ఆమె మా యింటికి ఒక గోనె సంచితో వచ్చింది. అప్పుడు నా తండ్రి ఆమెకు మాంసం దుకాణంలో పని ఇప్పించాడు. తర్వాత నెమ్మదిగా ఆమె పరిస్థితి బాగుపడింది. కానీ కాలక్రమంలో ఆమెలో డబ్బాశ, తద్వారా వచ్చే క్రూరత్వం ఎక్కువయ్యాయి. కానీ నేనలా కాదు! నా దగ్గర కొద్ది డబ్బున్నా పిల్లలకు మిఠాయి కొంటాను. ఒకరోజు నేను పిల్లలకు చూయింగ్ తెచ్చిచ్చాను. నా సవతి తల్లి వాళ్ళిద్దరిచేత బలవంతంగా దాన్ని నోట్లో నుంచి బయటకు తీయించింది. నాకు చెంపపెట్టు అన్నమాట. కానీ నేనంతగా పట్టించుకోలేదు. నాకు చిన్నపిల్లలను చూస్తే వాళ్ళను ఎత్తుకొని తినడానికేమైనా కొనివ్వాలనిపిస్తుంది అంకుల్! కథల్లో చెడ్డ వాళ్ళకంటే మంచివాళ్ళెక్కువుంటారు. కానీ నిజంగా.. అలా జరుగుతుందా?"

నెమ్మదిగా 'టు' దంపతులు కీమ్ పట్ల అపేక్ష పెంచుకున్నారు. కీమ్‌తో మాట్లాడుతుంటే 'టు'కు ఒక ఆధ్యాత్మిక గురువుతో మాట్లాడుతున్నట్టు ఉండేది. ఎందుకంటే అంత దురదృష్టకర పరిస్థితుల్లో జీవించే వేరొకరయితే ద్వేషంతో, ప్రేమ రాహిత్యంతో ప్రవర్తించేవాళ్లు. 'టు' దంపతులు ఆ బాలుడికి చాతనయినంత సాయం చేస్తుండేవాళ్లు. వాళ్లు అతనికి ఒక స్వెట్టరు, ట్రౌజరు, టోపి, పెన్ను ఇచ్చారు. అతనికి ఇంట్లో తిండి లేనప్పుడల్లా తమ ఇంటికి వచ్చి భోంచెయ్యమన్నారు. కానీ ఆ బాలుడు వారి ఉదారతను అనవసరంగా వాడుకోలేదు. ఆత్మగౌరవాన్ని కోల్పోలేదు.

ఒక రెండు వారాలు కీమ్ కనిపించలేదు. 'టు' ఆందోళన చెందాడు. సవతి తల్లి అతన్ని బడి మానేసి ఏదైనా పనిలో చేరమని ఒత్తిడి చేస్తోందని తెలిసింది. అంత పసివాడిని బడి మాన్పించి, బాల్యానికి వీడ్కోలు పలికించి, ఈ దుర్మార్గపు ప్రపంచంలోనికి నెట్టడం ఏం సబబు?

ఒక ఆదివారం 'టు' సైకిల్ శుభ్రం చేసుకుంటుంటే, కీమ్ వచ్చాడు. ఇంకా సన్నబడి, కొంచెం పొడుగయ్యాడు. మిలిటరీ దుస్తుల్లో పొడుగ్గా కనిపిస్తున్నాడనిపించింది. దగ్గరగా, కత్తిరించిన జుట్టుతో చిలిపిగా నవ్వుతున్నాడు. 'టు'కు వాడిని చూడగానే ఎంతో సంతోషమనిపించి, పని మధ్యలో ఆపేసి, కీమ్‌ను లోనికి తీసుకెళ్ళి "నిన్ను చూసి చాలా రోజులయ్యింది! ఎక్కడికెళ్ళావు? కూర్చోబాబు! టీ తీసుకుంటావా?" అని అడిగాడు.

కీమ్ గట్టిగా నవ్వుతూ "నేను త్వరలోనే

పెళ్ళి చేసుకుంటున్నాను అంకుల్!" అన్నాడు.

బియ్యం బాగుచేస్తున్న శ్రీమతి టు ఉలిక్కిపడి చేట కింద పెట్టేసి "నిజమా! నువ్వు నిజంగా పెళ్ళి చేసుకుంటున్నావా? " అని అడిగింది.

"సరదాగా అన్నాను. మీ వద్దకు వస్తుంటే నేను కూడ పెళ్ళి చేసుకొని చిర కాలం మీలాగే అన్యోన్యంగా ఉండాలనే ఆలోచన వచ్చింది" అన్నాడు.

'టు' మనసులో ఏదో గుచ్చినట్టయ్యింది. ఒక పసివాడి మనసులో ఇంత మంచి, అదీ పరిణితి కలిగిన ఆలోచన రావడం అతనెప్పుడూ చూడలేదు. 'కీమ్ తన చేదు అనుభవాల వల్లనే ఇటువంటి ఆలోచనలు చేస్తున్నాడు' అనుకున్నాడు.

'టు' భార్య మళ్ళీ చేట చేతిలోనికి తీసుకొని "అల్లరిపిల్లాడా! నీకు మా గురించి ఏం తెలుసు? " అంది నవ్వుతూ.

"మిమ్ములనిద్దరినీ చూస్తుంటే చాలా తెలుస్తుంది"

"నువ్వు మైండ్ రీడింగ్ చేస్తున్నావా? " ఆమె వేళాకోళంగా అంది.

కీమ్ చిలిపిగా నవ్వుతూ, "అవును!" అని, 'టు' వైపు తిరిగి "అంకుల్! మీరు నాకీ జవాబు చెప్పండి, పేదవాళ్ళలో ప్రేమలు, ఆప్యాయతలు ఉంటాయని, డబ్బున్నవాళ్ళు, డబ్బు పిచ్చిలో హృదయం లేకుండా ఉంటారంటారు.. నిజమేనా? " అడిగాడు.

"అలా అని అనుకోలేం! కానీ పిసినారితనంతో డబ్బు సంపాదించేవాడు ఇంకా గొప్పవాడు కావాలనుకుంటాడు, ఇతరుల గురించి ఆలోచించకుండా స్వార్థంగా, క్రూరంగా తయారవుతాడు" 'టు' చెప్పాడు.

"తప్పు చేసే మనుషులకు, తాము తప్పు చేస్తున్నామనే స్పృహ ఉంటుందా? " కీమ్ అడిగాడు.

"సాధారణంగా మనుషులకు తెలుస్తుంది, కానీ..

ఆ బాలుడు 'టు'ను మధ్యలోనే ఆపి..

"వాళ్ళందరకు తాము తప్పుచేస్తున్నామని తెలుస్తుంది అంకుల్! దొంగలు, స్మగ్లర్లు, జేబులు కత్తిరించే వాళ్ళు గొప్పభక్తులుగా ఎందుకుంటారో మీకుతెలుసా? వాళ్ళను దేవుడు శిక్షిస్తాడేమోననే భయం! నా సవతి తల్లి తరచూ దేవాలయానికి వెళుతుంది. ఆమె టుయెన్ కాంగ్ రాష్ట్రంలోని పెద్ద దేవాలయానికి కూడ వెళ్ళింది. మనుషులు చిత్రమైన వాళ్ళు అంకుల్! వాళ్ళు జీవించడానికి ఎంతో ఘర్షణ పడుతుంటారు. మళ్ళీ వాళ్ళే ఒకళ్ళనొకళ్ళు ఎప్పటికీ చంపుకుంటూ ఉంటారు"

'టు' ఆ బాలుడివైపు భయంగా చూశాడు. ఎక్కడి నుండి ఈ పసివాడికి ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయి?

'టు' చూపులోని భావాన్ని అర్థం చేసుకున్నట్టు, "నాకు తెలుసు! నేను చెత్త మాట్లాడుతున్నానని. కిందటి వారం నా సవతి తల్లి లేనప్పుడు నేను నా సొంత తల్లి వద్దకు వెళ్ళాను" కీమ్ చెప్పాడు.

"ఆమె ఎక్కడ నివసిస్తోంది? " 'టు' భార్య అడిగింది.

"చాలాదూరం గియాప్ బాట్ స్టేషను వద్ద! ఆమె నాకు ముప్పై డోంగ్‌లు ఇచ్చింది. దయచేసి వీటిని మీ వద్ద దాచరా ఆంటీ! లేకపోతే పూర్తిగా ఖర్చు చేసేస్తాను. ఆమె నాకు కేకులు ఇచ్చి అక్కడే తినమని బలవంతం చేసింది. లేకపోతే నేను వాటిని నా సవతి చెల్లి, తమ్ముడి కోసం తీసుకెళతానని ఆమె భయం"

"నీ తల్లి అందరికంటే నిన్నే ఎక్కువ ప్రేమిస్తోంది" 'టు' భార్య అంది.

"కానీ నేను నా తమ్ముడ్ని, చెల్లిని కూడా ప్రేమిస్తాను" కీమ్ అన్నాడు.

'టు' భార్య లేచి శుభ్రం చేసిన బియ్యాన్ని బకెట్లో పోస్తూ "నీ తల్లి నిన్ను అంతగా ప్రేమిస్తుంటే, నువ్వు ఆమె దగ్గర ఎందుకుండవు? " అని అడిగింది.

ఈ ప్రశ్న కీమ్‌ను కలవరపెట్టింది. శ్రీమతి టు వైపు చూస్తూ.. "ఎలా ఉంటాను ఆంటీ! నా తల్లి నాకు డబ్బు, కేకులు ఆమె భర్త ఇంట్లో లేనప్పుడు, అతనికి తెలియకుండా ఇచ్చింది. అతనికి డబ్బుంది కానీ, చాలా నీచుడు. అతను మొదట నీళ్ళ ట్యాంకర్ డ్రైవరు. తర్వాత బస్సు డ్రైవరు, తర్వాత లారీ, ప్రస్తుతం కారు నడుపుతున్నాడు. డబ్బు సంపాదనతో అలా అంచెలంచెలుగా ఎదిగాడు. నా తల్లి దగ్గరకి వెళ్ళేప్పుడు నేను జాగ్రత్తగా వెళ్ళాలి. ఆ దంపతులు.. అంటే నా తల్లి, ఆమె భర్త తమ మొదటి వివాహం సంతానంతో ఎలాంటి సంబంధాలు ఉండకూడదని నిర్ణయించుకొని పెళ్ళి చేసుకున్నారు. ఎంత క్రూరత్వం! నేను ఆమె దగ్గరకి ఏదీ అడుక్కోడానికి వెళ్ళలేదు. ఆమెను చూడాలనిపించి వెళ్ళాను అంతే! అయినప్పటికీ నేను వెళ్ళినప్పుడల్లా అతను నావేపు గుర్రుగా చూస్తాడు" అన్నాడు.

"ఈసారి నేను అదృష్టవంతుడిని! నేను 'హో' అక్కను కలిశాను. ఆమె మా అమ్మ భర్త తొలి వివాహపు సంతానం. ఆమెకు పందొమ్మిదేళ్ళు. కెమిస్ట్రీ సబ్జెక్టుతో డిగ్రీ చదువుకుంది. ఆమె ఒంటరిగా నివసిస్తూ స్వెట్టర్లు అల్లి ఆ సంపాదనతో చదువుకుంటోంది. 'తమ్ముడూ! నువ్వూ నేను ఒకే పడవలో పయనిస్తున్నాం. అందుకే నువ్వంటే నాకభిమానం! త్వరలోనే నా చదువు పూర్తవుతుంది. నేను పట్టభద్రురాలినవుతాను. నాకో ఉద్యోగం వస్తుంది. నాకెంత తక్కువ జీతమైనా నేను నీకు సాయం చేస్తానని హో అక్క చెప్పిందాంటీ!" భావోద్వేగాన్ని అదుపు చేసుకుంటూ కీమ్ కొంతసేపు ఆగాడు.

అతను గుమ్మం వైపు వెళుతూ "ఆ డ్రైవరుతో మా అమ్మ వివాహం అవకాశవాదంతో కూడినదైనప్పటికీ నేను వాళ్లని నిందించడం లేదాంటీ! నా తండ్రి నా సవతి తల్లి మాయలో పడినప్పుడు, నా తల్లి ఎంతో బాధకి, దుఃఖానికి గురైంది. ఇల్లు విడిచి వెళ్ళినప్పుడు ఆ డ్రైవర్ని కలుసుకుంది. ఏమికథ! చాలా కొద్దిమంది మాత్రమే ధనవ్యామోహం నుండి తప్పించుకోగలరు ఆంటీ!" అంటూ కీమ్ వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

'టు' దిగ్భ్రాంతికి లోనయ్యాడు. 'ఈ బాలుడి భవిష్యత్తేమిటి? మనుష్యుల్ని ఇంత నిజాయితీగా, నిశితంగా పరిశీలిస్తున్నాడు. స్వార్థాన్ని ఇంతగా ద్వేషిస్తున్నాడు. తన భార్య వద్ద దాచిన సొమ్మును ఏం చేస్తాడు? ..' ఇటువంటి ఆలోచనలతో కీమ్‌ను బయటికి సాగనంపాడు 'టు'.

వెళుతూ కీమ్ 'టు' సైకిల్ వైపు చూసి వంగి సైకిల్ ఫెడల్‌ను ఒకసారి తిప్పి, "కాగ్ వీల్ పాడయిపోయింది అంకుల్! మీకు కావాలంటే నేనొకమంచి దుకాణం చూపిస్తాను. మంచి పార్టులు దొరుకుతాయి. మిగతా చోట్లలా నకిలీ సరుకు కాదు. బజార్లో చాలామంది, వ్యాపారుల అవతారంలో ఉన్న దొంగలు. వాళ్ళు నన్ను మా అమ్మకి ఇచ్చిన ఈ మిలిటరీ దుస్తుల్లో చూస్తే భయపడి ఛస్తారు" కీమ్ నవ్వుకుంటూ తనకు చాలా వదులుగా ఉన్న ఆ డ్రెస్‌ను ఊపుకుంటూ వెళ్ళిపోయాడు.

దుస్తులు మనిషి ఆలోచనలను, వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేస్తాయి. ఆ వదులు మిలిటరీ దుస్తులు కీమ్‌లో కొత్త వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించాయి. ఆ బాలుడు ఎలాంటి వ్యక్తిగా తయారవుతాడో? ఆ పిల్లాడి భవిష్యత్తు గురించి 'టు' మథనపడ్డాడు.

ఒక మధ్యాహ్నం 'టు' ఆఫీసు నుండి తొందరగా వచ్చి, సైకిల్‌ను స్టాండు వేస్తుంటే భార్య గట్టిగా అరిచింది. "కీమ్ పారిపోయాడు" అని.

'టు' సైకిల్‌ను గోడకాన్చి "ఎప్పుడు వెళ్లిపోయాడు? " అన్నాడు.

"వాడు మధ్యాహ్నం వచ్చి నా దగ్గర దాచుకున్న ముప్పై డోంగ్‌లు ఇమ్మని అడిగాడు. ఎక్కడికెళుతున్నావని నేను నిలదీసే సరికి లావోకెమ్ ప్రాంతంలోని గనులకెళుతున్నానని చెప్పాడు" చెప్పింది.

'టు' నిస్సహాయంగా కుర్చీలో కూలబడుతూ "వాడు ఎందుకు ఇంత హఠాత్తుగా వెళ్ళిపోయాడు? " అన్నాడు.

"ఈమధ్య వాడి సవతి తల్లి మరీ క్రూరంగా తయారయిందని వారి ఇరుగు పొరుగులు చెప్పారు. వారి మాటలు నేను నమ్మలేకపోయాను" శ్రీమతి టు కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది. "మొన్న కీమ్ చేతిలో ఒక పింగాణీ కప్పు హాండిల్ విరిగిపోయిందట. కీమ్ సవతి తల్లి ఆ విరిగిన కప్పును అతని మొహమ్మీదకు విసిరే సరికి విరిగిన పింగాణీ ముక్కలతో అతని మొహం మీద చాలా గాయాలయ్యాయి. కొంచెం అయితే ఆ ముక్కలు అతని కళ్ళల్లో గుచ్చుకొని వాడు గుడ్డివాడయ్యేవాడట. ఇరుగు పొరుగులు నిరసన తెలిపేసరికి ఇంకా రెచ్చిపోయిన ఆ సవతి తల్లి కీమ్ తండ్రితో చెప్పి కీమ్‌ను మంచం కోడుకు కట్టించి, తండ్రితోనే చావబాదించిందట దేవుడా! అంత వినయం, బుద్ధిమంతుడైన ఆ పసివాడిని అలా హింసించడానికి ఆమెకు మనసెలా ఒప్పిందో!" దుఃఖంగా అంది.

'టు' భార్య వైపు తిరిగి "అతను పారిపోయాడని నీకెలా తెలుసు? " అడిగాడు.

"వాడే చెప్పాడు. తాను ఎప్పుడో వెళ్ళిపోయేవాడట. కానీ చెల్లిని, తమ్ముడిని వదల్లేకపోయేవాడట. ఈమధ్య సవతి తల్లి తరచూ జబ్బుపడుతోందట. తను వెళ్ళిపోతే పసివారిని చూసేవారు ఉండరని ఉండిపోయాడట" 'టు' భార్య చెప్పింది.

'టు' బాధను, దుఃఖాన్ని అణచుకునే ప్రయత్నం చేస్తూ "వెళ్లొద్దని నువ్వు కీమ్‌ను ఆపలేదా? " భార్యను అడిగాడు.

'టు' భార్య వెక్కిళ్ళు పెడుతూ "చెప్పాను! కానీ, తను వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నానని అన్నాడు. నేను కొంచెం భోజనం వండి ఇచ్చాను. ఇంకో ఇరవై డోంగ్‌లు కూడా ఇచ్చాను. నాకు కృతజ్ఞతలు చెప్పి, మీకు కూడా వీడ్కోలు చెప్పినట్టు మీతో చెప్పమని చెప్పి స్టేషను వైపు వెళ్ళిపోయాడు" అంది.

'టు' నిశ్శబ్దంగా కూర్చున్నాడు. తన చేతిలో నుండి చాలా విలువైన దానిని జారవిడుచుకున్నట్టుగా బాధపడ్డాడు. జరిగినదానికి తన బాధ్యత ఏమీ లేదని తనను తాను నమ్మించుకునే ప్రయత్నం చేశాడు. తన వద్ద ఆ బాలుడిని పూర్తిగా ఆదుకునే వనరులు లేవు. కానీ 'ఆ పసివాడిపట్ల మీరు ప్రవర్తిస్తున్న తీరు తప్పు' అని అతని తల్లిదండ్రులకు చెప్పి వారిని సంస్కరించే పని కూడా ఎందుకు చెయ్యలేకపోయాడు.

'టు' జీవితంలోని విరోధాభాసలను తేలికగా తీసుకునే వ్యక్తి కాదు. అతను కీమ్ బాధామయ జీవితాన్ని తలచుకుంటూ ఎన్నోరాత్రులు నిద్రపోలేదు. ప్రభుత్వంలో చిరుద్యోగి అయిన 'టు' ఆర్థిక పరిస్థితులు అంత గొప్పవేమీ కాదు. కానీ ఆ దంపతులు ఒకరినొకరు బాగా అర్థం చేసుకొని ప్రేమగా జీవిస్తున్నారు. వారి ముగ్గురు పిల్లలు కూడా వారి తల్లిదండ్రుల ప్రేమానురాగాలను పుష్కలంగా పొందుతున్నారు. సహజంగా వారు తృప్తిగా ఆనందంగా జీవిస్తున్నారు. అది వారిని భవిష్యత్తులో నీతిమంతులుగా చేస్తుందనడంలో సందేహం లేదు. కీమ్ వెళ్ళిపోయాడు. కానీ ఎక్కడికి? ప్రస్తుత సమాజాన్ని అలుముకుంటున్న నేర ప్రపంచంలో భాగమవుతాడేమో! ఆ నేర ప్రపంచ అధినేతల నుండి కీమ్ లాంటి బాలురు తప్పించుకోవడం అసాధ్యం. కీమ్, అతని వంటి అనేకమంది బాలుర కోసం బాధపడటం,

దుఃఖపడటం, సానుభూతి చూపడం తప్ప తానేమీ చేయలేడా? హృదయంలో సానుభూతి తప్ప చేతలకొచ్చేసరికి తాను నిస్సహాయుడేనా? మథనపడిన 'టు', భార్యతో "నేనెప్పుడో ఈ విషయం నీతో సంప్రదించాలనుకున్నాను, కానీ జంకాను. మనం కీమ్‌ను దత్తత తీసుకోవాల్సింది! కనీసం మన పల్లెకు పంపించాల్సింది" అన్నాడు.

శ్రీమతి టు భర్త వైపు తిరగకుండా కిటికీలో నుండి బయటకు చూస్తూ "నువ్వు అంగీకరిస్తావో? లేదో? నాకు తెలియదు. నీకొచ్చిన ఈ ఆలోచన నాకెప్పుడో వచ్చింది. నేను కీమ్‌ను అడిగాను కూడా! కానీ వాడస్సలు అంగీకరించలేదు. పైగా అన్నాడు 'మీ ఇద్దరి దయకు నా కృతజ్ఞతలు. కానీ ఇది అయ్యే పని కాదాంటీ! ఈ సంగతి తెలిస్తే ఆ మాయలమారి మిమ్మల్నీ ఇబ్బంది పెడుతుంది. నాకు ఆశ్రయమిచ్చి, నన్ను ఆమెకు వ్యతిరేకంగా ఎగదోస్తున్నారని ఇప్పటికే ఆమె ఇరుగు పొరుగులను దుమ్మెత్తిపోస్తోంది' అంటూ శ్రీమతి టు భర్తకు వివరించింది.

కుర్చీ చేతుల మీద గట్టిగా కొడుతూ 'టు' కోపంగా లేచి నిలబడ్డాడు.

"సరే! అయితే ఆమె సంగతేంటో నేను తేలుస్తాను. పిల్లలను ప్రేమించి వారికి రక్షణ కల్పించడం నా హక్కు. ఆమె తన భర్త కొడుకును హింసించడం చట్టం ఒప్పుకోదు! ఈ సంగతంతా పత్రికలకెక్కిస్తాను" అన్నాడు.

శ్రీమతి టు బాధగా "ఆమె ఎంత క్రూరమైన మహిళ!" అంది.

'టు' కీమ్ సవతి తల్లిని స్వయంగా చూడడానికి మాంసం దుకాణానికి వెళ్ళాడు. ఆమెకు ముప్ఫయి అయిదేళ్లుంటాయి. మాటకారి. ఆమె చేతులు చాకచక్యంగా మాంసాన్ని ముక్కలు చేసి, తూకం వేసి, సంచుల్లో నింపుతున్నాయి. ఆమె మాటలు తూటాల్లా ఉన్నాయి. 'టు' అనుకున్నట్లు ఆమె బలమైన స్త్రీ కాదు. చాలా సన్నగా బలహీనంగా ఉంది. ఆమె ఎండిపోయిన ఛాతీమీద ఒక నెక్లెస్ వేలాడుతోంది. కీమ్ తండ్రి ఆమె మోహంలో పడినప్పుడు ఆమెకున్న సౌందర్యం ఇప్పుడు పూర్తిగా పోయినట్టుంది, ఆమె కనుబొమ్మలు, లేత పసుపురంగు మేనిచాయ తప్ప. చూడగానే ఆమె ఏదో వ్యాధి పీడితురాలని తెలుస్తోంది. 'టు'కు ఆమెపై జాలి కలిగింది, జీవితావసరాలు, అనారోగ్యం క్రూరంగా తయారుచేసాయేమో అనిపించింది. ఆమె గురించి పత్రికలకు రాసే ఆలోచనను విరమించుకున్నాడు.

ఇంతలో లావుపాటి మహిళ దుకాణం లోకొచ్చి, మాంసం కొనుక్కొని, కీమ్ సవతి తల్లివైపు చూస్తూ.. "నీ సవతి కొడుకు పారిపోయాడటగా? " అని అడిగింది.

"పీడా విరగడయిపోయింది! సుఖంగా ఉంది!" సవతి తల్లి జవాబిచ్చింది.

"ఇంట్లో ఏమైనా ఎత్తుకుపోయాడా? " మళ్లీ ఆ లావుపాటి మహిళ అడిగింది.

"అలాంటిదేమైనా చేస్తే నేను వాడిని వదిలే దాన్నా? " సవతి తల్లి ఘాటుగా జవాబిచ్చింది.

ఈ సంభాషణలో 'టు'కు కీమ్ సవతి తల్లి పట్ల ఏర్పడిన సానుభూతి పటాపంచలైపోయింది. స్థానికంగా విచారిస్తే ఆమె తన సవతి కొడుకును హింసించడమే కాకుండా, ఇతరులతో కలిసి ఆమె మాంసం దుకాణంలో కొన్ని అవినీతి కార్యకలాపాలకు పాల్పడుతోందనీ తెలిసింది. 'టు' వెంటనే ఆ సంగతులన్నీ రాసి పత్రికకు పంపాడు. రెండు వారాల్లో అది 'సవతి కొడుకును హింసించడం ఆపాలి' అనే శీర్షికతో పత్రికలో ప్రచురితమయింది. అందులో పేర్లేమీ ప్రచురించలేదు. పంపినవారు 'నిర్మాణాత్మక వ్యాఖ్యాత' అని రాశారు.

రెండు రోజుల తర్వాత 'టు' ఇంటి ముందు పెద్దగొడవ ప్రారంభమయింది.

# చతుర ప్ర.జ. 2



**జి**జ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూర గొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు.

ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

*చిరునామా :* **చతుర ప్ర. జ.**
చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

కిందకు చూసిన 'టు' ఆమెను గుర్తుపట్టాడు. ఆమె అరుపులు, తిట్లు, ప్రవర్తన చూసిన తర్వాత, కీమ్‌ను ఎంతగా హింసించిందో 'టు'కు అర్థమయింది. ఆమె రెండు కాళ్లను దూరంగా పెట్టి నిలబడి "ఎవడ్రా? నామీద చెత్తరాతలు రాసింది! నువ్వేనా? నా బిడ్డను నాకు వ్యతిరేకంగా రెచ్చగొట్టినవాడివి, వెధవా! హంతకుడా! నువ్వు నన్ను నా కొడుకును విడదీశావు, పొత్తిళ్లల్లో ఉన్నప్పటి నుంచి వాడిని పెంచాను. నా సొంత కొడుక్కి ఒక చమ్చా పాలు పడితే వాడికి రెండు చమ్చాల పాలు పట్టి పెంచాను. ఆ కీమ్ ఎంత కృతజ్ఞత లేని వెధవ, నా బంగారు ఉంగరం, ఐదొందల డోంగ్‌లు పట్టుకొని పారిపోయాడు" అంటూ వీరంగం సృష్టించింది.

'టు' మీద విద్వేషాన్ని కక్కుతూ ఆ తిట్ల పరంపర అలాగే కొనసాగించింది. ఆమె భర్త వచ్చి ఆపే ప్రయత్నం చేశాడు. అతను లావుగా గుబురు గడ్డంతో ఉన్నాడు. ఆమెకు నెమ్మదిగా ఏదో చెప్పాడు.

"వాళ్లు నా మీద బురద చల్లుతున్నారు.. అది నేనే తుడుచుకోవాలి! ఇది నీకు సంబంధించిన వ్యవహారం కాదు. ఇందులో నువ్వు తలదూర్చకు..!" ఆమె భర్తను హెచ్చరించింది.

"హూ! ఈమె వేరొక స్త్రీ భర్తను లోబరచుకొని, అతని కొడుకును నానాహింసలు పెడుతోందని రాస్తాడా! నేను వాడిని సవాల్ చేస్తున్నాను! దమ్ముంటే ఆ పత్రికలో రాసిందంతా నా ముందు చెప్పమను! లేకపోతే మరుగుదొడ్డి రంధ్రంలో తల పెట్టుకోమను..!" ఇలా సాగింది ఆమె వాగ్ధోరణి.

అప్పటికే బిల్డింగ్‌లోని చాలామంది అక్కడ గోలగా మాట్లాడుకుంటూ, ఆమె విన్యాసాలను చూసి వినోదిస్తున్నారు.

'టు' భార్య కోపంగా "ఎంత నీచమైన మనిషి? ఏంచేస్తే తిరిగి అదే తనకు జరుగుతుందని ఆమెకు తెలియదా? !" అంది.

'ఏంచేస్తే అదే జరుగుతుంది!' మానవ జీవితంలో ఈ కర్మ సిద్ధాంతం పనిచేస్తుందా? మనిషి జీవితాన్ని ఒక అతీతశక్తి నియంత్రిస్తోందని 'టు'కు నమ్మకం లేదు. కానీ కొన్నిరోజుల తర్వాత అతడు విన్న విషయం నిశ్చేష్టుణ్ణి చేసింది.

ఒక శనివారం మధ్యాహ్నం 'టు' ఆఫీసు నుండి వచ్చేటప్పటికి తమ బిల్డింగ్ వెనుక ఒక అంబులెన్స్ నిలబడి ఉంది. కాసేప

టికి అది వెళ్లిపోయింది. తర్వాత తెలిసిన విషయమేమిటంటే.. మెట్లెక్కుతూండగా కీమ్ సవతి తల్లికి గుండెపోటు వచ్చింది. ఆమెను మొదటిసారి చూసినప్పుడే ఆమె వ్యాధిగ్రస్తురాలని 'టు' గుర్తించినప్పటికీ, ఈవార్త అతనికి దిగ్భ్రాంతిని కలిగించింది. తర్వాత ఆ ప్రస్తావన 'టు' ఇంట్లో రాలేదు.

కాలం గడుస్తోంది. ఒకరోజు ఎవరో తలుపు తడితే తెరిచిన 'టు'కు, రెండు చేతులతో తన తమ్ముడిని, చెల్లిని పట్టుకొని ఎదురుగా కీమ్ కనిపించాడు. కీమ్ తల వంచి వందనం చేసి, ఆ చిన్న పిల్లలతో "చెల్లి ఓన్! తమ్ముడు చి! అంకుల్ కు నమస్కారం చెయ్యండి" అని చెప్పాడు.

'టు' భార్య లోపలి నుండి పరిగెత్తు కుంటూ వచ్చి "కీమ్! నువ్వేనా! ఎక్కడికి వెళ్లిపోయావు? ఎప్పుడొచ్చావు? " అని అడిగింది. 'టు' ఆనందంతో "లోపలికి రా బాబూ!" అని అప్యాయంగా ఆహ్వానించాడు.

కీమ్ కళ్లెత్తి వారివైపు చూశాడు. అతని కళ్లల్లో దయ, ఆలోచన కనిపించాయి. "నిన్ననే వచ్చాను. ముందు మిమ్మలనిద్దరినీ చూసి తర్వాత నా సవతి తల్లిని చూడ్డానికి ఆసుపత్రికి వెళతాను" అన్నాడు.

శ్రీమతి టు ఆత్రంగా అడిగింది "నువ్విప్పుడు ఎక్కడ ఉంటున్నావు? "

"నేనొకసారి నా అక్క హో గురించి చెప్పాను గుర్తుందా? ఆంటీ! ఆమె డిగ్రీ పూర్తిచేసి ఇప్పుడు లావో కిమ్ రాష్ట్రంలోని గనుల్లో ఉద్యోగం చేస్తోంది. ఆమె నన్ను అక్కడకు పిలిపించుకొని చాలా కష్టపడి, గని కార్మికుల పిల్లలు చదివే బడిలో నన్ను చేర్పించింది.

బడిగంటల తర్వాత నేనేదైనా పనిచేసి కొంత సంపాదించుకుంటున్నాను. కాస్త పెద్దవాడినయితే అక్కడున్న వొకేషనల్ స్కూల్లో చేరదామనుకుంటున్నాను. అక్కడ ఇంకా దయార్ద్రులైన మనుషులున్నారు. వారు నాకు సాయం చేస్తానన్నారు. కానీ ఇంతలో నా సవతి తల్లి అనారోగ్యం గురించి తెలిసింది. ఆమె ఆస్పత్రిలో చేరిన తర్వాత ఈ పిల్లల ఆలనాపాలనా చూసేవారెవ్వరూ లేరు. నా సవతి తల్లి ఆస్పత్రిలో చేరడంతో నా తండ్రి ఏమీ చెయ్యలేని పరిస్థితుల్లో ఉన్నాడు. ఆమెను చూస్తే జాలేస్తుంది, పాపం! తన చుట్టుపక్కల వారందరికీ దుఃఖాన్ని కలిగిస్తుంది, నాకేమనిపిస్తుందంటే, స్వయంగా ఆమె చాలా దుఃఖితురాలని. ఆమె బతికి బయటపడగలదని ఎవరికీ అనిపించడం లేదు" కీమ్ చెప్పాడు.

తన సవతితల్లి జీవితంలో ఎదురైన విషాదాన్ని పంచుకోవడానికి కీమ్ తిరిగి వచ్చాడు. రాకపోయినా, ఎవరూ అతన్ని తప్పుపట్టేవారు కాదు. కీమ్ తనంతటతానేవచ్చాడు. క్రూరమైన తన సవతి తల్లికి జరిగిన శాస్తికి తను ఆనందపడుతున్నట్టుగానీ, తృప్తిపడుతున్నట్టుగానీ అనిపించలేదు. అలాగని తనకేమీ పట్టనట్టు కూడా లేడు. అతని ధోరణి, మాటల్లో ఆత్మీయత, ప్రేమ కురుస్తున్నాయి. తన వారికి సాంత్వన, ధైర్యాన్నీ ఇస్తున్నాయి.

కీమ్, అతని తమ్ముడు, చెల్లెలు వెళ్లిపోయిన తర్వాత 'టు' కుర్చీలో స్తబ్దుగా కూర్చుండిపోయాడు. కొంతసేపటికి తన మనసు కూడా దయ, మృదుత్వంతో నిండిపోయిందని తెలుసుకున్నాడు. కీమ్‌ను తను ఎంతగానో ప్రేమిస్తున్నట్టు, వాడిలో అచంచల విశ్వాసం ఏర్పరచుకున్నట్టు అర్థమయ్యింది. జీవితం అంత సులువైంది కాదు, కానీ అప్పుడప్పుడు అది అందర్నీ ప్రేమించే కీమ్‌లాంటి అసాధారణమైన వ్యక్తుల్ని మనకు చూపిస్తుంది. ఆ కుర్చీలో కూర్చుని 'టు', 'ఆస్పత్రిలో తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్న ఆ మహిళకు తను కూడా ఏమైనా సాయం చేయగలిగితే బాగుండను!' అని తనకొచ్చిన ఆలోచనకు చాలా ఆశ్చర్యపోయాడు. ©




గంధం యాజ్ఞవల్క్యశర్మ

# వెలుగులో వెలది

నిర్వహణ : **వి. రాజారామమోహనరావు**

**ప్రతి మనిషికీ ఓ తత్త్వం వుంటుంది. అలాగే స్త్రీ పురుష భేదం ప్రకారం కొన్ని ప్రత్యేక గుణాలుంటాయి. సాధారణంగా శారీరకంగా స్త్రీ కన్నా పురుషుడు బలవంతుడని, స్త్రీ సున్నిత మనస్కురాలని అంటారు. అలాగే మహిళల ఆంతర్యం, లోతు అంతుపట్టదంటారు. ఎప్పుడు ఏ రకంగా వారిలో ప్రేమ పుడుతుందో, జాలి కలుగుతుందో, ఏ విషయంలో తెగింపు వస్తుందో, దేనికి పట్టుదల వహిస్తారో చెప్పటం కష్టం. అటువంటి చిత్రమైన పరిస్థితిలోని ఓ అతివ కథే ఈ 'వెలుగులో వెలది' నవల. 1968లో ఎమెస్కోవారు ఈ నవలని ప్రచురించారు.**

'వెలుగులో వెలదినవలకి భవాని, కృష్ణమూర్తి నాయికా నాయకులు. ఇద్దరికీ తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. కృష్ణమూర్తిని వాళ్ళ బాబాయే చదివిస్తున్నాడు. భవానిని మేనమామ దాశరథి పెంచారు. కృష్ణమూర్తిది పేదరికం. భవానిది బాగా డబ్బున్న స్థితి. కాలేజీలో భవాని అన్నింటా తానే. కృష్ణమూర్తిది నెమ్మది తత్త్వం. కాలేజీ వక్తృత్వ పోటీల్లో భవానికి కృష్ణమూర్తికి పరిచయం కుదిరింది. ఎందరో అబ్బాయిలకు భవాని అంటే పిచ్చి. మాట్లాట్టానికి తహతహలాడేవారు. పరిచయమయినా తనంతట తానుగా వుంటూ తనతో ముభావంగా మెలుగుతున్న కృష్ణమూర్తి అంటే భవానికి ఆసక్తి ఏర్పడింది. కృష్ణమూర్తి అందంలో, అంతస్తులో భవానీకన్నా తక్కువే. మరి ఏమిటీ ఆకర్షణ? ఆమెకే తెలియదు. కృష్ణమూర్తి తరచుగా జ్ఞాపకానికి వస్తాడు.. ఎందుకని? అర్థం కావటం లేదు. అతన్ని ప్రేమిస్తోందా? లేదు, కానీ ఏదో అభిమానం, జాలి. ఈ భావోద్వేగంతోనే, కాలేజీ సెలవుల్లో కృష్ణమూర్తి ఉండే పల్లెటూరుకి వెళ్ళి రెండుసార్లు కలుసుకుంది.




తిరిగివచ్చాక, భవాని అభిప్రాయం బలపడింది. జీవితంలో ఆదర్శం వుండాలి. అంతే కృష్ణమూర్తికి తన మనసు తెలుపుతూ ఉత్తరం రాసింది. అప్పటికే కృష్ణమూర్తి గుంటూరు మిడిల్ స్కూల్‌లో టీచర్‌గా చేరాడు. ఆ ఉత్తరానికి కృష్ణమూర్తి చాలా నిజాయితీగా జవాబు రాశాడు. 'భవానీ! నిన్ను ఒక అంతస్తుగల వ్యక్తిగానే నా దృష్టిలో వుంచుకున్నాను. ఏదైనా ఈ విషయంలో బాగా ఆలోచించుకోవాల్సింది నువ్వే. నేను నీ యోగ్యతకు తగినవాడిని కాదేమో! మళ్ళీ మళ్ళీ జాగ్రత్తగా ఆలోచించుకో! ఇక నా ఇష్టమంటావా, నా చీకటి బాటలో నేను తలవంచుకు పోతూవుంటే, నాముందొక మెరుపు తీగ మెరిసి, నా చేతిలో దివిటీ అవుతానంటే నేనేమంటాను! నీ నిర్ణయం మీ మామయ్యగారితో చెప్పేముందు మరోసారి జాగ్రత్తగా ఆలోచించుకో! నీ నిర్ణయం మరోలా వున్నా, నేనేమీ బాధపడను. ఆ నిర్ణయాన్నీ ఆనందంగానే స్వీకరిస్తాను'

ఆ ఉత్తరం చూశాక ఇంకేం ఆలోచించలేదు భవాని. తన నిర్ణయం తెలియజేసింది. అత్తయ్య, మామయ్య బాధపడ్డారు. స్నేహితురాళ్ళు 'ఇదేం నిర్ణయమే?' అన్నారు. 'నాకు ఆత్మవిశ్వాసం వుం ది. అతన్ని ఉత్తేజితుణ్ణి చేస్తాను. స్వయంకృషి తో, ఆత్మబలంతో ప్రగతిని సాధిస్తాను' అంది భవాని. కృష్ణమూర్తిని పెళ్ళి చేసుకుంది.

అప్పుడే కాదు ఇప్పటికీ యువతీ యువకుల జీవితాల్లో ఇదో కీలక అంశం. ఎదుటివాళ్ళని మార్చి ఏదో సాధించటం అన్నది అంత తేలికైన

విషయం కాదు. అటువంటి ఉద్దేశం, ఆవేశం అంత మంచిదీ కాదు. ఇలాంటి కీలకాంశం కథా వస్తువైంది కాబట్టి 'వెలుగులో వెలది' ఇప్పటితరానికి అవశ్య పఠనీయం.

గుంటూరులో ఓ అద్దె ఇంట్లో భవానీ, కృష్ణమూర్తి కాపురం ప్రారంభించారు. భవానిని పెంచిన అత్తయ్య శాంతమ్మగారికి, ఈ పెళ్ళి విషయంలో కొంత కినుక వుంది. ఇది తన సిద్ధాంతాలకు, విశ్వాసాలకు సంబంధించిన విషయం అని అత్తయ్యని క్షమించమని అడగలేదు భవాని. సంవత్సరం తిరిగేటప్పటికి పాప పుట్టింది. పురిటికి తీసుకువెళ్ళటానికి మామయ్య వచ్చినా భవాని వెళ్ళలేదు. తన ఆశలన్నీ ఫూలు పూసిననాడు అత్తయ్య శాంతమ్మగారి ముందుకు వెళ్ళాలనుకుంది. ఆశలంటే పైఅంతస్తు, డబ్బు. వాటి మాట ఎలా వున్నా, పురిటికి బోల్డు ఖర్చయింది. భవాని జబ్బుపడి చిక్కిశల్యమైంది. అప్పులు చెయ్యాల్సి వచ్చింది. ఆదాయం పెంచుకోవాలని ఎంతగా చెప్పినా కృష్ణమూర్తి ఏ ప్రయత్నం చెయ్యలేదు. 'ఈ అవసరాలు ఎప్పుడూ ఇలా ఉంటూనే వుంటాయి. ఊరికే తాపత్రయం పెంచుకోకూడదన్నది' అతని ఉద్దేశం.

మొత్తానికి తను పిల్లలకి ట్యూషన్లు చెప్పటానికి భర్తని ఒప్పించింది భవాని. బాగానే పేరొచ్చింది. ట్యూషన్ పిల్లలు పెరిగారు. ఆదాయం పెరిగింది. అప్పులు తీరాయి. ఎక్కడైనా దగ్గర్లో ఓ ఇల్లు తీసుకుని ట్యుటోరియల్స్ పెడదామంది ఉత్సాహంతో. కృష్ణమూర్తిని ఉద్యోగం మానేయమంది. దీనికి భిన్నంగా కృష్ణమూర్తిది 'ఎక్కడికక్కడ సరిపెట్టుకు బతుకుదాం..' అన్న ధోరణి.

చివరికి భార్య ఆశల్ని గమనించిన కృష్ణమూర్తి తలవొగ్గాడు. దగ్గర్లో రామనాథంగారి ఇల్లు అద్దెకు తీసుకుని ట్యుటోరియల్స్ ప్రారంభించారు. ట్యుటోరియల్ కాలేజీకి ప్రిన్సిపాల్ భవాని ఎం.ఏ, అసోసియేట్ ప్రిన్సిపాల్ కృష్ణమూర్తి బి.ఏ. బి.ఇడి. దాచిన డబ్బు, తన నగలు అమ్మి పెట్టుబడి పెట్టింది భవాని.

రెండేళ్ళు తిరిగేటప్పటికి భవాని ట్యుటోరియల్ ఊళ్ళోని పాతిక కాలేజీలను మించిపోయింది. పిల్లలకి, హాస్టల్‌కి పక్కనున్న మేడలు అద్దెకు తీసుకున్నారు. ఖాళీస్థలంలో షెడ్లు వేయించారు. ఇంట్లో వంటకి వంటావిడని, పిల్లకి ఆయమ్మని పెట్టింది భవాని. ఈ ఎదుగుదల ఆమెకి ఎంత ఉత్సాహాన్నిచ్చిందో, కృష్ణమూర్తికి అంత కంగారు పుట్టించింది.

మూడో ఏడు భవాని ట్యుటోరియల్‌లోకి 'రావ్' అన్న కొత్త వ్యక్తి ప్రవేశించాడు. మంచి మాటకారి, గంభీరమైన విగ్రహం, పైగా పి.హెచ్‌డి. చేశాడు. పి.హెచ్‌డి. చేసిన వ్యక్తి తన స్టాఫ్‌లో వుంటే, కాలేజీకి ఓ ప్రత్యేకత వుంటుందని అతని పట్ల ఆసక్తి చూపింది భవాని. రావ్ చేరింతర్వాత కాలేజి మరింతగా విస్తరించింది. రావ్ హాస్టల్ వార్డెన్ అయినా అన్నిపనులూ చూసేవాడు, చేసేవాడు. భవానీ కొత్తఇల్లు కొంది. రామనాథంగారిని ఒప్పించి ట్యుటోరియల్ కాలేజీ స్థలం కొంది. కొత్త బిల్డింగులు, గెస్ట్‌హౌస్ కట్టారు. కారుకొన్నారు. ఏయేటికాయేడు మరింతగా పెరిగి భవాని గుంటూరులో ఓ ప్రముఖ వ్యక్తి అయింది. కలెక్టర్ నుంచి పెద్ద స్థాయి పరిచయాలు.. ఎప్పుడూ హడావిడి.. పనులు.

డబ్బు సంపాదన, పేరు ప్రఖ్యాతులు.. ఈ పరుగులో గృహ జీవితంలో ప్రశాంతత కరువవుతోందన్న భావనతో కృష్ణమూర్తి ఎక్కువ ఇంటి వేపు, కూతురువేపు మొగ్గు చూపించేవాడు. అదీ కాక భవాని, కృష్ణమూర్తిలవి భిన్నధ్రువాలయ్యాయి. సరైన అవగాహన కుదరక, సయోధ్య లేక, అభిప్రాయభేదాలు ఎక్కువయ్యాయి. కాలేజీలోని కొన్ని పరిణామాలు, లౌక్యం వల్ల రావ్ అసోసియేట్ ప్రిన్సిపాల్ అయ్యాడు. భవాని ఎంత దురుసుగా ప్రవర్తించినా కృష్ణమూర్తి శాంతంగానే వుంటూ వచ్చాడు. అయినా పరిస్థితులు వికటించాయి. కృష్ణమూర్తితో గొడవపడి భవాని తన మకాం ట్యుటోరియల్ కాలేజి గెస్ట్‌హౌస్‌కి మార్చుకుంది. ఇంట్లో కృష్ణమూర్తి, పాప.. గెస్ట్‌హౌస్‌లో భవాని. వాళ్ళ సంసార జీవితం అంతగా దూరమైంది.

అంతా తన ప్రతిభేనని, కృష్ణమూర్తిది వెనుకబాటుతనం, అలసత్వం అని భవాని అహంకారం తారస్థాయికి చేరింది. తన ప్రవర్తన సంసారాన్ని కన్నకూతుర్నీ దూరం చేస్తోందని కూడా గ్రహించలేక పోయింది భవాని.

చివరికి విసిగిపోయి, ప్రశాంతత లేక, భవానికి ఓ ఉత్తరం రాసి, కూతురుతో ఊరు వదిలి వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి. ఆ ఉత్తరంలో.. 'భవానీ! పాపను నీ నుంచి దూరంగా తీసుకు వెళ్ళే సంపూర్ణమైన హక్కేది లేదని నాకు తెలుసు. కానీ పాప నన్ను వదిలి వుండనంటోంది, తీసుకువెడుతున్నాను. నేను ఓడిపోయిన నాడు పాపను నీ దగ్గరకు పంపుతాను. తెలియక నీకేమైనా అన్యాయాలు చేశానేమో, తెలిసి తెలిసి

# హత్తుకునే అనుభూతి ప్రధానం



గంధం యాజ్ఞ్యవల్క్యశర్మ 1937 ఆగస్టు 16న గుంటూరు జిల్లా లింగంగుంటపాలెం గ్రామంలో జన్మించారు. బి.యస్‌సి. వరకు చదివిన శర్మ సహకారశాఖలో పనిచేశారు. నవలా కథా రచయితగా ప్రసిద్ధికెక్కిన వీరి 'వెలుగులో వెలది'తో పాటు 'నీడలూ నిజాలు' నవల కూడా విశేషంగా పాఠకాదరణ పొందింది. వీరి నవలల్లోని పాత్రలు మన ఇంట్లో, పరిసరాల్లో నిత్యం తారసపడే వ్యక్తుల్లా కనిపిస్తాయి. అందువల్లే వీరి నవలలు చదువుతున్నప్పుడు పాఠకులు స్వీయ జీవితానుభూతిని పొందుతారు. శైలి సీదాసాదాగా ఉంటూ హృదయానికి హత్తుకునేలా సాగుతుంది. వీరి కథలు అనేకం ప్రసిద్ధి పొందాయి. ఇరవై రెండు కథలతో 'సెలవయింది' సంపుటి ప్రచురించారు. ఇవికాక సుమారు నలభై వరకు కథలు వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 'యాజ్ఞవల్క్య' కలం పేరుతో వీరు రచనలు సాగించారు.

చేస్తున్నది ఇది. ఇందుకు నన్ను క్షమించు. మన ఇద్దరి అభిమతాల్లోను, అభిరుచుల్లోను, దృక్పథాల్లోనూ సామ్యమనేదేదీ మిగలకపోయినా, మన ఇరువురి జీవితాలను సూత్రప్రాయంగా కలుపుతూ పాప మిగిలింది. జీవితం రంగులకల. జాగ్రత్త వహించి నిలదొక్కుకోగలగాలి. దానిని ఓడించాలి. అందుకు నా విషయంలో శోధన, అన్వేషణ అవసరమనుకున్నాను. వెడుతున్నాను. నా ప్రయత్నంలో ఎంతవరకూ కృతకృత్యుణ్ణి అవుతానో! నువ్వు మాత్రం జీవితంలో విజేతగానే మిగిలిపోవాలని కోరుకుంటున్నాను' అని రాశాడు.

ఆ ఉత్తరం చూసినా భవానిలో మార్పు రాలేదు సరికదా! కృష్ణమూర్తిని సాధించి పాపని ఎలా తెచ్చుకోవాలా అని ఆవేశపడింది. అప్పటికీ, కొన్నాళ్ళ నుంచీ ట్యుటోరియల్‌లో పనిచేస్తూ భవానీతోనే వుంటున్న ఆమె స్నేహితురాలు రమ కొంతవరకు భవానికి కనువిప్పు కలిగించింది. పాపను బలవంతంగా వెనక్కి తీసుకొచ్చినా, పాప తన దగ్గర వుండదని, ప్రస్తుతానికి తండ్రితో వుండటమే మంచిదని రమ చెప్పి ఒప్పించింది. అంతేకాదు రమ చొరవవల్ల రావ్ నిజస్వరూపం బైటపడింది. అతను మోసగాడు. అతని డిగ్రీలన్నీ దొంగ డిగ్రీలు. అప్పటికే కాలేజీ సొమ్ము చాలా స్వాహా చేశాడు. నిత్యం తాగటం తోపాటు హాస్టల్‌లో విద్యార్థులకి తాగుడు, వ్యభిచారం అలవాటు చేశాడు. పోలీసుల రైడ్‌లో అన్నీ పట్టుపడ్డాయి. భవాని ట్యుటోరియల్ కాలేజీ మూసెయ్యకి తప్పలేదు.

భవాని జీవితం అల్లకల్లోలమైంది. పరువుపోయింది. భర్త, కూతురు ఎక్కడున్నారో తెలియదు. భర్త ఎంతో శాంతంగా చెప్పిన ఎన్నోమాటలు గుర్తొచ్చాయి. కూతురికి, అతనికి దూరంగా తన జీవితం మృతప్రాయంగా వుంది.

కృష్ణమూర్తి మద్రాసు థియోసఫికల్ సొసైటీకి చేరాడు. అక్కడ జగదీశ్వరయ్యగారి ఆశ్రయం దొరికింది. వారు పాపను కన్నబిడ్డకన్నా ఎక్కువగా చూసుకుంటుండగా, తన శోధన, అన్వేషణ కొనసాగించాడు కృష్ణమూర్తి. అతనికి ప్రశాంతంగా వుంది. పూర్తిగా ఆధ్యాత్మిక జీవితానికి అంకితం అయిపోదామనుకున్నాడు. కానీ అక్కడికి వచ్చిన రమ వల్ల, వీరి ఆచూకీ తెలిసి భవాని వచ్చింది. పెద్దాయన, అనుభవజ్ఞుడు అయిన జగదీశ్వరయ్యగారి వల్ల తిరిగి భార్యాభర్తలు కలిశారు. పాపతో కలిసిన వారి జీవితం తిరిగి ఆరంభమైంది.

'ఉషః కాంతులు మేలుకొంటున్నాయి' అన్న వాక్యంతో నవల ముగించారు రచయిత. ఈ కాంతులు భవాని జీవితంలో.. ఆ వెలుగులో ఆమె ఓ నూతన వ్యక్తి.

పురుషుడి పట్టుదల, పంతం కన్నా స్త్రీ పట్టుదల, పంతం మరింత బలమైనవి. ఆవేశం ఎక్కువ. ఇటువంటి సున్నితమైన విషయాల్ని, డబ్బుకున్న విలువని గ్రహించటంలో జాగ్రత్తని తెలియచెప్పిన నవల 'వెలుగులో వెలది'. కేవలం ప్రతిభతో మరో వ్యక్తిని తీర్చిదిద్దుతాననుకోటం ఒక్కోసారి ఎంత విధ్వంసకరమో వివరించిన నవల ఇది. యువతీ యువకులు ఒకర్నొకరు మార్చుకోవాలన్న ఉద్దేశంతో చేసుకున్న పెళ్ళిళ్ళు ఎంతటి అశాంతికి దారితీస్తాయో విపులంగా వివరించిన నవల. ©



# తనదాకా వస్తే..!

- బచ్చు సత్యనారాయణ

**యా**భై యేళ్ల 'సులేమాన్' సికిందరాబాద్ స్టేషన్ ముందు ఆటో దిగి, తన భారీకాయాన్ని మోసుకుంటూ టికెట్ కౌంటర్‌వైపు హడావుడిగా పరుగులాంటి నడకతో దారితీశాడు. చాంతాడంత 'క్యూ' చూసి కంగారుపడ్డాడు. ట్రైన్‌కింకా పావుగంట టైముంది. నోట్లో ఉన్న జర్దాపాన్ కసాపిసా నములుతూ లైన్లో నిలబడ్డాడు. తన ముందు నిలబడ్డ తెల్లటి లాల్చీ పైజమా ధరించిన వ్యక్తిని తట్టి, తన బ్యాగు చూస్తుండమని సైగచేసి, దగ్గరలో ఉన్న 'డస్ట్‌బిన్'లో ఉమ్మేసి వచ్చి 'క్యూ'లో నిలబడి పాన్ నమలసాగాడు.

'క్యూ' ఎంతకీ తరగడంలేదు. ఈలోగా ఇద్దరు ముగ్గురు 'క్యూ'లో జొరబడడానికి ప్రయత్నించారు. 'క్యూ'లో ఉన్నవాళ్లు గోల చేసేసరికి ఆగి వెనక్కెళ్లి నిలబడ్డారు. సులేమాన్ నోట్లో పాన్ తాలూకు లాలాజలం ఎక్కువైంది. మళ్లీ పక్కకెళ్లి ఉమ్మేసి వద్దామంటే వీలుపడక ఇబ్బంది పడుతున్నాడు. అలాగే ఓపిక పట్టుకున్నాడు. 'క్యూ' నెమ్మదిగా కదలడంతో బయటకొచ్చాక ఉమ్మేయొచ్చనుకొని నిలబడ్డాడు. అసలు జర్దాపాన్ ఘాటుకు గొంతంతా గరగరలాడుతోంది. ఇంతలో సులేమాన్‌కు హఠాత్తుగా తుమ్ము రావడంతో గట్టిగా తుమ్మాడు. ఆ తుమ్ముకు నోట్లో ఉన్న పాన్‌తో సహా లాలాజలమంతా ముందు నిలబడ్డ వ్యక్తి లాల్చీ పైజమా మీద ఎర్రని డిజైన్‌లా పడింది. దాంతో సులేమాన్ కంగారుపడ్డాడు.

లాల్చీ పైజమావ్యక్తి వెనక్కి తిరిగిచూసి సులేమాన్ పరిస్థితి అర్థం చేసుకొని ఫర్వాలేదని కళ్లతో సైగ చేశాడు. వెంటనే సులేమాన్ తన బ్యాగులోంచి టవల్ తీసి ఆ వ్యక్తికి అందించాడు. టవల్ అందుకొని తుడుచుకొని, తన బ్యాగుల్లోంచి వేరే బట్టలు తీసి పక్కకెళ్లి మార్చుకున్నాడు. విప్పిన పైజమా లాల్చీని ఓ పేపర్లో చుట్టి బ్యాగులో పెట్టుకుని వచ్చి 'క్యూ'లో నిలబడ్డాడు.

అతన్ని చూసి "మాఫ్ కరో భాయ్" అన్నాడు

## చతుర కథలు

సులేమాన్.

'క్యూ'లో ఉన్నోళ్లంతా సులేమాన్‌ని చూసి విసుక్కున్నారు.

"సార్! మీరు ఇది కావాలని చేసింది కాదు.

పెద్దవారు అంత మాటనొద్దు" అంటూ సులేమాన్‌కు టవల్ తిరిగిచ్చేశాడు.

అతని మంచితనానికి మనసులోనే ధన్యవాదాలు చెప్పుకున్నాడు సులేమాన్.

టికెట్ తీసుకొని ట్రైనెక్కి కిటికీ పక్కనే ఉన్న సీట్లో కూర్చున్నాడు సులేమాన్. ట్రైన్ కదిలింది. బీబీనగర్ దాటాక ట్రైన్ స్పీడందుకుంది. కిటికీలో నుంచి వచ్చే చల్లనిగాలికి సులేమాన్‌కు నిద్ర పట్టేసింది. కాసేపటికి అతని మొహంపై నీళ్లు పడేసరికి మెలకువ వచ్చి చూస్తే, ముందు సీట్లో కూర్చున్న ఓ పల్లెటూరి వ్యక్తి తన చిన్న పిల్లాడికి ఏదో తినిపించి, వాడి మూతి కడగటం కనిపించింది. అది చూసి సులేమాన్ "క్యారే, బేవకూఫ్, బద్మాష్ ఇది నీ ఇల్లనుకున్నావా? ధమాక్ నై? నీ కొడుకుమూతి కడిగిన నీళ్ళు నా మీద పడ్డాయ్. నా మొఖమంతా గలీజ్, గలీజ్ అయింది" అంటూ ఆ పల్లెటూరి వ్యక్తిని కొట్టినంత పనిచేసి ఎగబడ్డాడు.

అతని మాటలకు ఆ పల్లెటూరి వ్యక్తి భయపడుతూ "తప్పైంది సారూ, పిల్లోన్కి అన్నం తినబెట్టి, మూతి కడిగిన, గాలికి నీళ్లు మీ మీద పడ్డయి" అన్నాడు.

"గిట్లాంటి, ధమాక్‌లేనోల్లు ట్రైనెక్కితే, గిట్లనే ఉంటది" అంటూ కేకలేయడం మొదలుపెట్టాడు సులేమాన్.

ఇంతలో పైన పడుకున్న వ్యక్తి కల్పించుకొని.. "పోనీయండి భాయ్! అమాయకుడు, తప్పయిందంటున్నాడు కదా! ఛోడ్ దేవ్!" అంటూ సర్దిచెప్పబోయాడు.

వెంటనే సులేమాన్ "మీలాంటోళ్లు సపోర్టు చేయబట్టే ట్రైనంతా గలీజు, గలీజుగా తయారైతంది" అంటూ తలెత్తి పైకి చూశాడు. ఆ వ్యక్తి 'క్యూ'లో ఇందాక తను పైజమా లాల్చీపై తుమ్మడం వలన పాన్ లాలాజలం పడిన వ్యక్తిగా గుర్తించి సులేమాన్ నోట మాటరాక ఖిన్నుడై నోరెళ్లబెట్టి చూడసాగాడు. ©

# యానివర్సరీ

- ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి



అది ఒక పెద్ద కంపెనీ. భారతదేశమంతటా విస్తరించి ఉంది. ఎంతో పేరు గలది. కానీ ప్రస్తుతం నష్టాల్లో ఉంది. ఆ సంగతి ఎవరికీ తెలియకుండా నెట్టుకొస్తున్నాడు ఆ సంస్థ యజమాని రాజేంద్ర.

ఇపుడో సమస్య వచ్చి పడింది. ప్రతి ఏటా జనవరిలో సంస్థ 'యానివర్సరీ' చేసి కొందరు ఉద్యోగులకు సత్కారం చేయడం అలవాటు. ఫంక్షన్‌కి ఉద్యోగుల రాకపోకల ఖర్చులకు, భోజనాలకు, వసతికి అన్నిటికీ ఎంతో ఖర్చు అవుతుంది. మానేస్తే అవమానం, చేయాలంటే ఖర్చెక్కువ. ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడు యజమాని, ఎం.డి రాజేంద్ర.

ఇంతలో పి.ఎ ఏదో ఫైలు తీసుకుని లోపలికి వచ్చాడు. రాజేంద్ర విచారంగా ఉండడం చూసి కారణం అడిగాడు. అతను పి.ఎనే కాక ఆత్మీయుడు కూడా రాజేంద్రకి. అందుకే అసలు విషయం చెప్పాడు.

'నిజమే. కానీ తప్పదేమోగా..' అన్నాడు పి.ఎ.

అవునన్నట్లు తలూపాడు రాజేంద్ర.

ఫంక్షన్ జరిగిపోయింది. ఎక్కడా లోటన్నమాట వినబడలేదు. అందరూ సంతోషంగానే వెళ్లారు. ఆశ్చర్యం వేసింది రాజేంద్రకు. ఈసారి కొంత అసంతృప్తి తప్పదు కొందరికి అనుకున్నాడు. కానీ అలా జరగలేదు.

ఫంక్షన్ ఫైలు తెచ్చాడు పి.ఎ. రాజేంద్ర ఆశ్చర్యపోయాడు. బిల్లు చాలా తక్కువయింది. తనకు ఏమాత్రం బరువు కాదు. కానీ ఫంక్షను బాగా అయింది. ఇదెలా సాధ్యమైందని పి.ఎని అడిగాడు.

"సార్.. అందరినీ అరవై ఏళ్లు దాటిన వారినే సత్కారాలకు సెలెక్ట్ చేశాను. అరవై దాటడం వల్ల చాలామందికి బి.పిలు, షుగర్‌లు ఉన్నాయి. అందువల్ల స్వీట్లు, ఐస్‌క్రీముల ఖర్చు సగానికి పైగా తగ్గింది. ఇక ట్రాన్స్‌పోర్టు.. దూరం నుంచి రాలేమన్నారు, అందువల్ల ఆఫీసు గెస్ట్‌హౌస్‌లోనే సరిపెట్టుకున్నారు. హోటళ్ల ఖర్చు మిగిలింది. ఓపిక లేక సైటు సీయింగ్‌కి వెళ్లమన్నారు. ఇక పోతే మొమెంటోలు ఇదివరకు ఎక్కువగా చేయించినవి మిగిలే ఉన్నాయి. ఇంక ఖర్చేముంటుంది? " అన్నాడు నవ్వుతూ పి.ఎ.

"నీ ఇల్లు చల్లగుండా.. మరి అందరూ వృద్ధులే అయితే యంగ్‌స్టర్స్ గొడవ చెయ్యలేదా? "

"దాందేముంది.. మీకు ఎంతో భవిష్యత్తు ఉంది. తగిన వయసు ఉంది. పాపం వీళ్లు ఎప్పుడు రిటైర్ అవుతారో తెలియదు కదా" అన్నాను దాంతో వాళ్లు 'కూల్' అయిపోయారు. (ప్రయివేటు కంపెనీ కావడం వల్ల రిటైర్‌మెంటుకు ఫిక్స్‌డ్ వయసు లేదు).

"మరి వీళ్లు అందరూ పెద్దవాళ్లే కావడం అనుమానం రాలేదా? "

"వీళ్లకేం బాధ సార్? పైనుంచి మీకు పెద్దలంటే చాలా గౌరవం అన్నాను. వీళ్లు మురిసిపోయారు" అన్నాడు పి.ఎ.

"నీ ఇల్లు బంగారంగానూ. నీలాంటి అడ్వైజర్లు, పి.ఏలు ఉంటే మనమే కాదు, ఎవరూ అప్పులు చెయ్యక్కరలేదేమో" అన్నాడు నవ్వుతూ రాజేంద్ర, బిల్లు మీద సంతకం పెడుతూ. ©

# 'కోల్డ్' వార్!

**- ప్రతాప వెంకట సుబ్బారాయుడు**



కోదండరామయ్యగారికి మనసంతా వికలంగా వుంది.

వుండదు మరి? కూతురు శ్రావణిని లక్షల కట్నమిచ్చి చక్రధర్‌కి కట్టబెట్టాడు. తల్లిలేని పిల్ల. పెళ్ళై మూడు నెలలయింది. వాళ్ళ సంసారం ఎలావుందో చూసిరమ్మని తన నమ్మినబంటు అప్పిగాడిని పంపించాడు.

వాడు చెప్పింది విని హతాశుడయ్యాడు.

వాళ్ళ మధ్య మాటల్లేవట. ఎడముఖం పెడముఖంగా వుంటున్నారట. వాళ్ళిద్దరి మధ్యా ముద్దూముచ్చట అన్నది భూతద్దంతో వెతికి చూసినా కన్పించలేదట.

ఒక్కోమాటా ముల్లై ఆయన గుండెల్లో గుచ్చుకుంది.

పిల్లాడు మంచోడని.. ఆడపడుచుల గోల్లేదని, అత్తమామలు సాధు స్వభావులని జాగ్రత్తగా వాకబు చేసుకుని మరీ పిల్లనిచ్చాడు. అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడనేమో విధికి కన్ను కుట్టి ఇంతటి విపరీతం చేసింది.

'పిచ్చితల్లి ఎన్నిబాధలు పడుతోందో.. వెళ్ళి చూసొస్తేగాని, మనశ్శాంతి వుండదు' అనుకుని హుటాహుటిన పట్నానికి బయల్దేరాడు.

తమింటికొచ్చిన ఆయన్ని సాదరంగా ఆహ్వానించారు ఆ కొత్త దంపతులు.

చిలకా గోరింకల్లాంటి వాళ్ళ అన్యోన్యతకి.. అనురాగానికి ఎంతో ఆనందం కలిగింది. మనసంతా సంతోషంతో నిండిపోయింది. అయితే అప్పిగాడు చెప్పిందానికి అక్కడ కనిపిస్తున్నదానికి పొంతన కుదరక 'తన ముందు వాళ్ళలా నటిస్తున్నారేమో?' అన్న అనుమానం మనసుని మెలిపెడుతుంటే అల్లుడు ఆఫీసుకి వెళ్ళాక కూతుర్ని డైరెక్టుగా అడిగేశాడు.

దానికామె ఫకాల్న నవ్వి "అయ్యో! పిచ్చినాన్నా! అప్పిగాడు మా ఇంటి కొచ్చినపుడు ఆయనకి సివియర్ కోల్డ్ అంటే భయంకరమైన జలుబు. అది నాకెక్కడ అంటుకుని బాధ పెడుతుందో? అని మీ అల్లుడుగారు నాకు దూరంగా వుండి తల్లడిల్లిపోయారు. ఆయన గురించి మీకనుమానం అక్కర్లేదు. మా ఆయన బంగారం!" అంది.

ఆ మాట ఆయనకి వెయ్యేనుగుల బలాన్నిచ్చింది. అనంతమైన సంతృప్తిని కలిగించింది. ఆ రాత్రే ఊరికి బయల్దేరాడు ఆనందంగా. ©

13

# భామనే.. సత్యభామనే..!

## కొలంబియా అందం.. విశ్వసుందరం!

**పౌలిన వెగా.. ఇపుడు ఈ అందాల భామ ప్రపంచం చూపును ఒక్కసారిగా తనవైపు తిప్పు కుంది. 2014 యేడాది విశ్వసుందరిగా కిరీటాన్ని సొంతం చేసుకున్న ఈ చిన్నది 88 దేశాల సుందరీమణులను వెనక్కు తోసి ముందు నిలిచింది.. మహిళలు అందాన్ని మాత్రమే పరిగణన లోకి తీసుకోరు, తమ జీవిత లక్ష్యాన్ని ఎంచుకోవడంలో, దాన్ని నెరవేర్చుకోవడంలోనూ ఎంతో ప్రతిభని కనబరుస్తారు అంటున్న 22 ఏళ్ల ఈ విశ్వసుందరి గురించి మరిన్ని విశేషాలు మీకోసం..**




* ఎనిమిదేళ్ల ప్రాయంలోనే మోడల్ రంగంలో అడుగు పెట్టిందీ కొలంబియా ముద్దుగుమ్మ.
* చిన్నవయసులోనే విశ్వసుందరి స్థానాన్ని దక్కించుకున్న ఈమె అలవాట్లు చాలా ప్రత్యేకం.
* పౌలిన సగం కళ్లు తెరిచే నిద్రపోతుంది.
* జిమ్ చేసేపుడు విశ్రాంతికి వదిలే కొద్ది సమయాల్లో పాప్‌సంగీతం వింటూ డ్యాన్స్ చేస్తుంది. మళ్లీ వెంటనే వర్కవుట్స్‌లోకి వెళ్తుంది.
* పౌలిన తను చేయాల్సిన పనులు మర్చిపోకుండా ఓ కాగితం మీద రాసుకుని సమయానికి పూర్తి చేసుకుంటుంది.
* 56 ఏళ్ల సుదీర్ఘ కాలం తర్వాత కొలంబియా నుంచి విశ్వసుందరి కిరీటాన్ని గెలుచుకున్న ఈమె తమ దేశంలో విశ్వసుందరి టైటిల్‌ను అందుకున్న రెండో వ్యక్తి.
* పౌలిన అమ్మమ్మ ఎల్విరా కాస్టిల్లో 1953లో మిస్ అట్లాంటికో (ఇప్పటి కొలంబియా)గా నిలిచింది.
* పోటీ ప్రతి విభాగంలోనూ అత్యంత ఎక్కువ స్కోర్ సాధించిందీ అమ్మడు.
* వజ్ర కిరీటాన్ని ధరించిన మొట్టమొదటి విశ్వసుందరి పౌలిన. దాని వెల సుమారు కోటీ యాభై లక్షలట!
* బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ చివరి సంవత్సరం చదువుతోన్న పౌలినకు సొంతంగా ఏదైనా పరిశ్రమ పెట్టాలని కోరిక.

# కాగితం జూకాలు!



దుస్తులకు తగ్గట్టుగా రంగురంగుల జూకాలు పెట్టుకోవడం నేటి ఫ్యాషన్. అయితే వాటిని ఇంట్లోనే తక్కువ ఖర్చుతో చేసుకోగలిగితే..! కాస్త ఓపిక, కొంచెం సృజనాత్మకత ఉంటే చాలు.. రకరకాల జూకాలను మీరే తయారుచేసుకోవచ్చు. చాలా తేలిక కూడాను.. మరి వాటిని తయారు చేయడమెలా? కావలసిన పరికరాలేంటి..?





**కావలసిన వస్తువులు**

- ☆ స్లాటెడ్ టూల్ లేదా నీడిల్ టూల్
- ☆ క్విల్లింగ్ స్ట్రిప్స్: ఇంచు వెడల్పు (ఎంచుకున్న డిజైన్‌కనుగుణంగా) ఉండే రంగురంగుల పొడవాటి కాగితాలు.
- ☆ కత్తెర
- ☆ గమ్





**తయారుచేసే పద్ధతి:**

ముందుగా ఎంచుకున్న కాగితం తీసుకుని పక్కన బొమ్మలో చూపించిన విధంగా స్లాటెడ్ లేదా నీడిల్ టూల్‌కు చుట్టుకోవాలి. టూత్‌పిక్‌ను కూడా నీడిల్‌గా ఉపయోగించుకోవచ్చు. ప్రారంభంలో స్లాటెడ్ టూల్ ఉపయోగించడమే సులభం. ఎంచుకున్న డిజైన్‌ను బట్టి కాగితం చుట్ట వదులుగా లేదా బిగుతుగా చుట్టుకోవాలి. చూపుడు వేలు, బొటన వేలు ఉపయోగించి అదుముతూ ఉంటే కాగితం చుట్ట బిగుతుగా వస్తుంది. అలా కావలసిన సైజులో చుట్టుకుని చివరను కత్తిరించి గమ్‌తో అంటించుకోవాలి. వదులుగా కావాలంటే కాగితం కావలసినంత చుట్టాక చివర కత్తిరించి దాన్ని గమ్ అంటించకుండా ఓ నిమిషం వదలాలి. తర్వాత ఎంచుకున్న డిజైన్ ప్రకారం కాగితాన్ని మడుస్తూ కావలసిన నమూనా తయారుచేసుకోవాలి. అలా రెండు జూకాలకు కావలసిన చుట్టలు, ఆకృతులు తయారు చేసుకుని డిజైన్‌కనుగుణంగా గమ్‌తో అంటించుకోవాలి. వాటిని చెవికి పెట్టుకునేందుకు వీలుగా మార్కెట్‌లో దొరికే కొక్కేలు, హుక్కులు, రింగులను గమ్‌తో అంటించుకోవడం లేదా తగిలించడం చేయాలి. ఈ ఆభరణాలు మరింత అందంగా కనపడేందుకు రంగురంగుల పూసలు, చెమ్కీలు కూడా వాటికి అలంకరించుకోవచ్చు.

క్విల్లింగ్ సెట్ ఎంపోరియమ్స్‌లో లభిస్తుంది.







## మహిళా శక్తి



ఒకటిరెండు సార్లు ఓడిపోయినపుడే విజయం సాధించడం ఎంత కష్టమో తెలుస్తుంది. అపుడే విజయ సాధనకు సంసిద్ధం కావచ్చు.

– స్టెఫీ గ్రాఫ్



ధైర్యం అన్నది కండరం లాంటిది. ఉపయోగించిన కొద్దీ మరింత దృఢంగా మారుతుంది.

– రుత్ గోర్డన్

# టెక్ గురూ!

ఉద్యోగ రీత్యా, ఇతర అవసరాల రీత్యా ఒంటరిగా వెళ్లేపుడు మహిళలకు రక్షణగా ఇపుడు అనేక యాప్‌లు ఉచితంగా లభిస్తున్నాయి. వాటిలో కొన్ని..

**ఎస్ఓఎస్ స్టే సేఫ్**

మెసేజ్ లేదా ఫోన్ చేసే వీలు లేని పరిస్థితుల్లో ఈ యాప్ బాగా ఉపయోగపడుతుంది. అటువంటి సమయాల్లో ఒక్కసారి ఫోన్ ఊపితే చాలు సన్నిహితులకు అలారమ్‌తో పాటు మెసేజ్ వెళ్తుంది. ఒక నిమిషం నిడివి గల అక్కడి దశ్యాల వీడియోతో పాటు ఆ ప్రదేశం పేరు, ఆ మొబైల్‌లో చార్జింగ్ ఎంత ఉంది వంటి విషయాలు యాప్‌కు అనుసంధానం చేసిన అన్ని నంబర్లకు వెళ్తాయి. అంతేకాదు, ఎక్కడ ఉన్నదీ నిమిష నిమిషానికీ మెసేజ్ వెళ్తుంది. అనుసంధానంలో ఉన్న ఫోన్లు ఆండ్రాయిడ్ కానక్కర్లేదు. ఎటువంటి ఫోన్లకైనా మెసేజ్‌లు వెళ్తాయి. దాంతో ఆపదలో ఉన్నవారిని త్వరగా రక్షించే వీలు కలుగుతుంది.



**సేఫ్టీపిన్**

ఇంతకుమునుపెన్నడూ వెళ్లని ప్రదేశాలకు వెళ్తున్నపుడు ఈ యాప్ మంచి సలహాదారుగా పనిచేస్తుంది. ఆయా ప్రదేశాలు ఎటువంటివి? ఇంతకుముందు అక్కడ ఎటువంటి సంఘటనలు జరిగాయి? మహిళలకు ఎంతవరకు రక్షణ ఉంటుంది వంటి విషయాలు తెలియజేస్తుంది. అలా ఈ యాప్‌తో తగు జాగ్రత్తలు తీసుకుని పనులు పూర్తి చేసుకునే వీలుంటుంది.

**వుమెన్ సేఫ్టీ ఫీల్డ్ ప్రొటెక్షన్**

ఎక్కడ ఎటువంటి సమయంలోనైనా ఎమర్జెన్సీ బటన్‌ను నొక్కితే క్షణాల్లో అక్కడి ఫొటోలతో సహా ఆ ప్రదేశానికి సంబంధించిన వివరాలతో యాప్‌కి అనుసంధానంలో ఉన్న నంబర్లన్నిటికీ ఎస్సెమ్మెస్ వెళ్తుంది. దాంతో సంబంధీకులు వెంటనే అప్రమత్తమై రక్షణ చర్యలకు ఉపక్రమించొచ్చు

**రక్ష- వుమెన్ సేఫ్టీ అలర్ట్**

ఆపదలో ఉన్నపుడు ఒక్క బటన్ నొక్కితే చాలు క్షణాల్లో సంబంధీకులకు మీరు ఎక్కడున్నదీ మెసేజ్ వెళ్తుంది. మెసేజ్‌తోపాటు పెద్ద శబ్దం కూడా వినిపిస్తుంది వారికి. ఈ యాప్ ఆన్‌లో లేకపోయినప్పటికీ వాల్యూమ్ స్విచ్ నొక్కితే సంబంధీకులకు మ్యాప్‌తో సహా మీరు ఎక్కడ ఉన్నదీ సమాచారం మూడు సెకన్లలో వెళ్తుంది.

ఈ యాప్‌లను గూగుల్ ప్లే నుంచి నేరుగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు

# ప్రపంచ ప్రథములు



✷ ప్రపంచంలో ఎన్నికల పద్ధతి మొదలైన తర్వాత దేశ ప్రధాని పదవిని అధిరోహించిన మొదటి మహిళ శ్రీలంకకు చెందిన సిరిమావో బండారు నాయకే.

✷ జపాన్‌లో ప్రచురణ అయిన ప్రపంచ మొట్టమొదటి నవలను రచించింది ఓ మహిళే. ఆమె క్రీ.శ 1000 కాలానికి చెందిన మురాసాకి సికిబు.

✷ మహిళలకు ఓటు హక్కు కూడా లేని సమయంలో యు.ఎస్ ప్రెసిడెంట్ అయిన మొట్టమొదటి మహిళ విక్టోరియా వుడ్‌హుల్. ఆ తర్వాత యాభై సంవత్సరాలకు అక్కడ మహిళలకు ఓటు హక్కు లభించింది.

✷ మహిళా ఫిజీషియన్‌గా రికార్డులకెక్కిన మొదటి వైద్యురాలు ఈజిప్టుకు చెందిన మెరిత్ టాహ్. ఈమె క్రీ.పూ. 2700 కాలానికి చెందినది.

# జతపరచండి

ఇక్కడ కొందరు ప్రముఖ రచయిత్రులు, వారి రచనలు ఉన్నాయి.
ఇందులో ఏ రచన ఎవరిదో కనుక్కోగలరేమో ప్రయత్నించండి..

| | |
|---|---|
| 1. జె.కె. రోలింగ్ | ఎ. ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్ |
| 2. చార్లొట్టి ఏజెల్ | బి. సువర్ణరేఖ |
| 3. ఇసాబెల్ అలెండె | సి. ది ఇంపర్సనేటర్స్ |
| 4. మేరీ ఆస్టిన్ | డి. హ్యారీపోటర్ |
| 5. నందిని సహు | ఇ. టు ది ఐలండ్ |
| 6. అగాథా క్రిస్టీ | ఎఫ్. ది హౌస్ ఆఫ్ స్పిరిట్స్ |
| 7. అరుంధతీ రాయ్ | జి. డెత్ ఆన్ ది నైల్ |
| 8. జెస్సికా ఆండర్సన్ | హెచ్. ది లాండ్ ఆఫ్ లిటిల్ రెయిన్ |

జవాబులు ఈ సంచికలోనే..




**రింగ్‌టోన్!**



తండ్రి : నీకు ఎన్నిసార్లు ఫోన్ చేసినా స్విచ్ఛ్ ఆఫ్ అని వస్తోందేరా? ఎక్కడికెళ్లావు ఇంత సేపు?

కూతురు: అదే నా రింగ్‌టోన్ నాన్నా!

**ముందే తెలిస్తే..!**

శ్యామ్: అరేయ్ రవి! ఎందుకంత బాధగా ఉన్నావురా?

రవి: లోన్ తీసుకుని కారు కొన్నానురా. డబ్బు కట్టలేదని బ్యాంకువాళ్లు కారు తీసుకెళ్లారు...

శ్యామ్: పోనీలే డబ్బు కట్టి మళ్లీ తెచ్చుకుందువుగానీ.



రవి: చెప్పేది పూర్తిగా వినవేం? నా దిగులు దాని గురించి కాదు, నాకీ విషయం ముందు తెలిసి ఉంటే పెళ్లికూడా లోన్ తీసుకునే చేసుకునేవాణ్ణి!

**నేనలా చేయను**

యజమాని: నీకు దారిలో వంద రూపాయలు దొరికితే గబుక్కున తీసి జేబులో పెట్టుకుంటావు కదూ?



సేవకుడు: లేదు లేదు.. నేనలా చేయను.

యజమాని: మరేం చేస్తావు?

సేవకుడు: వెంటనే ఖర్చు పెట్టేస్తా.

# వేసవిలో చల్లచల్లగా...

చిటికెలో రుచిగా..!

## లేత కొబ్బరి పానీయం

*తయారీ విధానం :*

లేత కొబ్బరి, పాలు, పంచదార, క్రష్డ్ ఐస్‌ని మిక్సీ పట్టాలి. ఇందులో కొబ్బరినీళ్ళు కూడా కలిపి బాగా గిలకొట్టి గ్లాసుల్లో పోసి సర్వ్ చేయాలి. వేసవికాలంలో వడదెబ్బ తగలకుండా ఈ పానీయం బాగా ఉపయోగపడుతుంది.



### కావలసిన పదార్థాలు

- కొబ్బరి నీళ్ళు - 1 గ్లాసు
- లేత కొబ్బరి- అరకప్పు (కొబ్బరి బొండాం నుంచి తీసిన కొబ్బరి)
- పాలు- మూడు స్పూన్లు
- పంచదార- నాలుగు స్పూన్లు
- క్రష్డ్‌ఐస్ - మూడు/నాలుగు క్యూబ్స్

## నిమ్మ కొబ్బరి పానీయం

### కావలసిన పదార్థాలు

- లేత కొబ్బరి- ఒక కప్పు (కొబ్బరి బొండాం నుంచి తీసిన కొబ్బరి)
- నిమ్మరసం - ఒక టేబుల్ స్పూన్
- అల్లం రసం - ఒక టేబుల్ స్పూన్
- తాజా పుదీనా ఆకులు
- సోడా- ఒక లీటర్
- ఐస్ క్యూబ్స్

*తయారీ విధానం :*

లేతకొబ్బరిని మిక్సీ పట్టాలి. ఇందులో నిమ్మ కాయ రసం, అల్లం రసంవేసి బాగా కలపాలి. ఒక పెద్ద జగ్గు తీసుకుని అందులో పుదీనా ఆకులు, ఐస్ క్యూబ్స్ వేయాలి. ఇందులో ముందుగా కలిపి ఉంచుకున్న మిశ్ర మాన్ని, సోడాను వేసి బాగా కలిపి చల్లచల్లగా గ్లాసుల్లో పోసి అందించాలి. ఈ పానీయం శరీరంలోని వేడిని తగ్గిస్తుంది.



జతపరచండి? జవాబులు : 1. డి, 2. ఇ, 3. ఎఫ్, 4. హెచ్, 5. బి, 6. జి, 7. ఎ, 8. సి

## చిట్కాలక్ష్మి

★ ఫ్రిజ్‌లో ఏవైనా పదార్థాలు పెట్టినపుడు వాటిపై మూతలు ఉంచాలి. లేదంటే కవర్‌లో చుట్టి పెట్టాలి. విడిగా పెట్టడం వల్ల వాటి తేమ ఫ్రిజ్ అంతా వ్యాపించి ఫ్రిజ్ తొందరగా పాడవుతుంది.

★ వేసవిలో పాలు విరిగిపోకుండా ఉండాలంటే కాచే ముందు పాలలో చిటికెడు వంటసోడాని కలపాలి.



అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వేదుల నరసింహమూర్తి**
303, శ్రీ బాలాజీ రెసిడెన్సీ,
13, ఎస్.బి.ఐ. కాలనీ,
గుడిమల్కాపూర్, హైదరాబాద్
పిన్ : 500028

## చతురంగం - 47 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 సా | త్య | 2 కి | ■ | 3 అ | తి | 4 వ | ■ | 5 శి | 6 క్ష |
| వి | ■ | 7 రీ | జ | ను | ■ | 8 ని | రీ | క్ష | ణం |
| 9 త్రి | 10 కో | టి | ■ | 11 జు | 12 రా | త | ■ | ణ | ■ |
| ■ | తు | ■ | 13 క | లు | గు | ■ | 14 స | ■ | 15 ప |
| 16 అ | లు | 17 పు | ■ | ■ | లు | ■ | 18 రి | పే | రు |
| రు | ■ | 19 నీ | లా | 20 లు | ■ | 21 పూ | త | ■ | వు |
| 22 దు | 23 రం | తం | ■ | 24 ప | 25 చా | రీ | ■ | 26 మే | ■ |
| ■ | గా | ■ | 27 స | గ | టు | ■ | 28 కా | ను | 29 పు |
| 30 పా | రా | 31 వా | రం | ■ | 32 వు | 33 ల | క | ■ | డ |
| 34 పా | వు | రం | ■ | 35 చి | లు | క | ■ | 36 లే | మి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. బి. నాగరమణి, అల్వాల్, 2. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 3. వై.ఎస్.పి. రావు, విశాఖపట్నం, 4. తిప్పావఝుల తుల శమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 5. యు. విజయ శేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 6. వి. చిరంజీవి, నల్లకుంట, 7. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 8. డి. మధూలిక, హన్మకొండ, 9. డా. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 10. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 11. పి. శుభ, బంజా రాహిల్స్, 12. అడపా సత్యనారాయణ బాబ్జి, కూకట్‌పల్లి, 13. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 14. జి. ప్రభా కర్‌రావు, మల్లాపూర్, 15. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 16. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 17. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 18. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 19. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 20. ఎం. పల్లవి, బోరబండ, 21. గోగాడ వెంకట సింహాచలపతిరావు, హోస్పేట, 22. నేరళ్ల వెంకటరావు, విజయనగరం, 23. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖ, 24. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 25. నియాజ్ అలీ, హైదరాబాద్, 26. ధరణి పద్మాసన, నల్లకుంట, 27. ముక్కెర రమేశ్‌చంద్ర, గుర్రంపేట, వరంగల్ జిల్లా, 28. యజ్ఞమూర్తి మానస, మాసాబ్‌ట్యాంక్, 29. జి. రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 30. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 31. పెద్ది దత్తా త్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 32. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 33. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 34. మండవ శివరావు, ఖానాపురం, వరంగల్ జిల్లా, 35. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, మానేపల్లి, తూ.గో. జిల్లా, 36. కొక్కెరగడ్డ శ్రీదేవి, అమలాపురం, 37. బద్దెపూడి లక్ష్మీసుశీల, చీరాల, 38. మామిడన్న ఉషారాణి, కొత్తగూడెం, 39. వి. సీత, విజయవాడ, 40. గురజాల వరలక్ష్మి, ఉప్పలి, తూ.గో. జిల్లా, 41. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 42. మొహ్మద్ ఖాసిం, కల్లూరిగూడెం, ఖమ్మం జిల్లా, 43. అనంతుల స్వరూపరాణి, గుంటూరు, 44. వి. శ్రావణి, కూక ట్‌పల్లి, 45. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 46. ఎస్. మణిమేగలై, తిరుపతి, 47. ఎం. లక్ష్మీరాజ్యం, హైద రాబాద్, 48. టి. మహానందప్ప, మైదుకూరు, కడప జిల్లా, 49. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా, 50. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 51. శివలెంక మాధవి, మెహిదీపట్నం, 52. దేవగ్రాజు లలితాదేవి, చైతన్యపురి, 53. దేవగ్రాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 54. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 55. పేర్వేల సత్య వతి, మణికొండ, 56. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 57. బిరుదు సురేష్‌బాబు, పేరాల, 58. కనకల అప్పా రావు, విజయవాడ, 59. యు.యు.యు. ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా, 60. కె. నాగభూషణం, మౌలాలి, 61. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణా జిల్లా, 62. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 63. ఎస్. జానకి సుబ్రహ్మణ్యం, హైదరాబాద్, 64. పి. సుజాత, గుంటూరు, 65. పి.బి. సీతాదేవి, నరసాపురం, 66. జె. విజయలక్ష్మి, హైదరాబాద్, 67. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 68. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 69. తటవర్తి రామకృష్ణ, హైదరాబాద్, 70. డా. శిభూషణం, కర్నూలు, 71. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 72. అరుంధతీ చంద్ర, కరీంనగర్, 73. డి.వి. సూర్యకుమారి, విశాఖ, 74. జె.వి. రామకృష్ణ, కాట్రేనికోన, తూ.గో. జిల్లా, 75. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 76. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 77. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 78. శివలెంక రాజమల్లికార్జునరావు, హైదరాబాద్, 79. కోటి బాబూరావు ఆచారి, జడ్. రాగంపేట, తూ.గో. జిల్లా, 80. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 81. ఎన్.కె. అర వెల్లి, సిరోంచ, మహారాష్ట్ర, 82. నిమ్మల రమాదేవి, హనుమకొండ, 83. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 84. వక్క లంక విజయలక్ష్మి, విజయనగరం, 85. టి. శశికళ, గుంతకల్లు, 86. నేలటూరు పద్మావతి, ఒంగోలు, 87. ఎస్. సమీర్, నంద్యాల, 88. కె. సుబ్రహ్మణ్యం, అనంతపురం, 89. డి. అనూష, కీళపూడి, చిత్తూరు జిల్లా, 90. ఎస్.ఆ ర్.కె. మూర్తి, విజయవాడ, 91. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా, 92. అల్లూరి ఉమ, సింగరాయ కొండ, ప్రకాశం జిల్లా, 93. దొడియం లక్ష్మీప్రసన్న, మల్లాపూర్, 94. కె. వెంకటబ్రహ్మమ్మ, బాపట్ల, గుంటూరు జిల్లా, 95. కె.వి. భారతి, పాకాల, చిత్తూరు జిల్లా, 96. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, (..128లో)

# చతురంగం - 48 ఆధారాలు

### అడ్డం

1. పవన్‌కల్యాణ్, వెంకటేశ్‌ల సినిమా (6)
7. చదరంగంలో ఆటగాళ్లు వీటిని కదుపుతారు (3)
8. మన్యం వీరుడి పేరులో తొలి రెండక్షరాలు ఎగిరిపోయాయి (4)
10. మంత్రగాళ్లు చేసేది (5)
12. నడుమ లోపించిన గొప్పవాడు (2)
13. ఇదో రకం పిట్ట అటునుంచి (3)
15. తెలంగాణ రాష్ట్ర పూవు (5)
17. మహిళ (1)
18. నొప్పి, బాధపెట్టు (3)
20. బొమ్మ (3)
22. కర్నూలు జిల్లాలో నరసింహక్షేత్రం (4)
24. సామాన్యుడికి అందకుండా మండేవి గందరగోళం (3)
25. సర్పము (2)
26. వెంకటేశ్, ఆసిన్‌ల సినిమా (3)
27. శబ్దం (2)
28. 'అవును'కు వ్యతిరేకం (2)
29. వదనము (3)
31. కారణమైనది (4)
33. నమస్కారము (2)
34. మనం ఎక్కి తిరిగేవే గజిబిజి (5)

### నిలువు

1. శ్రీకృష్ణుడు (4)
2. నాలుగోవంతు (2)
3. పూల దండలే గజిబిజి (4)
4. రుక్మిణీ సత్యల గొడవకు కారణమైన పువ్వు (4)
5. పిపీలికం (2)
6. బ్రహ్మదేవుడు (3)
8. దశరథుని పుత్రుడు (3)
9. 'ఈ జీవన తరంగాలలో...' పాటకు సంగీత దర్శకుడు (4)
11. సంజయదత్ మున్నాభాయ్‌కి ముందున్న పేరు (4)
14. బలరాముని భార్య, 27వ నక్షత్రం (3)
16. 'అరుదుగా కనిపించేవాళ్లం' అనే అర్థంలో 'కంటిలో నల్ల - - - అంటారు (3)
19. పట్టణము (3)
20. ఉషాకిరణ్‌కు గొప్ప పేరు తెచ్చిన చిత్రం (5)
21. చావు (4)
22. పెదవి (4)
23. కుమారుడు/ కుమార్తె (2)
25. రాముడి దగ్గర నుంచి వేటిని తెచ్చి భరతుడు పట్టాభిషేకం చేశాడు (4)
28. తీపి కాదు, చుర్రుమనిపించేది (3)
30. గాడిద (2)
31. అడవి (2)
32. అజీర్ణానికి ఔషధమైన వంట దినుసు తలకిందులు (2)

(127వ పేజీ తరువాయి...)

97. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 98. సౌదామిని నాగారాజన్, విశాఖ, 99. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 100. యీర్ల జ్యోతి, విజయనగరం, 101. శీతేపల్లి కామేశ్వరి, విజయవాడ, 102. వి. వెంకటసుబ్బారావు, బెంగళూరు, 103. అనసూయ ఉయ్యూరు, తిరువూరు, కృష్ణా జిల్లా, 104. కమలారజని పువ్వాడ, గుంటూరు, 105. ఎ. రంగనాథం, బెంగళూరు, 106. డి.వి. కామేశ్వరి, విశాఖ, 107. పి. రమణకుమారి, బర్కత్‌పుర, 108. లింగబత్తుల భవ్యశ్రీ, హైదరాబాద్, 109. డి. వసుంధరాదేవి, కాకినాడ, 110. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 111. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 112. టి. విజయలక్ష్మీదేవి, హైదరాబాద్, 113. జి. సత్యలక్ష్మి, విజయవాడ, 114. డి. రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 115. మెడికల్ వీరేశ్, మద్దికెర, కర్నూలు జిల్లా, 116. యు. నాగప్ప, మద్దికెర, కర్నూలు జిల్లా, 117. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 118. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 119. ఎ.ఎ.ఎన్. భుక్త, శ్రీకాకుళం, 120. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 121. పి.ఎల్.ఎన్. ప్రభావతి, వనస్థలిపురం. 122. సిహెచ్. ప్రమీలనసీరుద్దీన్, కరీంనగర్, 123. తల్లాప్రగడ సుబ్బలక్ష్మి, రాజమండ్రి.

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO, VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2015

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

**CHATURA** Telugu Monthly, Dt. of publication : March 1, 2015.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978

# చతురంగం - 48

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : మార్చి 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | | ■ | 5 | ■ | 6 |
| 7 | | | ■ | | ■ | 8 | | 9 | |
| | ■ | 10 | | | 11 | | ■ | 12 ఘ | |
| 13 | 14 | పూ | ■ | 15 | | | 16 | | ■ |
| ■ | | ■ | 17 | ■ | | ■ | 18 | | 19 |
| 20 | | 21 | ■ | 22 | | 23 | లం | ■ | |
| | ■ | 24 | | | ■ | | ■ | 25 | |
| 26 | | | ■ | 27 | | ■ | 28 | | ■ |
| | ■ | 29 | 30 | | ■ | 31 | | | 32 |
| 33 | | ■ | | ■ | 34 హ | | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (     ) చిరునామా : ------------------------------

--------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532